# ఏరిన ముత్యాలు

★ తనకుతాను తృప్తిపడే మానవుడు ఇక ఎదగడు.

-గాంధీజీ

★ రాయబారి అనేవాడు కళ్ళు, చెవులు ఎప్పుడూ తెరుచుకొని ఉండాలి. నోరుమాత్రం మూసుకొని ఉండాలి.

-నెహ్రూ

★ రహస్యాలు ఎప్పుడూ కాగితంపై రాసిపెట్టుకోకూడదు. అది పైకి విసిరిన రాయితో సమానం. ఎప్పుడు నెత్తిన పడుతుందో చెప్పలేం.

-కాల్డెరాన్

★ ఎక్కువగా మాట్లాడేవారెప్పుడూ తక్కువగా ఆలోచిస్తారు.

-డ్రైడన్

★ చెడ్డ అలవాటును కిటికీలోనుండి ఒక్కసారిగా విసిరివేయలేం. బుజ్జగిస్తూ మెట్లమీదనుండి మెల్లగా సాగనంపాలి.

-అల్ఫాంజో

★ నీ జీవిత సముద్రాన్ని దాటడానికి స్నేహాన్ని మించిన నావలేదు.

-ఫోర్బ్స్

★ అనుభవాన్ని మించిన పాఠంలేదు. ప్రకృతిని మించిన గురువులేదు.

-ఛాందోగ్యోపనిషత్

★ సజ్జనుల సంపాదన మేఘములవలె మరల త్యాగము కొరకే.

-కాళిదాసు

★ కార్యసాఫల్యమునకు మనోనిశ్చయం ప్రథమస్థానంలో వుండాలి.

-కందుకూరి వీరేశలింగం

★ రాపిడి లేనిదే రత్నం ప్రకాశించదు. కష్టాలను తట్టుకోలేనివాడు పరిపూర్ణుడు కాలేడు.

-చైనా సామెత

★ కుడిచేతిలో క్రియాశక్తి ఉంటే ఎడమచేతిలో విజయలక్ష్మి వాలుతుంది.

-అథర్వణవేదం

★ ఆశయశుద్ధిలేని జీవితం చుక్కానిలేని నావవంటిది.

-స్వామి శివానంద

★ రచయిత మేధావిలా ఆలోచించాలి. కానీ మామూలు మనిషికి కూడా అర్థమయ్యే భాష ఉపయోగించాలి.

-అరిస్టాటిల్

★ ఒక మనిషి గొప్పతనాన్ని అతని శత్రువుని చూసి చెప్పొచ్చు

-వివేకానంద

సేకరణ: వాకాడ దుర్గాప్రసాద్

# చతుర కతలు

## టిట్‌ఫర్...

బాస్‌ని చూస్తుంటే రాంబాబుకి వొళ్లు మండిపోతోంది.

రాంబాబు బాస్ వ్యాఘ్రేశ్వరరావు ఆఫీసులోనే చండశాసన ముండావాడుగానీ ఇంటి దగ్గర మాత్రం పిల్లి! ఈ కారణంగా ఆ కోపం, ఈ తాపం కలిపి తన జులుం అంతా స్టాఫ్ మీద ప్రదర్శించేస్తూ వుంటాడు.

అయితే రాంబాబుకి వ్యాఘ్రేశ్వరరావు మీద మండడానికి ఇది ఒక్కటే కారణం కాదు.

వ్యాఘ్రేశ్వరరావు ఆఫీసులో ఉండగా ఆయనగారికి ఇంటిదగ్గర్నుంచి భార్యామణి ఛాయాకాంతం చేసే ఫోను కాల్స్‌ని ముందు రాంబాబునే రిసీవ్ చేసుకోమంటాడు.

ఈ మాత్రానికే రాంబాబుకి వళ్ళు మండడమెందుకూ అనిపిస్తుంది గానీ, అక్కడే వుంది మతలబు.

ఫోను తీసీ తీయంగానే ఆ ఛాయాకాంతం గారు, అదే బాస్ వ్యాఘ్రేశ్వరరావుగారి భార్యామణి 'తిట్లదండకం' అందుకుంటుంది. ఇవతల వాళ్ళ మాటలు అస్సలు విన్పించుకోదు. ఓ రెండుమూడు నిమిషాలు అదే స్ట్రోక్. ఎక్కడా విరామం ఉండదు.

అవతల ఆమెకు అలుపువచ్చి ఆగేవేళకి, "ఆ... ఇటివ్వోయ్ రాంబాబూ" అని ఆ ఫోను తీసుకుంటారు వ్యాఘ్రేశ్వరరావు గారు.



ప్రతిరోజూ ఈ బాధ భరించలేకపోతున్నాడు రాంబాబు. పోనీ రాజీనామా చేసేద్దామంటే మరో ఉద్యోగం దొరుకుతుందన్న గ్యారెంటీ లేదు.

అడకత్తెర్లో ఇలా పోకచెక్కలా నలిగిపోతున్న రాంబాబుకి ఓ ఫైన్ మార్నింగ్ మంచి ఆలోచనొకటి ఫ్లాష్‌లా వచ్చింది.

ఆరోజు యథాప్రకారం ఎర్రరంగు ఫోన్ మోగసాగింది బాస్ ఛాంబర్లో.

"రాంబాబూ!" అని వ్యాఘ్రేశ్వరరావు పిలవగానే పరుగులాంటి నడకతో కదిలి ఫోనుందుకున్నాడు రాంబాబు.

అతనలా ఫోను తీసుకున్న తర్వాత ఓ మూడు నిమిషాలపాటు ఆ ముఖ కవళికల్ని గమనిస్తూ శాడిస్టిక్‌గా నవ్వుకొనే వ్యాఘ్రేశ్వరరావు ఈసారి రాంబాబు ముఖంలో ఆ కళలు కనిపించకపోవడంతో ఖంగుతిన్నాడు.

అనుమానంగా చూసి, "ఏదీ ఇటివ్వు" అని రిసీవరు లాక్కొని, చెవికాన్చుకొనేంతలోనే ఉలిక్కిపడ్డాడతను. అవతల ఛాయాకాంతం బండ బూతులు తిడుతోంది ప్రవాహంలా.

"ఇంతసేపూ నీతో ఏం చెప్పిందోయ్... అంతలా ముసిముసి నవ్వులు నవ్వావు" అడిగాడు వ్యాఘ్రేశ్వరరావు సందేహంగా.

"స్వీట్ నథింగ్స్ సార్! మీతో చెప్పుకోలేనివి..." వినయంగా చెప్పి, ఛాంబర్లోంచి వెళ్ళిపోయాడు రాంబాబు.

సీట్లో వాడు సీట్లోనే స్పృహతప్పిపోయాడు వ్యాఘ్రేశ్వరరావు.

**—యన్.కె. నాగేశ్వరరావు**

---

## స్పృహ

కామేశ్వర్రావు ఓరోజు ఆఫీసు డ్యూటీ మీద హఠాత్తుగా హైద్రాబాద్ వెళ్ళాల్సి వచ్చింది. ముందుగా తెలియనందున రిజర్వేషన్ కుదరలేదు. అయినా సరే, పాయిఖానాలోనన్నా ప్రయాణించి పని పూర్తిచేసుకురమ్మని బాసు ఆజ్ఞ.

మద్రాసు టు హైద్రాబాద్ ఎక్స్‌ప్రెస్ పది నిముషాలలో వస్తుందనగా ఫ్లాట్‌ఫాం మీదకు పరుగెత్తుకొచ్చాడు కామేశ్వర్రావు.

పుట్ట పగిలినట్లు జనం.

"ఇంత రష్‌లో రిజర్వేషన్ సంగతి దేవుడెరుగు. జనరల్ కంపార్ట్‌మెంట్‌లోనన్నా సీటు దొరుకుతుందా!" అని దిగులుపడుతున్న కామేశ్వర్రావుకు దేవుడిలా దర్శనమిచ్చాడు 'వాడు.'

ఆ 'వాడు' బక్కగా వున్నాడు, అస్థిపంజరానికి తోలు అంటించినట్లు.

"సీటు కావాలా సార్!" సెల్స్ అయిపోయిన రేడియోలా గొంతు గరగరమంటోంది.

"కావాలి"

"యాభైరూపాయలిటు కొట్టండి దర్జాగా వెళ్ళి సీట్లో కూర్చోండి" అన్నాడు.

కామేశ్వర్రావు యాభయ్యా సమర్పించుకున్నాడు. దర్జాగా వెళ్ళి సీటులో కూర్చున్నాడు.

"ఈ సీటు నువ్వెలా సంపాదించావోయ్? " అని అడిగాడు కామేశ్వరరావు వాడిని.

"ఆ సీక్రెట్ మీకెందుకు సార్" అని వెళ్ళబోతున్న వాడి చెయ్యి పట్టుకుని మరో పది రూపాయలు కొట్టి "వివరంగా చెబితే మరో పది రూపాయలిస్తా" అన్నాడు.

"మేమంతా ఒక గ్రూప్ సార్! కొంతమందిమి అవుటర్ సిగ్నల్ దగ్గర బండి స్లో అయి పోగానే బండెక్కేసి గుడ్డలు పరిచేస్తాం జనరల్ కంపార్ట్‌మెంట్‌లో. ఫ్లాట్‌ఫాం మీదకు రాగానే మీబోటివాళ్ళకు అమ్ముకుంటాం" అన్నాడు.

బిల్‌క్లింటన్‌ను మించిన బుర్రలు. చదువే కనుక వచ్చుంటే ఎంత గొప్పవాళ్ళయుండే వాళ్ళో వీళ్లు అనుకున్నాడు కామేశ్వర్రావు.

"పెట్టుబడిలేని వ్యాపారం. రోజుకేమాత్రం వస్తుంది? " అనడిగేడు.

"పంచుకుంటే తలా రెండొందలు మించి రాదు సార్. ఇందులో స్టేషనోళ్ళకి కూడా వాటా వుంటుందండీ! అయినా ఇంత ఇవరంగా అడుగుతున్నారు. మీరేమైనా



సి.ఐ.డి. వోళ్ళా" అన్నాడు వాడు అనుమానంగా.

కామేశ్వర్రావు ముసిముసి నవ్వులు నవ్వాడు. "కాదోయ్... కథలు రాద్దామని. మీ బోటివాళ్ళను గురించి రాస్తే మంచి వేల్యూ వస్తుంది కథకు. ఇదివరకిట్లాగే ఒక కుష్టు పిల్లను గురించి రాసి కథల పోటీలో ప్రైజ్ కొట్టేశా. వెయ్యి రూపాయలొచ్చిందప్పుడు" అని వాడి చేతిలో పదిరూపాయలు పెట్టి "ప్రభుత్వం ప్రజలకోసం ఏర్పాటుచేసిన బండిలో మీవి కాని సీట్లను ఇట్లా అమ్ముకోవటం తప్పనిపించటంలా... దీనికన్నా చక్కగా చదువుకొని పైకిరారాదూ? "అన్నాడు.

గభాలున వాడు నోటు లాగేసుకుని పోతూ "ఎందుకుసార్... మీకులాగా కుష్టు వాళ్ళమీదా, ముష్టోళ్ళమీదా, మాబోటి కష్టజీవులమీదా కతలు రాసి పైసలు కొట్టేయటానికా!" అన్నాడు

కామేశ్వర్రావుకు సామాజిక స్పృహ మాట అటుంచి గింగిరాలు తిరిగి కళ్ళు బైర్లుకమ్మాయి.

*–కర్లపాలెం హనుమంతరావు*

---

## అమ్మంటే...

"మమ్మీ! అయామ్ హోమ్" అంటూ వచ్చాడు టింటూ ఉరఫ్ తరుణ్ టీ.వీ లో తను తరుచూ చూస్తున్న అడ్వర్టయిజ్మెంట్ లోని స్టైయిల్లో.

"వచ్చావా కన్నా! త్వరగా ఫేస్‌వాష్ చేసుకో. వేడివేడిగా టిఫిన్ తిందువుగానీ" అంటూ వంటింట్లోంచి వచ్చింది సుకన్య.

ఆతర్వాత టింటూకు టిఫిన్ తినిపిస్తూ "ఈరోజు స్కూల్లో వాట్ హాపెండ్?" అంటూ వచ్చీరాని ఇంగ్లీషులో ఎంక్వైయిరీ చేసింది.

"మమ్మీ! టుడే నోక్లాసెస్. ఓన్లీ గేమ్స్‌ప్లేయింగ్" చెప్పాడు టింటూ.

ఒకటోక్లాసు చదువుతున్న టింటూ ఆమాత్రం ఇంగ్లీషులో మాట్లాడ్డంతో 'కాన్వెంట్ లో చదివిస్తున్నందుకు సార్థకమైంది' అనుకుంటూ పొంగిపోయింది మమ్మీ మనసు.

తన కొడుక్కి ఇంగ్లీషు బాగా రావాలనీ, వాడు ఇంగ్లీషులోనే మాట్లాడాలనీ భర్తతో

తగవులాడి పదిహేనువేల రూపాయల డొనేషన్ కట్టాలన్నా, తర్వాత మూణ్ణెల్లకోసారి టర్మ్‌ఫీజు ఐదొందల రూపాయలు కట్టాలన్నా, వెనుకాడక వాడిని ఊళ్లోఉన్న ఫేమస్ కాన్వెంట్ లో చేర్పించింది సుకన్య. వాడిని గొప్పవాడిని చేయాలని వాడు పుట్టినప్పటినుండీ కలలు కనేది. వాడికి 'తరుణ్' అనే పేరు పెట్టినా స్టైల్‌గా, ముద్దుగా ఉంటుందని టింటూ అని పిలుస్తున్నారు. ఇంట్లోకూడా వాడితో ఇంగ్లీషులోనే మాట్లాడాలని రీసెంట్‌గా ఆమెకూడా స్పోకెన్ ఇంగ్లీషు క్లాసెస్ లో జాయినయింది.

ఆరోజు రాత్రి హోమ్‌వర్క్ చేసుకున్నాక టింటూ డాడీతో "డాడీ! ఈరోజు తెలుగు మిస్ మా అందర్నీ చాలా క్వశ్చన్స్ అడిగారు. 'మీ ఇంటిలో ఎవరెవరుంటారు?' అని అడిగితే నేను 'మా ఇంట్లో మమ్మీ, డాడీ, ట్యాంపీ(డాగ్) ఉంటామని చెప్పాను. మరేమో రాజేష్‌ను అడిగితే వాడు వాళ్లింట్లో వాళ్ల అమ్మ, గ్రాండ్‌పా మాత్రమే ఉంటారని చెప్పాడు. పాపం! వాడికి మమ్మీ, డాడీ లేరంట. ఒక్క అమ్మ మాత్రమే ఉందట. అమ్మంటే ఎవరు డాడీ? మనింట్లో అమ్మ లేదుగా! మరి ఎక్కడికెళ్లింది? " అని అడిగాడు.



వాడి మాటలు విన్న ఆ "మమ్మీ","డాడీ"లు ఆశ్చర్యపోయారు. గొప్పలకు పోయి వాడికి మమ్మీనే తెలుగులో 'అమ్మ' అంటారనికూడా తెలియకుండా చేశామని బాధపడాలో లేక మమ్మీ, డాడీ అంటూ ఇంగ్లీషులో మాత్రమే మాట్లాడుతున్నందుకు సంతోషపడాలో తెలీక అలానే చూస్తుండిపోయారు.

-బి. నరహరి

---

## ప్లీజ్ కూర్చోండి

పిచ్చాసుపత్రిలో హడావిడిగా తిరుగుతున్న వార్డుబాయ్‌ని ఆపి, "ఏమిటి డాక్టర్లందరూ టెన్షన్ ఫీలవుతూ తిరుగుతున్నారు. ఎవరైనా వి.ఐ.పి.గాని వచ్చారా? " అడిగాడు సుబ్బారావు.

"అదేంకాదు. ఓ నెలక్రితం పిచ్చిపట్టిందంటూ ఒకతన్నిక్కడ చేర్చారెవరో. అతని పిచ్చి కుదర్చలేకే ఈ టెన్షన్" చెప్పాడు వార్డు

బాయ్.

"దానికంత గొడవెందుకు? ఈ హాస్పిటల్లో పిచ్చిముదిరి అది తలకెక్కి తిప్పవేసిన వాళ్ళక్కూడా చిటికెలో ఆ పిచ్చి నయంచేసి పంపుతారుకదా!

"నిజమేనయ్యా బాబూ! వివరాలు తెలీని పేషెంట్ ఎవరైనా వస్తే అతను మాట్లాడే మాటల్నిబట్టి అతనే వృత్తి చేసేవాడు, ఏ డిపార్టుమెంటులో చేసేవాడు వగైరా విషయాలు తెలుసుకుని దాన్నిబట్టి ఆలోచించి ట్రీట్ మెంట్ మొదలుపెడతారు, అవునా! ఇతన్నిక్కడ చేర్పించినతను అడ్రసు లేదు. ఇతన్ని



బయటకు పంపనూలేక, ఉంచుకుని పిచ్చి నయం చేయనూలేకున్నారు మా డాక్టర్లు"

"అంటే అతను మూగవాడా? "

"నిక్షేపంలా అరుస్తున్నాడు. అతని నోటి వెంట రెండేరెండు మాటలు తప్ప మూడో మాట రావటంలేదు. ఆ రెండు మాటలు ఏ డిపార్టుమెంటు ఉద్యోగి మాట్లాడతాడో కనుక్కోలేక జుట్టుపీక్కుని, బి.పి.లు పెంచుకుంటున్నారు డాక్టర్లు!"

"ఆ పేషెంటు దగ్గరికి నన్ను తీసుకెళ్ళరాదూ. నేను కరెక్టుగా ఐడెంటిఫై చెయ్యగలనని సిక్స్ప్సెన్స్ చెబుతోంది సుమా. అలా హేళనగా చూడకు... ప్లీజ్!" అన్నాడు సుబ్బారావు.

అరగంట తర్వాత డాక్టర్లందరూ సుబ్బారావు చుట్టూ మూగారు.

"మీరింతకుముందు సైకాలజిస్టుగా ఎక్కడ పనిచేశారు సార్? మేం నెలరోజులనించి కనుక్కోలేని విషయం అయిదు నిమిషాల్లో మీరెలా కనుక్కున్నారు? " అంటూ ప్రశ్నల వర్షం కురిపించారు.

సుబ్బారావు కాలరు సర్దుకున్నాడు. "వెరీ సింపుల్. అతను మాట్లాడుతున్నది రెండే రెండు మాటలుగదా. "ప్లీజ్! కూర్చోండి" ఆ రెండు మాటల్ని ఓ క్షణం కూడా తెరిపివ్వకుండా మాట్లాడేది 'అసెంబ్లీ స్పీకరు' మాత్రమే. నో డౌట్ మీరిక ట్రీట్ మెంట్ మొదలుపెట్టచ్చు" అన్నాడు సుబ్బారావు.

"అలాగా! అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలిగారు? "

"నేను పత్రికావిలేకరినిలెండి. ఆ మాటలు వినివిని చెవులు దిబ్బడవేశాయి సుమండీ"

"అయితే మరో ఏడాదిలో మీరు ఎలాగూ ఇక్కడికి రాకతప్పదు. ఇప్పుడే ఓ బెడ్ రిజర్వు చేసుకువెళ్ళండి" గుంపు వెనకనించి ఎవరో అరిచేరు.

—ఎ. జయలక్ష్మిరాజు

# ఏరిన ముత్యాలు

★ నువ్వు కోపంగా ఉన్నపుడు ఏ ఉత్తరానికీ జవాబు ఇవ్వకు.

**–చైనా సామెత**

★ అజ్ఞాని మనస్సు నాలుకలోను, జ్ఞాని మనస్సు అతని హృదయంలోను ఉంటుంది.

**–క్యార్లెస్**

★ ముఖస్తుతి చేయడమంటే మనసులో 'అసూయ' నింపుకోడం

**–కాలిన్స్**

★ పుట్టే ప్రతి శిశువూ భగవంతుడింకా మానవునిపట్ల నిరాశ చెందలేదనే సందేశం తీసుకువస్తాడు!

**–టాగోర్**

★ ఎందుకు చదవాలనకు! ఏది చదవాలను!

**–విష్ణుశర్మ**

★ సంగీతం మానవాళికంతా అర్థమయ్యే సార్వత్రికభాష.

**–లాంగ్‌ఫెలో**

★ సౌందర్యం భగవంతుని దస్తూరి.

**–ఎమర్సన్**

★ సత్యదేవతకు మనం చూపగల భక్తి, ఆ వెలుగులో నడవగలగడమే. సచ్ఛీలానికి అందరూ నమస్కరించి తమ దారిన తాము వెళ్ళిపోతారు.

**–ఫినాడ్**

★ ఆలోచనలేని చదువు వృధాగా శ్రమించడంలాంటిది.

**–ఎడ్మండ్ బర్క్**

★ తనను గురించి తాను మాట్లాడే వ్యక్తి మంచి తప్ప మరేమీ మాట్లాడడు. కాబట్టి అతని మాటల్లో నిజం సగమే వుంటుంది.

**–విల్లో రోగర్స్**

★ రోగాన్ని వైద్యుడికంటే ఎక్కువ పథ్యం నయం చేస్తుంది.

**–చరకుడు**

★ శారరీక రోగాలకంటే మానసిక రుగ్మతలు ఎక్కువ హానిని కలిగిస్తాయి.

**–సిసెరో**

★ కలుపుమొక్కలతోట వంటివాడు మాటలే తప్ప పనులు చేతగాని మనిషి.

**–రొసెట్టి**

★ చిన్న, చిన్న పనులే విశిష్టతకు దారితీస్తాయి. కానీ విశిష్టత చిన్నది కాదు.

**–మైకెలేంజిలో**

సేకరణ: వాకాడ దుర్గాప్రసాద్

# 'ఎడారి మంటలు' పై సమీక్షలు

నవంబర్ 'చతుర' లో ప్రచురితమైన పెద్దింటి అశోక్‌కుమార్ రచన 'ఎడారి మంటలు' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## పునరావృతం కారాదు

(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

గత ఇరవై-ముప్పై సంవత్సరాలుగా దుబాయ్ పేరుతో ఎప్పటికప్పుడు మోసం చేస్తున్న ఏజెంట్ల గురించి పత్రికల ద్వారా కానీ, సినిమాల ద్వారా కానీ తెలుస్తూనే ఉన్నా కూడా తాము దుబాయ్ వెళ్ళాలని ఆరాటపడే అమాయకజనం మన కళ్ళముందే ఎంతోమంది ఉన్నారు. కొన్ని సంవత్స రాలుగా ఈ పాయింట్ మీద ఎన్నో రచనలు వచ్చాయి గనుక ఈ రచ నలో కొత్తదనం ఏమీ లేద నిపిస్తుంది. అసలు మోసాలు ఎలా జరుగుతు న్నదీ, ఎవరు చేస్తున్నారు అనే విషయం రచనలో ఎక్కువగా ప్రస్తావన లేక పోవటం విస్మయపరి చింది. ఎంతసేపూ అత్తా కోడళ్ళు పద్మ, నర్సవ్వ ఎలా కష్టాలు పడుతు న్నారు అనే విషయాన్నే సాగదీసి కొంచెం విసుగుపుట్టించి తొందరగా ముందుకు సాగ నీయలేదు.

కథలో ముఖ్యంగా చూపించిన యాదగిరి




పాత్ర అటు పూర్తిగా మోసగాడిగానూ కాకుండా, మంచివాడిగానూ కాకుండా చూపించటంవలన అసలు మోసపోయిన

వారంతా ఎక్కువగా దుబాయ్ చేరినాకే మోసపోతున్నట్లుగా, ఏజెంట్ల పాత్ర తక్కువ అన్నట్లుగా చూపించింది. నిజానికి కథలో అధికంగా చూపించిన కష్టాలవల్లే అందరూ దుబాయ్ వెళ్ళటానికి మొగ్గుచూపటం జరుగుతున్నదన్నది మామూలు విషయమే. అయినా దానికే ఎక్కువ ప్రాధాన్యతనిచ్చి చూపించటం అంతగా బాలేదు.

కష్టాల్లో ఉన్నప్పుడు ఓ ఇంటి ఇల్లాలుగా ఎంతటి చాకచక్యంగా మసులుకోవాలో కథలోని పద్మ పాత్ర ద్వారా చక్కగా చూపించారు. అలాగే మనిషిలో స్వార్థం, మోస గుణం ఎలా పెరిగిపోతోందో దేశంకాని దేశంలో అప్పటికే అష్టకష్టాలు పడుతున్న దేవరాజును మనవాడన్న జ్ఞానం కూడా లేకుండా తన స్వార్థం కోసం వాడుకున్న కనకయ్య పాత్ర ద్వారా విశదపరిచారు.

ఏదిఏమైనా కళ్ళముందే ఎన్నో మోసాలు జరిగినా మళ్ళీ అదే ఊబిలో ఇరుక్కుని తమని తామే మోసం చేసుకుంటున్న అమాయక ప్రజలు ఇప్పటికైనా తెలివిగా మసలుకొని మళ్ళీ మళ్ళీ అదే కథను పునరావృతం కానివ్వకుండా ఉండాలని ఆశిద్దాం.

–ఎస్.వి. సునీల్
సూర్యాపేట-508 213

## రావణకాష్ఠం

*(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)*

ఏముందిలే ఈ గల్ఫ్ కథలు రోజూ పేపర్‌లో చూస్తున్నవేకదా అనుకున్నాంగానీ మొదలిడిన తర్వాత ఆగకనే సాగిపోయింది కొండవాలున నీటిప్రవాహంలా. జీవితం అంటే ఇదే అంటూ జీవమున్న భాషలో చెప్పిన విధానం చాలా చక్కగా వుంది. సంఘటనలు, సన్నివేశాలు, పాత్రల చిత్రీకరణ, భాష చాలా సహజంగా వుండి, నవలని ఆపక చదివించింది. కాచి వడపోసిన జీవితసత్యాల సామెతలెన్నో!

అంతగా చదువులేని పల్లెటూరి పద్మ వ్యక్తిత్వంలోని ఉదాత్తత మనసుని స్పృశిస్తుంది. అంతటి స్థితప్రజ్ఞత్వం కొంత సాధనతోనైనా అందరూ అలవర్చుకుంటే సంసారంలో సరిగమలే. సుశీల లాంటివాళ్ళు నిజంగా వుంటారా ఈ కాలంలో? అలా వుండాలని రచయిత కోరికా? అమాయకులైన ఆ వూరివారి కష్టాలు తెలిసి వారు నష్టపోకూడదని తను నష్టపోయి, ఎంతో విలువైన 'తృప్తి'ని పొందింది. ఎన్నికోట్లు గడించినా తృప్తిలేని మన రాజకీయ నాయకులకు సుశీలకున్నంత ఆలోచన, సాటి మనుషులయందు సానుభూతి వుంటే అన్నదాతలకీ ఆత్మహత్యలే వుండవు.

రైతన్నను ప్రభుత్వం ఆదుకోనంతవరకు తప్పించుకోలేని అప్పుల వలలో చిక్కిన దేవరాజు, అలాంటి మరెందరో గల్ఫ్‌మంటలలో ఆహుతి కావాలి. లేదూ ఆత్మహత్యతో అంతం కావాలి. అన్నదాతకు అన్నీ బాధలే. వానలు రావు. విత్తనాలు నకిలీ, ఎరువులు కల్తీ, కనీసధర రాదు. తూనికలలో మోసం. ఇన్ని రకాలుగా "తనదికాని తప్పిదానికి" బలైపోతున్న రైతుని ఆదుకోవడం ప్రభుత్వ తక్షణ కర్తవ్యం కాదు అంటే ఈ 'ఎడారిమంటలు' రావణాసుర కాష్ఠంలా ఆరనే ఆరవు.

ఎంత విషాదం ఈ భారతీయ గ్రామీణ జీవితం? పల్లెవాసుల ఆలోచనలకి, ఆవేదనలకి, ఆత్మీయతలకి, అభిమానానికి చక్కని దృశ్యకావ్యం ఈ నవల.

–సుష్మ.కె
నల్లగొండ-508 001

## గల్ఫ్ స్వరం

*(మూడవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

మనిషికి సుఖం విలువ ఎప్పుడూ తాను

కోల్పోయాకే నిజంగా అర్ధమవుతుంది. తననీ, తనవాళ్ళనీ ఇబ్బందులకి గురిచేస్తున్నది డబ్బేననీ... తక్కువ కాలంలో మామూలుకన్నా ఎక్కువగా సంపాదించేసుకుంటే ఇక జీవితం ఆనందమయమైపోతుందనే గట్టి నమ్మకం, ఆశతో... అందని ఎండమావులకోసం పరుగులు తీసి చివరకు అన్నీ కోల్పోయి, జీవచ్ఛవాలుగా బతుకీడుస్తున్న ఎందరెందరి జీవితాలకో ప్రతిబింబం వంటిది 'ఎడారి మంటలు' నవల.

విదేశాలకి వెళ్తే... చేసే పనికి చాలా ఎక్కువ డబ్బు దొరుకుతుందనీ... ఎలాగో కొన్నేళ్లు కష్టాన్ని, బాధనీ భరిస్తే మిగిలిన కాలమంతా చీకూ చింతా లేకుండా గడపొచ్చనే భావనతో అప్పోసప్పో చేసి, వున్న ఆస్తులన్నీ అమ్మి ముంబయికి చేరి, అక్కడ ఏజంటు మోసం చేస్తే... తిరిగి వెనక్కిరాలేక ఎందరో కూలీలుగా మారడం, కొందరు ఆత్మహత్యలు చేసుకునే సంఘటనలు రోజూ మనం వార్తల్లో చూసేవే. కాగా విదేశాలకి చేరగలిగిన వాళ్ళు... అక్కడ ఎలాంటి నీచమైన పనులు కూడా చేయాల్సివస్తుందో, ఎన్నెన్ని మానసిక వేధింపులకు గురిఅవుతుంటారో... తెలుసుకోవచ్చు

ఇవన్నీ తెలిసి కూడా అగ్నికి ఆహుతయిపోయే శలభాల్లా...మొండిగా విదేశీ స్వర్గపు స్వప్నాలు కనేవాళ్ళు ఈ నవల తప్పక చదవాలి. 'దూరపు కొండలు నునుపు' అనే చందాన... ఒక్కసారి తాము వుంటున్న వ్యక్తులకీ, పరిసరాలకీ దూరమైనప్పుడుగానీ, చేజారిన నిజమైన స్వర్గం గురించి తెలిసిరాదనే విషయాన్ని సూటిగా, స్పష్టంగా చెప్తుందీ నవల.

ఇందులో యదార్థం కాదేమో, కల్పితంలా వుందే... అనిపించే సంఘటన, సన్నివేశం ఒక్కటి కూడా లేదనిపిస్తుంది. ఇతివృత్తం చాలా సహజమైనదే కాక... ప్రదేశాలు, పరిస్థితులు, పాత్రలూ అన్నీ చాలా సహజంగా అనిపిస్తాయి. పాత్రల ఆలోచనల్లోనూ, మాటల్లోనూ 'అతి' అనేదెక్కడా లేదు. వాడిన పదాలు కూడా సన్నివేశాల్లో... ఆయా పాత్రలు సజీవంగా నిలబడడానికి తోడ్పడేవే.

రచయిత చెప్పదలుచుకున్న అంశాన్ని ఒక నిర్ణీతమైన శైలిలో, చక్కని హృద్యమైన పద్ధతిలో చెప్పగలిగారు. తెలంగాణా ప్రాంతం నేపథ్యంలో నడిచిన ఈ కథలో అడుగడుగునా అక్కడి నుడికారాలూ, సామెతలు, ఉపమాన ప్రయోగాలూ విశేషంగా వాడి భావాల వ్యక్తీకరణలో బలం, గాంభీర్యం, అనుభూతీ కలిగేలా చేశారు.

డబ్బు సంపాదించడం కోసం మనిషి తాను ప్రస్తుతం అనుభవిస్తున్న సౌఖ్యాలను కోల్పోయి, ఎడారి మంటల్లాంటి సమస్యల్లో చిక్కుకుని విలవిల్లాడాల్సిన దౌర్భాగ్యం తెచ్చుకోరాదనే సందేశం ఇస్తూ ఆ మంటలకి బలైపోయే బతుకుల బాధల్ని మనసు ద్రవించేలా కళ్లముందు సాక్షాత్కరింపజేస్తుందీ నవల.

–కె.యల్.కాంతమ్మ

నెల్లూరు -524 002

## దీపంచుట్టూ పురుగులు

***(నాలుగవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)***

పెద్దింటి అశోక్‌కుమార్ కలంనుండి జాలువారిన 'ఎడారి మంటలు' ఆద్యంతం ఆసక్తికరంగా చదివించి ఓ చేదు అనుభూతిని మిగిల్చింది.

వ్యవసాయం అచ్చిరాలేదని, అప్పులుతీర్చే ప్రయత్నంలో పండే పొలాల్ని తప్పని సరైచౌకగా అమ్మేసి రెండుమూడేళ్ళు విదేశాల్లో గొడ్డు చాకిరీచేస్తే రుణాలు తీరిపోతాయని, మళ్ళీ పొలం పుట్రా సంపాదించుకోవచ్చని, సంఘంలో హోదా, గౌరవం పెరుగుతాయన్న భ్రాంతులతో 'దూరపు కొండలు

నునుపు' అన్నసామెతలా జీవితాన్ని సాగించే వాళ్ళకు 'ఎడారి మంటలు' ఒక అనుభవపూర్వకమైన చెంపపెట్టు.

సాగుకు నీరందక, వ్యవసాయం చేయలేని భావంతో పొలాన్ని కుదువబెట్టి, దూర తీరాలకు చూపుల్ని సారించి, ఆశలు రెక్కలు చేసి విహంగంలా ఎగరాలని భావించి నేలకు అంటుకుపోతే దాని ఫలితం ఎలా ఉంటుందో తెల్పిన కథాంశం. దేవరాజు ప్రయోజనం కుటుంబక్షేమంకాగా యాదగిరి ప్రయోజనం పద్మను పొందడం. దేశాలు మారినా మారని మనిషి ప్రవర్తనకు యిదో సాక్ష్యం.

నవలలో గల్ఫ్‌దేశాలు, ఏజెంట్ల గురించి వివరించడం, అంతర్గతంగా తోటి కూలీ (మేస్త్రీ) దేవరాజును మోసగించడం, బతుకు ల్లోమానసిక పరివర్తన, రుజువర్తన అన్నీ అన్ని పాత్రల్లో సమానంగా మేళవించాయి. దేవరాజు తిరిగి ఇండియా చేరుకోవడం సినిమాటిక్‌గా ముగిసినా, అలా కాకుంటే బందీయై జైలులో నాలుగైదేళ్ళు ఉండి, తర్వాత స్వదేశం చేరవచ్చు అన్న మార్గాంతరం చావసిద్ధపడ్డవాడికి కొనఊపిరి లాంటిది. నిప్పుని రెండు విధాలా ఉపయోగించుకోవచ్చు అన్న భావానికి అక్షరరూపం 'ఎడారి మంటలు'. ఆ మంటలపై ఆశలనే నీళ్ళు ఎన్ని పోస్తే మాత్రం చల్లారుతాయిగనక?

**-పి.ఇ.సత్యనారాయణపట్నాయక్**
-కాశీబుగ్గ

## కన్నీటి గాథలు

***(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)***

బతుకుతెరువుకోసం గల్ఫ్ దేశాలకు వలసపోయి దగాపడటం ఒక సామాజిక సమస్యగా పేదదేశాలలో మారింది. అలా మోసపోయిన ఎందరో దౌర్భాగ్యుల కన్నీటి గాథల సారాంశాన్ని ప్రయోజనకరమైన చక్కని నవలగా మలిచి సమకాలీన సామాజిక సమస్యను కళ్ళకు కట్టినట్టుగా, మన కుటుంబంలో మనుష్యుల మధ్యనే జరిగినంత వాస్తవంగా నవల సాగింది. కథాగమనం ఒడిదుడుకులు లేని మైదానప్రాంతంలోని నదీగమనంలా సాఫీగా పయనించింది. మంచి నవలకు కొంత వాస్తవం, మరికొంత కల్పన కలగలుపుగా జతపడాలి. ఈ నవలలో అది ఫలించింది. స్వతః సిద్ధమైన గ్రామీణ వాతావరణం, తెలంగాణా యాసతో కూడిన సంభాషణలు, నిత్యం వాడే సామెతలు నవలను ఆసాంతం చదివించేలా వున్నాయి. రచయిత యిందుకు అభినందనీయులు.

'దూరపు కొండలు నునుప'ని భ్రమించి 'ఎండమావుల్ని నీళ్లని' తలంచినట్లుగా 'నిలబడి నీళ్ళు తాగకుండా పరుగెత్తి పాలు తాగాల'ని తాపత్రయపడి విదేశాలలో బాగా డబ్బు సంపాదించుకు రావచ్చని యిప్పటికీ మన దేశంలో చాలామంది దగాపడుతున్నారు. అలాంటి వాళ్ళకు ఈ నవల కనువిప్పు కాగలదు.

విదేశాలకు వలసపోయిన వాళ్ళలో కొంతమంది అదృష్టవశాత్తు బాగుపడిన వాళ్ళువున్నారు. కాని మోసపోయినవాళ్ళ గురించే ఆలోచించాలి. ప్రభుత్వం ఈ విషయాన్ని పరిశీలించి వలసపోయేవాళ్ళకు ముఖ్యంగా చదువు లేనివారికి, అమాయకులకు ఆయా దేశాల్లోని పరిస్థితులు, అవసరమైన ఇతర విషయాలు తెలియజేయడానికి ఏర్పాట్లు చేయాలి. అవసరం మేరకు ఇలాంటి వలసలను నియంత్రించాలి. ప్రైవేటు ఏజెంట్ల విచ్చలవిడి కార్యకలాపాలు పూర్తిగా ఆపివేయాలి. ఆవిధంగా యీ సమస్యకు చాలావరకు పరిష్కారం కుదరవచ్చు.

**-యం. వాణి**
భిలాయ్ -490 009

# చతుర

సంపుటి: 23 సంచిక: 12 జనవరి 2001

"తనో అపర హరిశ్చంద్రుడిననీ, శ్రీరామచంద్రుడిననీ మొదటిరాత్రే నాతో చెప్పారాయన. 'భార్యాభర్తలమధ్య దాపరికాలుండకూడదు, ఒకరితో ఒకరు అబద్ధాలాడుకోకూడదు' అన్నారు ఆరోజే. తనకి తాగుడు, జూదం, పరస్త్రీలాంటి వ్యసనాలేం లేవని అడగకుండానే చెప్పారు. కానీ అవన్నీ అబద్ధాలని ఇప్పుడు నేను సాక్ష్యాలతో నిరూపించగలను. తప్పు చెయ్యడమే కాక అలాంటి పనులంటేనే తనకు అసహ్యం అని డబాయిస్తున్న ఆయనతో ఇంక కాపురం చెయ్యలేను" అంటూ లేడీలాయర్‌తో తన బాధను వెళ్ళగక్కింది ఆ ఇల్లాలు.

కానీ... ఆమె బాధకి విరుద్ధంగా ఆమె 'తప్పు' అంటున్నవన్నీ ఒప్పులుగా నిరూపించబోయిన లాయరుగారి ఆంతర్యమేమిటి?

ఆమెను విడాకుల ఆలోచననుంచి తప్పించడానికి లాయరు చేసిన వినూత్న ప్రయత్నం ఎలాంటిది? అనూహ్య సంఘటనలతో ఆపకుండా చదివించే

**కాశీవిశ్వనాథ్**,నవల **'స్వర్గం మీ చేతుల్లోనే వుంది'**

ఈ నెల 'చతుర' సమగ్రనవల.

# 'స్వర్గం మీ చేతుల్లోనే వుంది'

**-కాశీవిశ్వనాథ్**



"సరదాగా ఆడుకునే ఆటలక్కూడా కొన్ని రూల్సు, రెగ్యులేషన్సు పెట్టుకుంటాం. అలాంటిది నిండు నూరేళ్లు గడపాల్సిన జీవితానికి కొన్ని పద్ధతులు, నియమాలు వుండడంలో తప్పేం వుంది? జీవితం శాస్త్ర బద్ధంగా నడిచినప్పుడే సత్ఫలితాలు కలుగుతాయి" అంటాడు వంశీకృష్ణ.

వంశీ జీవితానుభవంతో పండిపోయిన వయోవృద్ధుడేం కాదు. వయసు ఇరవై తొమ్మిదే. అతనింకా బ్రహ్మచారే. బ్రహ్మచారి అనే మాట వాడినందుకు బుధజనులు తప్పుపట్టొచ్చు. పెళ్లికాని వాణ్ణేకదా బ్రహ్మచారంటారు అని కూడా వాదించొచ్చు. కానీ పెళ్లికాని ప్రతీ మగాణ్ణీ బ్రహ్మచారి అనలేం. పెళ్లి అనబడే తంతూ తతంగం లేకుండానే స్త్రీసాంగత్యాన్ని పొందిన వాళ్లని బ్రహ్మచారి అనకుండా అవివాహితుడూ అంటే బెటర్ గదా!

వంశీతో వాదించాలన్నా ఓడించాలన్నా ఓదార్చాలన్నా అది ఒక్క విజయ్‌కుమార్‌కే సాధ్యం. అందుకే ఎప్పట్లాగే ఇప్పుడూ ఖండించాడు. "శాస్త్ర ప్రకారం జీవితం నడవాలీ అంటానికి అసలు శాస్త్రం అనే పుస్తకం ఎక్కడుంది? ఫలానా వాడి ఫోన్ నెంబరెంతో తెల్సుకోవడానికి టెలిఫోన్ డైరెక్టరీ వుంది. ఏ ట్రైన్ ఎప్పుడొస్తుందో ఎప్పుడు వెళ్తుందో చెప్పడానికి రైల్వే టైమ్ టేబిల్ వుంది. అదేవిధంగా మనం ఫలానా విధంగా నడుచుకుంటే మన జీవితం జెండా ఎగరేస్తుందనీ, ఫలానా విధంగా నడవకపోతే కష్టాలనుభవిస్తామని చెప్పే గ్రంథం ఏదీ లేదు. దేర్‌ఫోర్ మన జీవితం మన చెప్పుచేతల్లో వుండి, మనం చెప్పినట్టు నడుచుకోవాలి. జీవితం అనే వాహనానికి మనమే ఓనర్లం, మనమే డ్రైవర్లం"అని.

నాణ్యమైన వస్తువులకి గవర్నమెంటు ఐ.ఎస్.ఐ ముద్ర గుద్దినట్టు వ్యక్తిత్వాల విషయాలకొస్తే హైదరాబాద్‌లో వున్న యువకులందర్లోకి ముందుగా వంశీకృష్ణ ముఖం మీద మిస్టర్‌క్లీన్ అనే స్టాంప్ కొట్టెయ్యాల్సిందేనని పెద్దలందరూ ఏకగ్రీవంగా శలవిస్తారు.

"జీవితం ఓ ఆట అనుకుంటే సరదాగా ఆడాలి, గెలవాలి! అంతేగాని గెలుపుకోసం ఫౌల్‌గేమ్ ఆడకూడదు."

"జీవితం అనేది ఓ యుద్ధం అనుకుంటే ధైర్యంగా నిజాయితీగా పోరాడాలి. అంతేగాని వెన్నుపోట్లు పొడవకూడదు"

"జీవితం అనేది ఓ ప్రశ్ననుకుంటే తెలివితేటలు ఉపయోగించి సరైన సమాధానం చెప్పాలిగానీ మరో జీవితం అనే పుస్తకం నించి కాపీకొట్టకూడదు"

ఇవన్నీ వంశీకృష్ణ స్వయంకృషితో సొంతంగా తయారుచేసుకున్న సూక్తులు. అప్పుడప్పుడు అక్కడక్కడ కొంతమందికి వినిపించాడు. విన్నవాళ్లకి చేతులున్నాయి కాబట్టి చప్పట్లు కొట్టేరు. నలుగురితో పాటు విజయ్‌కుమార్‌కూడా చప్పట్లుకొట్టేడు. అయితే వంశీ వంటరిగా వున్నప్పుడు మాత్రం చప్పట్లుకొట్టిన చేతులతోనే టెంకజెల్ల కూడా కొట్టి తన ఆర్గ్యుమెంట్ వినిపిస్తాడు.

"ఏరా వంశీ, నువ్వు రోజుకి నలభై సార్లు పద్ధతులు, శాస్త్రాలూ అంటుంటావ్‌కదా నాకు తెలీకడుగుతున్నాను. అసలు పద్ధతి అంటే ఏంటట? "

వంశీ జవాబుకోసం తడుముకోకుండానే చెప్పేడు. "నువ్వు ప్రస్తుతం నడుస్తున్న దానికి భిన్నంగా వుండేదాన్ని పద్ధతీ అంటారు. సంసారం సక్రమంగా, సంతోషంగా సాగడానికి ఓ అందమైన అవగాహన కావాలి. ఆ అవగాహన అనేది నిజాయితీలో నించి రావాలి. అబద్ధంతో కొనసాగే సంసారం పునాది బలంలేని భవనంలాగ కుప్పకూలిపోతుంది"

వంశీ ఇలా చెప్పడమే కాదు. చెప్పిన మాటకి కట్టుబడే తన జీవితాన్ని కొనసాగిస్తాననే గ్యారంటీ కూడా ఇచ్చాడు.

"సత్యమునే పలుకవలెను, ధర్మబుద్ధితో చరించవలెను"లాంటి సూత్రాలు చాలా గొప్ప వాక్యాలుగా నేనూ ఒప్పుకుంటాను. కానీ ఆ సూత్రాలు బోర్డుమీద రాసి గోడ మీద వేళ్లాడ గట్టడానికి పనికొచ్చినంతగా నిజజీవితంలో ఆచరించడానికి పనికిరావు. ప్రతిమనిషి ఎప్పుడో ఒకప్పుడు, ఏదో ఒక సందర్భంలో అబద్ధమాడక తప్పదు. అలా ఎప్పుడూ అబద్ధమాడకుండా బతుకుతున్నానని చెప్పేవాడు నా దృష్టిలో కోతలరాయుడికిందే లెక్క. లేదా అంతరాత్మని వంచించుకుని బతికేవాడని నా వుద్దేశ్యం. మనిషి జీవించడానికి ఆహారం ఎంత అవసరమో, అబద్ధాలూ అంతే అవసరం. మన జీవితాలకే కాదురా ఓ ఇల్లో పెద్ద బిల్డింగో కట్టాలనుకో అందులో సిమెంట్‌తోపాటు ఇసుక కూడా కొంత శాతం కలుపుతున్నారుకదా! అలా కలపక తప్పదు. బంగారంలో కొంత పెర్సంట్ రాగి కూడా కలుపుతారు. అలా కలపకపోతే ఆ బంగారానికి గట్టిదనంరాదు. అలాగే జీవితంలో కూడా చాలాసార్లు నిజాలు చెప్పడంతోపాటు కొన్నిసార్లు అబద్ధాల్ని కూడా కలపాలి. అయినా నాకు తెలీకడుగుతున్నాను. అబద్ధం అంటే అర్థం ఏంట్రా? మనం చెప్పే అబద్ధాలవల్ల ఇతరులకి అపకారం జరిగితే అలాంటి అబద్ధాలాడ్డం తప్పే అవుతుంది. కానీ మనవాళ్లని సంతోషపెట్టడానికో మనం ఆనందించడానికో ఓ అబద్ధం ఆడితే ఎటువంటి ప్రమాదంలేదు."

ఇది విజయ్ వాదన. అతను వంశీకి సమ వయస్కుడే.

"నువ్వు చెప్పే ఇళ్లు, బంగారాలకి మనుగడ వుంటుందిగానీ మనసు మాత్రం వుండదు. అంచేత వాటితో మన జీవితాన్ని పోల్చొద్దు. ఇద్దరు ప్రాణ స్నేహితులమధ్య ఎలాగైతే దాపరికాలుండకూడదో జీవననేస్తాలనిపించుకున్న భార్యాభర్తలిద్దరి మధ్య కూడా దాపరికాలు, దాగుడుమూతలు వుండకూడదు. వుంటే ఆ సంసారంలో సంక్షోభం చెలరేగుతుంది"

ఇది మొదట్నించీ వంశీ చెప్తున్నమాటే! విజయ్ ఈ మాటల్ని అంగీకరించడు.

"భర్తకి భార్య, భార్యకి భర్త జీవననేస్తాలే అవుతారు. ఆ మాట నేను కాదనను. కాదన్నా ఎవరూ ఒప్పుకోరు. కానీ భార్యతో కొన్ని నిజాలు చెప్పడం ఎంత ముఖ్యమో కొన్ని సందర్భాల్లో అబద్ధాలు చెప్పడం కూడా అంతే ముఖ్యం. భార్యకి ఆనందం కలిగించాలన్నా సంసారాన్ని విజయవంతంగా నడిపించాలన్నా ఈ జీవనసూత్రాన్ని పాటించకతప్పదు"

విజయ్ తన జీవన సిద్ధాంతాన్ని వంశీకి ఒకసారీ, రెండుసార్లూ కాదు అనేకసార్లు చెప్పేడు. తన సిద్ధాంతం ఎంతగొప్ప విజయాలు సాధించిందో చెప్పడానికి తన జీవితాన్నే ఓ ఉదాహరణగా చూపించాడు. అయినా వంశీ అతని వాదనని ఒప్పుకోలేదు. విజయ్ తన పట్టుదల విడిచిపెట్టకుండా వంశీకి పెళ్లి జరిగే రోజు ఉదయం కూడా చెప్పేడు. అయినా వంశీ వినలేదు.

ఇప్పుడు కళ్యాణి అతనికి విడాకుల నోటీసు పంపించింది.

కళ్యాణి వంశీకృష్ణ భార్య.

వారిద్దరికీ వివాహమై కేవలం పధ్నాలుగు నెలలే అయింది. ఈ విడాకుల నోటీసు రావడం కొంతమందికి విడ్డూరమనిపించింది. ట్రాఫిక్ రూల్స్‌కి విరుద్ధంగా రోడ్డుకి అడ్డంగా నడిచే మనిషిని ఓ బస్సో ఓ లారీయో గుద్దేసిందంటే ఓ అర్థం వుంది. ఆ ఏక్సిడెంట్‌కి కారణం దురదృష్టం అంటే ఎవరూ ఒప్పుకోరు. అది కేవలం ఆ వ్యక్తి స్వయంకృతమేనని తీర్మానిస్తారు. కానీ ఫుట్‌పాత్ మీద బుద్ధిగా నడుస్తున్న వ్యక్తి మీదకి ఓ బస్సో లారీయో వచ్చి డేష్‌కొడితే అప్పుడతన్ని దురదృష్టవంతుడంటాం. ఒళ్లు మాలినంత జాలి చూపించేస్తాం. అదిగో అలాంటి సానుభూతినే వంశీ మీద ప్రదర్శిం

# ఏరిన ముత్యాలు

★ ఇద్దరు అమ్మలక్కల కబుర్లు రెండు కుటుంబాలను సర్వనాశనం చెయ్యగలవు.

**-అరబ్బీసామెత**

★ అధికారం కట్టబెడితే అసలు రంగు బయటపడుతుంది.

**-యుగోస్లేవియా సామెత**

★ పెళ్ళి ఒకసారి చేసుకోవడం ధర్మం! రెండుసార్లు చేసుకోవడం అవివేకం!! మూడు సార్లు చేసుకోవడం ఉన్మాదం!!

**-డచ్ సామెత**

★ మనుష్యులకు జ్ఞానం నాలుగు రకాలుగా సంక్రమిస్తుంది. గురువు చెప్పడంవల్ల, తనంత తానుగా తెలుసుకోవడం వలన, సహచరుల వలన మరియు అనుభవం వలన.

★ డబ్బు మాట్లాడుతుంటే సత్యం మౌనం వహిస్తుంది.

**-రష్యా సామెత**

★ ఒక పౌను చదువుని ఆచరణలో పెట్టడానికి పది పౌండ్ల లోకజ్ఞానం కావాలి.

**-పర్షియన్ సామెత**

★ ఎముకలు విరిగేటట్లు పనిచేస్తే దంతాలు అరిగేటట్టు తినవచ్చు

**-మలయాళ సామెత**

★ వందమంది కలిసి ఒక దుకాణం ఏర్పరచుకోవచ్చు కాని ఒక స్త్రీయే గృహాన్ని తయారుచేస్తుంది.

**-చైనా సామెత**

★ అలవాట్లు మొదట్లో సాలెగూళ్ళు. ఆపైన ఇనుప గొలుసులు.

**-స్పానిష్ సామెత**

★ ఆకారాన్ని చూసి మనసును అంచనా వేయకు. ఒక్కోసారి ఆకారం ఎంత భయం కరంగా వుంటుందో మనసు అంత నిర్మలంగా వుండొచ్చు

**-గ్రీకు సామెత**

★ భగవంతుడు స్వర్గాన్ని పరిపాలిస్తాడు. ధనం భూమిని పరిపాలిస్తుంది.

**-స్విట్జర్లాండ్**

★ అబద్ధాలకోరుకు ఒక్కటే శిక్ష- అతడు నిజము చెప్పినా నమ్మకుండా వుంటే సరి.

**-బాబిలోనియన్**

★ కరుణకన్నా గొప్పతనంలేదు. స్వతంత్రను మించిన సంపాదన లేదు. మనిషికి, మనిషికి మధ్య మమత వుండడంకన్నా కావలసింది మరొకటిలేదు.

**-తిలక్**

సేకరణ: పొన్నమండ శ్రీనివాస రావు

చారు. ఆత్మాభిమానంగల వ్యక్తి పరాజయాన్నయినా తట్టుకోగలడుగానీ సానుభూతిని మాత్రం భరించలేడు. అందుకే కళ్యాణితో గొడవపడి వంశీ అందరిముందు అవమానం పొందగానే వారి సానుభూతి భరించలేక శలవు పెట్టేశాడు.

ఇప్పుడు విడాకుల నోటీసు కూడా అందింది. ఆ రోజు ఇంటి తలుపులకి గడియపెట్టేసి మంచం మీద పడుకుని తన మనో మందిరానికి తలుపులు తెరిచాడు. అంతవరకు తక్కువ స్థలంలో ఎక్కువ మంది నిలబడి వూపిరాడక వుక్కిరిబిక్కిరిగా ఫీలవుతున్న అతని ఆలోచనలు ఒక్కసారిగా బయటకొచ్చేశాయి. వచ్చేసి వూరుకోలేదు. ఓ క్రమం పాటించకుండా విచ్చలవిడిగా గెంతులేస్తున్నాయి. వాటిని ఓ వరసలో నిలబెట్టాలని అతని మనసు చాలా శ్రమపడిన మీదట అవి ఒక్క వరసలో నిలబడకుండా రెండు వరసలుగా నిలబడ్డాయి.

ఒక వరసలో జరిగిపోయిన సంఘటనలు!

రెండో వరసలో జరగబోయే సంఘటనలు!

జరిగిపోయిన సంఘటనల్ని వెనక్కి నెట్టి జరగబోయే సంఘటనల్ని ముందుకు తెద్దామని ఎంత ప్రయత్నించినా ఆ ప్రయత్నం నెరవేరలేదు. చివరికి గత కాలపు సంఘటనలే ముందుకొచ్చి విజయగర్వంతో నిలబడ్డాయి. అవి ఒక్కొక్కటీ నోరు విప్పి మాట్లాడుతున్నాయి.

★ ★ ★

వంశీకృష్ణ తండ్రి చిన్నబ్బాయి జాలీగా గడపడమంటే ఎంతగా సరదాపడతాడో బాధ్యతలంటే అంత భయపడతాడు.

కాలం గడపడానికే అతను పేకాడతాడు. అది ఆడకపోతే అతనికి కాలం గడవదు.

చిరాకొచ్చినప్పుడే తాగుతాడు. తాక్కపోతే అతనికి చిరాకొచ్చేస్తుంది.

పేకాట అడ్డానికి డబ్బులు కావాలిగనుక అందుకోసం ఇంట్లో వున్న చిన్నా చితకా సామాన్లు అమ్మేసేవాడు. ఏ సామానూ దొరకనప్పుడు తననితానే అమ్మేస్కోడానికి సిద్ధపడేవాడుగానీ కొనేవాడు ఎవడూ ఆ వూళ్లో దొరక్కపోవడంవల్ల ఆ ప్రయత్నం మానేశాడు.

తండ్రి సాగిస్తున్న జీవిత విధానాన్ని చూసి వంశీ జాలిపడేవాడు. అంతకుమించి బాధపడేవాడు. ఏదైనా పని చేస్కోమని సలహా ఇచ్చేవాడు. అలా సలహా ఇచ్చిన ప్రతీసారీ తండ్రిచేత చెంప దెబ్బలు తినేవాడు.

చిన్నబ్బాయి స్నేహితుడు అప్పలమూర్తి ఓసారి ఇలాంటి చెంపదెబ్బల సన్నివేశాన్ని చూసి వంశీ మీద జాలిపడి వూరుకోక చిన్నబ్బాయికి ఏదో ఓ వ్యాపకం కలిగించడానికి ప్రయత్నించాడు. ఓ రోజు వంశీ దగ్గరకొచ్చి "రేయ్ వంశీ, మీ నాన్నకి మందు, పేకాట, వుచ్ఛ్వాసనిశ్వాసాలుగా మారిపోయాయి. ఆ రెండూ లేకపోతే ఆయన బతకలేడు. ఉద్యోగం చెయ్యిరానాయినా అంటే ఇన్నాళ్లూ లక్ష్యపెట్టలేదు. బలవంతంగా వురికంబం ఎక్కమన్నట్టుగా బాధపడేవాడు. పనిగండం వుందని బుకాయించేవాడు. అయినా నేనిప్పుడు ఓ సినిమా థియేటర్లో కేబిన్ ఆపరేటర్ పనిలో కుదిర్చేను. అంతకుముందు కొన్నాళ్ల పాటు ఓ థియేటర్లో పని చేశాడు కాబట్టి ఆ అనుభవం పనికొచ్చింది. ఆ జీతంతో ఆయన నిన్నేదో పోషిస్తాడనికాదు. నీ జేబులోవుండే డబ్బులు పట్టుకుపోకుండా వుంటాడనే ఈ ఉద్యోగం చూశాను" అన్నాడు.

బలవంతంమీద చిన్నబ్బాయి ఉద్యోగంలో జాయినయేడు. అతను పని చేసే సినిమా థియేటరు హైదరాబాద్ శివార్లలో వుంది. అక్కడికి సైకిల్ తొక్కుకుంటూ వెళ్లి ప్రొజెక్టర్ ఆపరేటర్గా పని చేయడానికి అతను కాస్త చిరాకుపడ్డాడు. కానీ మూడో రోజే అతనికో విషయం తెలిసింది. ఆ థియేటర్

వూరికి కాస్త దూరంగా వున్నా ఆ పరిస రాల్లో వుండే ప్రజలకోసం సిటీలో విడుద లయిన ప్రతీ కొత్త సినిమాని మొదటివారం ఆ థియేటర్లో ప్రదర్శిస్తారు. అందువల్ల అత నికి లాభం ఏంటంటే...

ఓ ఏడెనిమిదేళ్ల క్రితం తెలుగులో దూర దర్శన్ తప్ప మరో ప్రైవేట్ ఛానల్ ఏదీ లేదు. అప్పట్లో వీడియో కేసెట్లద్వారా ఇళ్లల్లోను పబ్లిక్ ప్లేసెస్‌లోను సినిమాలు చూసేవాళ్లు ఎక్కువమంది వుండేవారు. కొన్ని పెద్ద సినిమా కంపెనీవాళ్లు తీసే సిని మాల్ని పెద్ద హీరోలతో తీసిన సినిమాలని వీడియో కంపెనీ వాళ్లకిచ్చేవాళ్లుకాదు. ఇచ్చినా సినిమా విడుదలయిన సంవత్సరం తర్వాతే ఇచ్చేవాళ్లు. ఆ సినిమాలకి సెకెండ్ రిలీజ్‌లు, తర్డ్ రిలీజ్‌లుండేవి. అప్పుడు కూడా కొంత డబ్బు కలెక్ట్ చెయ్యొచ్చనే నమ్మకం వల్ల వాటి వీడియో హక్కుల్ని ఎవరికీ ఇచ్చేవారుకాదు. కానీ శతకోటి దరి ద్రాలకి అనంతకోటి ఉపాయాలున్నట్టుగా అలాంటి సినిమాలక్కూడా దొంగకేసెట్స్ మార్కెట్లోకొచ్చేసేవి. అవి ఎలా వస్తు న్నాయో ప్రొడ్యూసర్లకి అర్థమయ్యేదికాదు.

"మేం తీసిన ఫలానా చిత్రం యొక్క వీడియో రైట్స్ ఎవరికీ ఇవ్వలేదు. అంచేత మా పిక్చర్‌ని ఎవరు వీడియో కేసెట్స్ ద్వారా ప్రసారం చేసినా అట్టివారి మీద సివిల్, క్రిమినల్ చర్యలు తీసుకుంటామని హెచ్చరించడమైనది" అంటూ దినపత్రికల్లో ప్రకటనలు ఇచ్చినా ప్రొడ్యూసర్లకి పబ్లిసిటీ ఛార్జీలు దండగ తప్ప కేసెట్లు రావడం మానలేదు. ఈ పైరవీ కేసెట్లు తయారుచే సేవాళ్లని పట్టుకోవడం పోలీస్ డిపార్ట్‌మెం ట్‌కో అదనపు డ్యూటీకింద మారింది. పోలీ సులు అప్పుడప్పుడు దండయాత్రలు చేసినా సముద్రాన్ని చెమ్చాలతో తోడినంత ఫలితమే దక్కింది.

చిన్నబ్బాయి అంతకు కొన్నేళ్ల ముందు సినిమా ఆపరేటర్‌గా పని చేసేటప్పుడు నెలవారీ జీతంతప్ప పక్కనించి ఒక్క పైసా కూడా ఆదాయం వచ్చేదికాదు. కానీ ఇప్పుడు సైడ్ఇన్‌కమ్ తెచ్చి పెట్టడానికి టీవీలు, వీడి యో కేసెట్లు పుట్టుకొచ్చేయి. చిన్నబ్బాయి నీతి, అవినీతి గురించి ఆలోచించలేదు. పుట్టినప్పటినుంచీ మాంసం తింటానికి అల వాటుపడిన పులి, సర్కస్‌వాళ్లకి దొరికి, రింగ్ మేష్టర్ చెప్పినట్టు ఫీట్స్ చేసినా తోట కూరపప్పు, బంగాళాదుంప వేపుడు తిని సంతృప్తి పడదు. ఎందుకంటే పులికి మాంసం తినడం పుట్టుకనించీ వచ్చిన అల వాటు.

అలాగే చిన్నబ్బాయికి చేతినిండా డబ్బు లుండాలి. మందు తాగని నోరూ ఒక నోరేనా? పేకాట ఆడనిచేతులూ ఓ చేతు లేనా? అని అతనికి అతనే చెప్పుకుంటాడు కాబట్టి అడ్డదార్లో డబ్బులు సంపాదించడా నికి అతను గేలం విసరబోతుండగా ఆ గేలాన్ని వెదుక్కుంటూ ఓ తిమింగలమే వచ్చింది.

ఆ తిమింగలం పేరు కేశవరావు. అతను పైరవీ కేసెట్లు తీయడం, పంపిణీ చేయ డంలో ప్రసిద్ధుడు. అతను ఆ సినిమాహాల్లో ప్రొజెక్టర్ ఆపరేటర్ చిన్నబ్బాయిని, మేనే జర్ వెంకట్రావుని తన జేబులో వేసుకుని వాళ్లిద్దరి జేబుల్లోనూ డబ్బు నింపేడు. ఆ థియేటర్ వూరికి కాస్త దూరంగా వుండడం వల్ల పోలీసుల నిఘా తక్కువ. అంచేత సెకెండ్ షో టైమ్‌లో ఓ వీడియో గ్రాఫర్ని పెట్టి వీడియో కెమేరాతో స్క్రీన్ మీదపడే సినిమాని షూట్ చేయించేవాడు. ఆవిధంగా కేశవరావుకి ఉపయోగపడ్డాడు.

"నువ్వు చేస్తున్నది తప్పుకాదా?" అని అతని పేకాట ఫ్రెండ్ అడిగితే "తెరమీద కనిపించే ఏక్టర్లకి తెర వెనక పని చేసినోళ్లకీ అంతంత డబ్బిస్తున్నప్పుడు ఆ సినిమాని తెరమీద చూపించే ఆ సినిమా ఆపరేటర్లకి ఇంతంత తక్కువ జీతాలివ్వడం న్యాయమా?" అంటూ ఎదురు ప్రశ్నించి

తను చేసిన పనిని సమర్థించుకున్నాడు.

అవినీతికంటే నీతిగొప్పదని పెద్దవాళ్లు అంటారుగానీ నీతి మార్గంలోకంటే అవినీతి మార్గంలోనే ఆదాయం ఎక్కువనే విషయాన్ని ఎందరో మహానుభావులు రుజువు చేశారు. అందులో చిన్నబ్బాయి కూడా చేరిపోయాడు. అతనికి అడ్డదార్లో ఆదాయం పెరిగింది. మునుపు ఇంటి గుమ్మాలమీద కూర్చుని పేకాటాడే చిన్నబ్బాయి ఇప్పుడు క్లబ్బులకెళ్లి ఆడుతున్నాడు. గతంలో సారాతో సరిపెట్టుకునే వాడు ఇప్పుడు బ్రాందీ విస్కీలు తాగ్గలుగుతున్నాడు. ఈ రెండు పనులు నాన్‌స్టాప్‌గా నిర్విఘ్నంగా చెయ్యడానికి వీలుగా తరచుగా డ్యూటీకి శలవులు పెట్టేసే వాడు. వారానికో కొత్త పిక్చరు ఆ థియేటర్‌లో ఆడుతుంది. కొత్త సినిమా రాగానే వీడియో కంపెనీవాళ్లు అతని చేతిలో డబ్బుపెట్టి తమ పని తాము చేసుకుపోయేవాళ్లు. ఈవిధంగా వందల్లో అందే నెలవారి జీతం కంటే నెలకి నాలుగు సార్లు అందే సైడ్ ఇన్‌కమ్ అతని వ్యసనాలకి బాగా ఉపయోగపడింది. అయితే అవినీతివల్ల ఆదాయం ఎక్కువయినా దానికి ఆయుర్దాయం తక్కువనే నిజం కొద్ది నెల్లకే రుజువైపోయింది.

అతనికి సంపాదన ఎంత పెరిగినా డ్యూటీలో వున్నప్పుడు తాగేవాడుకాదు. ఇంటి దగ్గర తాగింతర్వాతే డ్యూటీకొచ్చే వాడు. ఒకరోజు సెకెండ్‌షో జరుగుతుండగా ఓ వీడియోగ్రాఫర్ తెరమీదపడే బొమ్మని వీడియో కెమేరాతో రికార్డ్ చేస్తుండగా పోలీసులు రైడ్ చేసి అతన్ని పట్టుకున్నారు. ఇందులో మేనేజరుక్కూడా భాగం వుందని ఏదో గొణిగినా 'రామరామ నాకేమీ తెలీద'ంటూ ఆ మేనేజర్ బుకాయించి తప్పుకున్నాడు.

చిన్నబ్బాయికి రెండేళ్లు జైలు శిక్ష విధించారు. జెయిల్లో ఆరు నెలలు గడిపేసరికి అతని ఆరోగ్య పరిస్థితి దెబ్బతింది. సాధారణంగా ఆల్కహాల్ ఎక్కువ తాగడంవల్ల లివర్ దెబ్బ తింటుంది. కానీ అతను రాత్రింబవళ్లు తాగినప్పుడు అతని లివర్ ఠంచన్‌గానే పని చేసింది. జెయిలుకొచ్చిన ఆరు నెలల కాలంలో ఒక్కసారి కూడా కడుపులోకి మందుచుక్కలు పడకపోయేసరికి అతని కడుపు ఎండిపోయిన చెరువులా మారిపోయింది. ఎండిన చెరువులో ఏ చేపా బతకలేనట్టుగా అతని లివర్ కూడా బతకలేకపోయింది. వారంరోజులు గవర్నమెంట్ హాస్పిటల్లో ఇన్‌పేషెంట్‌గా గడిపేక ఎనిమిదో రోజున వూపిరి వదిలేశాడు.

అప్పటికి వంశీ తల్లి మరణించి పన్నెండేళ్లయింది. తండ్రి వున్నప్పుడు అతనివల్లేమీ సుఖపడలేదాతల్లి! కాబట్టి అతను పోవడం వల్ల పెద్దగా బాధపడిందీలేదు, నష్టపోయిందీలేదు.

ఎటొచ్చీ ఒంటరితనమే వంశీకృష్ణని విడిచి పెట్టలేని బంధువుగా మారిపోయింది.

తండ్రి సాగించిన జీవిత విధానం, చరమాంకంలోని జెయిలు శిక్ష, హీనమైన మరణం ఎవరి సానుభూతికీ నోచుకోలేకపోయింది. పైగా కొంతమంది 'వదిలిపోయింది పీడ' అనుకోవడంకూడా వంశీ విన్నాడు. తనకి వూహ తెలుస్తున్న వయసులో తన తండ్రి తన తల్లిని పెట్టిన బాధలు, ఆవిడ ఏడ్చిన ఏడుపులు... వంశీ మస్తిష్కంలో మరపురాని భయంకరమైన జ్ఞాపకాలుగా మిగిలిపోయాయి. తను భవిష్యత్తులో ఎలా బతకాలనే విషయం మీద ఓ నిర్దుష్టమైన అభిప్రాయం లేకపోయినా తన తండ్రిలా మాత్రం బతక్కూడదని నిర్ణయించుకున్నాడు.

వంశీ పినతల్లి వరలక్ష్మి కాస్త జాలిగుండె మనిషి. భర్తని పోగొట్టుకున్న పిల్లల్లేని మనిషి కావడంవల్ల ఆవిడే వంశీకి తన ఇంట్లో ఆశ్రయం ఇచ్చింది. అక్కడే వుండి చదువుకోమంది చదువుకున్నాడు.

అది వరలక్ష్మిగారి సొంతిల్లుకాదు.

ఆ ఇంటి ఓనర్ తాతారావు బహుచిత్ర మైన మనిషి! అతను అక్కడా ఇక్కడా కాకుండా వాళ్ల నెత్తిమీదే కాపురం వుంటు న్నాడు. అంటే ఆ ఇంటి డాబామీదున్న రేకుల షెడ్‌లో ఒంటరిగా వుంటున్నాడు.

"పాదరసం ఎలాగైతే మన చేతికి దొర కదో, నా మనస్తత్వం కూడా ఎవరి అంచనా లకీ దొరకదు" అంటూ తాతారావు తనకి తానుగా చెప్పుకునేమాట అక్షరాలా నిజమే.

ఒంట్లో వేడి ఎంతుందో తెల్సుకోడానికి థర్మామీటర్లున్నాయి. పొడవు ఎంతుందో తెల్సుకోడానికి స్కేల్సు, టేప్‌లున్నాయి. బరు వెంతుందో తెల్సుకోడానికి మిషన్లున్నాయి. కానీ తాతారావు మనస్తత్వం ఎలాంటిదో తెలుసుకోడానికి ఎటువంటి కొలమానాలూ లేవు. అతను స్కూల్లోని పుస్తకాల ద్వారా చదివింది తక్కువే అయినా లోకాన్ని తలకిం దులుగా చదివేసిన మనిషి. లౌక్యాన్ని జీర్ణం చేసుకున్న మనిషి. ఒక్కమాటలో చెప్పా లంటే బతకనేర్చిన మనిషి! బతకనేర్చిన వాడు సిగ్గూ శరమూ అనే రెండు పదా ర్థాల్ని కాశీలో వదిలెయ్యాలని ఎవరో ఎప్పుడో చెప్పారట. ఎలాగూ ఆ రెండింటినీ వదిలేస్తున్నప్పుడు కాశీలోని గంగానదికి హైదరాబాద్‌లోని హుసేన్‌సాగర్‌కి తేడా ఏంటట? అని తనకి తానే ప్రశ్నించుకుని రెండూ ఒక్కటే నీళ్లన్నాక ఏ నీళ్లయినా ఒక్కటే అని తనకి తానే సమాధానం కూడా చెప్పుకుని తనకి కొద్దో గొప్పో వున్న సిగ్గూ శరాల్ని మూటకట్టి తీసుకెళ్లి హుసేన్‌సాగ ర్‌లో కలిపేశాడని ప్రతీతి.

ఆత్మాభిమానం లేనివాడు అందరికంటే బలవంతుడు, ధనవంతుడనే నమ్మకాన్ని అతను డెవలప్ చేసుకున్నాడు. ఆ ఏరి యాలో ఎవరు చనిపోయినా ఆ శవయా త్రలో కంపల్సరీగా పాల్గొని పది అడుగులు నడిచి మరీ వెనక్కి వచ్చేస్తాడు. అందుక్కా రణం అతనికున్న భూతదయ అనుకుంటే, దెబ్బతినేసినట్టే. అలా చావు వెంట వెళ్లిన వారిని దినకార్యంనాడో పూట భోజనానికి పిలుస్తారు. ఆవిధంగా ఒక్కపూట భోజనం కలిసొచ్చినట్టే కదా అంటూ తను చేసిన పనిని నిర్మొహమాటంగా సమర్ధించుకుం టాడు.

అతనికి ఆ ఇల్లు కాకుండా ఆ వూళ్లో మరో రెండిళ్లున్నాయి. వాటిని కూడా అద్దెకి చ్చేశాడు. ఆ మూడు ఇళ్ల మీద వచ్చే అద్దెల్ని కూడబెట్టి మెల్లగా ఓ ఏభై వేలు చేసి దాన్ని చిన్నచిన్న అప్పులకింద పెద్దపెద్ద వడ్డీలకి తిప్పుతున్నాడు.

సాధారణంగా ఎవరి బడ్జెట్‌లోనైనా ఆదాయం, ఖర్చు అంటూ రెండు భాగాలుం టాయ్. కానీ తాతారావు బడ్జెట్ పేపర్లో ఆదాయం కోలమ్ తప్ప ఖర్చు అనే కోలమ్ కనిపించదు. ఎందుకంటే అతను ప్రతీ చిన్న వస్తువుకీ ఎదుటివాళ్ల మీద వాలిపోయి బతి కెయ్యడాన్ని ప్రాక్టీస్ చేసి తక్కువ టైమ్‌లోనే ఎక్కువ ఫలితాలు సాధించాడు.

అతని ఒంటిమీదుండే షరాయి, లాల్చీ కలిపి అమ్మినా ఏభై రూపాయలు కూడా ఖరీదు చెయ్యవు. వడ్డీ వ్యాపారం చేస్తూ కూడా ఒంటిమీద ఇంత దిక్కుమాలిన బట్ట లేసుకుంటారేంటండీ? అని ఎవరైనా అడి గితే "తొడుక్కుని విప్పేసేదానికి ఏ బట్టలైతే ఏంటయ్యా" అంటూ ఓ పిసినారి థీరీ చెప్పేసి ఓ నవ్వు నవ్వేస్తుంటాడు. అతనికి సిగరెట్ కాల్చే అలవాటు లేదని చెప్పలేం. సిగరెట్లని చచ్చినా డబ్బిచ్చి కొనడుగానీ ఫ్రీగా వస్తే మాత్రం చచ్చినా వదలడు. ఎవ రైనా అప్పు తీస్కోడానికొస్తే వాళ్లకి సిగ రెట్లు కాల్చే అలవాటుంటే "బాబూ! ఓ సిగ రెట్" అని అడుక్కుంటాడు.

వంశీ చదువు పూర్తిచేసి వుద్యోగాల కోసం వేటసాగిస్తూ నిరుద్యోగపర్వంలోవున్న రోజుల్లో పన్నెండు ఇంటర్వ్యూలకెళ్లాడు. మొదటి నాలుగైదింటితో అతనికి అను భవం, మిగతావాటివల్ల ఒల్లమాలిన నీరసం వచ్చింది. ఆ రోజు వెళ్తున్న ఇంటర్వ్యూలో

డెఫినెట్‌గా సెలక్టవుతాననే నమ్మకం వుంది. సెలక్టవాలనే వరలక్ష్మి కూడా దేవుడి గుళ్లో అభిషేకం చేయించింది. వంశీకి ప్రసాదం ఇచ్చి త్వరగా ఇంటర్వ్యూకి వెళ్లమని తొందరపెడుతోంది.

"ఎందుకు పిన్నీ, ఇంత తొందర? ఇంకా టైముంది" అన్నాడు వంశీ.

"వుందని నాకూ తెలుసు. కావాలంటే ఆ వీధి చివరున్న దేవుడిగుడి దగ్గర కాస్సేపు కూర్చుని వెళ్లు. డాబా మీదనించి దిగి ఆ తాతారావు మనింట్లోకొచ్చేలోగా నువ్వు ఇల్లు దాటెయ్. ఆ మహానుభావుడు ఎదురుపడితే ఏ పనీ జరిగిచావదు. నరుడి దిష్టికి నల్లరాయి బద్దలైపోతుందంటారు. అతగాడివి దిష్టికళ్లు. వాడెప్పుడూ తాజ్‌మహల్‌ని చూళ్లేదు కాబట్టి అదింకా క్షేమంగా వుంది. చూసుంటే అది ఏనాడో ఢామ్మంటూ పేలిపోయి ముక్కలైపోయేది" అంటూ వరలక్ష్మి వంశీని పంపడానికి హడావిడి పడింది. తీరా ఆ సమయంలోనే తాతారావు వస్తున్నట్టుగా అతని నవ్వు వినిపించింది.

వంశీ ఆ ఇంటి కొచ్చిందగ్గర్నించి తాతారావుని గమనిస్తూనే వున్నాడు. అతను పిసినారి, లౌక్యుడే తప్ప ప్రమాదకారికాదని మాత్రం గ్రహించాడు. ఆ ఇంటి కొచ్చే ఏ లెటర్‌నైనా పోస్టమేన్ దగ్గర్నించి ముందుగా తనే లాక్కుని ఓపెన్ చేసి చదువుతాడు. అలా చెయ్యడం మర్యాదకాదని ఒకటి రెండుసార్లు గొడవపడ్డాడు. అయినా తాతారావు బాధపడకుండా వెకిలి నవ్వు నవ్వేసి వూరుకున్నాడు. తరచుగా ఆ ఇంట్లోకి అది కావాలీ ఇది కావాలీ అంటూ లోపలికొచ్చేస్తాడు. అందుకే వంశీకి అతనంటే చిరాకు.

"అతను ఎంత మనింటి ఓనర్ అయితే మాత్రం చీటికీ మాటికీ మనింట్లోకి కుక్కలాగ దూరిపోతాడేంటి పిన్నీ" అన్నాడు వంశీ.

వరలక్ష్మి "అమ్మో... అతగాడు కుక్క ఎందుకయ్యేడ్రా? కుక్కయితే ఓసారి ఛీ అంటే పోతుంది. కానీ ఆ కుక్క కుండే ఇంగితజ్ఞానం వీడికెక్కడ ఏడ్చింది?" అంటుండగానే తాతారావు ఇహ్హిహ్హిహ్హి అంటూ తన బ్రాండ్ నవ్వు నవ్వుకుంటూ లోపలకొచ్చేడు.

"ఏంటి చెల్లెమ్మా, మీ తల్లీ కొడుకులిద్దరూ పొద్దున్నే నా గురించి మాట్లాడుకుంటున్నారు?" అన్నాడు.

వరలక్ష్మి కాస్త కంగారుపడి "అబ్బెబ్బెబ్బె... మీ గురించి కాదండి" అంది.

"ఒల్లకో చెల్లెమ్మా? మీ ఇంట్లో నించి కుక్క అనే మాట వినబడిందంటే అది ఖచ్చితంగా నా గురించే అయుంటుందని నాకు తెలీదనుకున్నావా? అయినా నన్ను కుక్కతో పోల్చినందుకు నేనేమైనా ఫీలైపోతున్నానా? దయచేసి అలాంటి ఫీలింగులేం పెట్టుకోవద్దు. కుక్కలనేవి మామూలు జంతువులు కాదమ్మా! విశ్వాసానికి మారుపేరుగా చెప్పుకోదగ్గ జంతువుల్లో కుక్కలే నెంబర్ ఒన్. పైగా వాసన్నిబట్టి నేరస్థుల ఆచూకీ తెల్సుకోగల కెపాసిటీ ఒక్క కుక్కలకే వుంది. పోలీసులు తమకి హెల్ప్‌గా ఏనుగుల్నీ, సింహాల్నీ పెంచుకోకుండా కేవలం ఆల్సేషియన్ కుక్కల్నే ఎందుకు పెంచుతున్నారంటావ్? వాళ్లేం వెర్రోళ్లయి ఆ పని చెయ్యడం లేదు. మనుషులకీ, మిగతా జంతువులకీలేని కెపాసిటీ ఈ కుక్కలకుందమ్మా! అంతెందుకు, ఎమ్మేలు, ఎమ్‌కామ్‌లు, చదివిన వాళ్లెంతో మంది ఉద్యోగాలు దొరక్క పుడ్డుక్యూడా లాటరీలు కొడుతున్నారు. కానీ పోలీసు కుక్కలకి నోరు లేకపోయినా డిగ్రీలు చదువుకోకపోయినా పోలీస్ డిపార్ట్‌మెంట్లో దిట్టమైన తిండితింటూ హేపీగా బతికేస్తున్నాయి. అంతెందుకు? ఒక వేళ దేవుడు నా రేకుల షెడ్‌లో ప్రత్యక్షమై ఒరేయ్ తాతారావూ నీకేం వరం కావాల్రా అని అడిగేడనుకో 'స్వామీ వచ్చే జన్మలో నన్ను పోలీస్ కుక్కగా పుట్టించు' అని కోరుకుంటాను" అంటూ నవ్వేడు. టేకిట్ ఈజీ

పోలసీ అతని నరనరాల్లోకి వ్యాపించడం వల్ల అతను ఎలాంటి తిట్లయినా ఈజీగా తీసుకుంటాడు.

గడియారాల్లో వాటర్ ప్రూఫ్ గడియారాలున్నాయి. అవి నీట్లో పడినా ఏట్లో పడినా పాడవవు. అలాగే తాతారావుది తిట్లప్రూఫ్ బాడీ! అతని శరీరంగానీ మనసుగానీ ఎలాంటి తిట్లకీ చలించదు. అతను చెప్పిన కుక్కల థియరీకి వంశీ నవ్వలేదు. వరలక్ష్మి కూడా నవ్వలేదు.

వాళ్ల నవ్వులతో తనకేమీ పనిలేనట్టుగా తాతారావు వంశీని ఒకటికి రెండుసార్లు ఎగాదిగా చూసి "ఏంటోయ్ హీరో ఎక్కడికి బయల్దేరావ్? " అని అడిగాడు.

అలాంటి ప్రశ్నలూ, పలకరింపులే వరలక్ష్మికి చిరాకు తెప్పిస్తాయి. "ఏమండీ తాతారావుగారూ వయసులో పెద్దవారై వుండి కూడా ఆ మాత్రం బుద్ధి లేకపోతే ఎలాగండి? ఎవరైనా బయటకెళ్లేటప్పుడు ఎక్కడికీ అని అడగొద్దని మీకెన్నిసార్లు చెప్పేను? " అంది చిరాగ్గా.

"ఇది మరీ బాగుంది చెల్లెమ్మా! సపోజ్ మనం బయటకెళ్లి, ఓ రిక్షా ఎక్కాలనుకో అప్పుడా రిక్షావాడు మనల్ని ఎక్కడికీ అని అడగడా? ఏం?... నేనా రిక్షావాడి పాటి కూడా చెయ్యలేదా? " అంటూ ఎదురు ప్రశ్న వేశాడు. తను ఇంటర్వ్యూకి వెళ్తున్న విషయం చెప్పడానికి వంశీ మొహమాట పడ్డాడు. కానీ తాతారావే వూరుకోకుండా "ఫర్వాలేదు చెప్పవయ్యా, నువ్వు దొంగతనాలకి, కిడ్నేపులు చెయ్యడానికీ వెళ్లడంలేదుగా" అంటూ భుజం తట్టి అడిగేసరికి వంశీ నిజం చెప్పేశాడు.

అదేదో కడుపు చెక్కలయే జోక్‌లాగ తాతారావు పగలబడి పగలబడి నవ్వి "ఇంతవరకు నువ్వు పన్నెండు ఇంటర్వ్యూలకెళ్లేవు. నేను లెక్క పెడుతూనే వున్నానుకదా! ఇది పదమూడోది. శాస్త్రం ప్రకారం, ఇది దరిద్రగొట్టు నెంబర్! కనీసం ఈ ఉద్యోగమైనా వస్తుందంటావా? " అన్నాడు.

వరలక్ష్మికి అరికాలి మంట నెత్తికెక్కింది. అయినా అతను ఇంటి ఓనరు కాబట్టి తమాయించుకుని ఆవేశంగా కాకుండా వ్యంగ్యంగానే జవాబు చెప్పింది. "ఇంతవరకు ఈ ఉద్యోగం వస్తుందనే నమ్మకంతోనే వున్నాం. కానీ ఈ ఉద్యోగం రాదు కాక రాదని ఇప్పుడు తేలిపోయింది" అంది.

"ఎంచేతో? "

"మీరు ఎదురుపడి ఎక్కడికీ అని అడిగిం తర్వాత కూడా వాడికి ఉద్యోగం ఎలా వస్తుంది? ఇంతకీ మీరిప్పుడు ఏ పని మీద దిగబడ్డారో ఆ సంగతి చెప్పండి" అంది వరలక్ష్మి.

"మరేం లేదు చెల్లెమ్మా! కాఫీ చేసుకుందామనుకునేటప్పటికి నా దగ్గర స్టాకున్న కాఫీ పొడి అయిపోయిందని తెల్సింది. నువ్వు కాస్త కాఫీ పొడి అప్పిస్తే.."

వరలక్ష్మి మూతిని మూడు వంకర్లు తిప్పింది. "మొన్న మొన్న టీపొడి, నిన్న కారప్పొడి, ఈవాళ కాఫీ పొడి. నెల ముప్ఫై రోజులూ, ఏదో ఒకటి అడక్కపోతే మీకు తిన్నది అరగదేంటండి? " అంటూనే చిరాగ్గా అయిష్టంగా లోపలకెళ్లింది.

తాతారావు అక్కడున్న కుర్చీలో కూర్చున్నాడు. అతని చేతిలో ఆ రోజు న్యూస్ పేపర్ ఉండడం వంశీకి బోలెడంత ఆశ్చర్యం కలిగించింది. "ఏవండీ తాతారావుగారూ మీరు రోజూ పేపర్ కూడా కొంటారా? " అన్నాడు.

తాతారావు రాగద్వేషాన్ని జయించిన జితేంద్రియుల్లా చిన్నగానవ్వి "పేపరే కాదు బాబూ, ఏ వస్తువైనా సరే కొనడం అనేది మా ఫ్యామిలీకి అచ్చిరాదు. మా పెళ్లైన కొత్తలో ఓసారి మా ఆవిడ నాకు చెప్పకుండా ఓ రూపాయి పెట్టి పువ్వులు కొనేసింది. అంతే ఢామ్మంటూ చచ్చిపోయింది"

"అదేంటండీ. అలాగంటారు? మీ ఆవిడ మీతో ఇరవయ్యేళ్లు కాపురం చేసిందని, మీకో

కూతురు కూడా పుట్టిందనీ, మీ అమ్మాయికి పెళ్లయ్యేకే ఆవిడ చనిపోయిందని మా పిన్ని నాతో చెప్పిందే"

"అదేలేవయ్మా, ఢామ్మని చచ్చిపోవడం అంటే అర్థం ఇలా పువ్వులు కొనగానే అలా చచ్చిపోయిందనికాదు. ఆ పువ్వులు పెట్టుకున్న ఇరవై ఏళ్ల తర్వాతే చచ్చిపోయింది. అయితే మాత్రం నేను ఇంతవరకు బ్రతికుండి అది పోయిందంటే అది అకాల మృత్యువుకి బలైపోయినట్టేకదా! దాని సంగతి వదిలెయ్, ఇంక ఈ పేపర్ సంగతంటావా ఇది నేను కొన్నది కాదు. ఈ వీధిలో ఆకుపచ్చరంగు మేడలో కంట్రాక్టర్ సత్తిరాజుగారున్నారుకదా! పాపం ఆయన కష్టపడి, కష్టపడి రాత్రి పన్నెండు గంటలదాకా పేకాటాడి, మందుకొట్టి, ఇంటికొచ్చి పడుకుంటాడు. ఉదయం పదకొండు గంటలదాకా లేవడు. అంతవరకు ఈ పేపరు ఆ ఇంటి గుమ్మంలోనే పడుంటుంది. వృథాగా ఎందుకు పడుండడం అన్చెప్పి నేనే ఆ పేపర్ తెచ్చి చదివేసి మళ్లీ ఆ గుమ్మంలో పడేస్తుంటాను"

"పడేస్తారా? లేక దీన్ని మీరే తొక్కిపెట్టేస్తారా? "

"నీతో అబద్ధమాడ్డం ఎందుగ్గాని ఆ సత్తిరాజుగారు గట్టిగా అడిగితే ఇచ్చేస్తుంటాను. అడక్కపోతే నా మంచంకింద తోసేస్తుంటాను. పాత పేపర్లు ఒక్కోదానికి నలభై అయిదు పైసల రేటు పలుకుతోందికదా! ఈవిధంగా నాకిదో సైడ్ ఇన్‌కమ్"

వరలక్ష్మి ఓ చిన్న కాగితంలో కాఫీ పొడరు కట్టి తీసుకొచ్చి అతనికి అందించింది. అయినా అతను వెళ్లలేదు. "కాఫీ పొడి ఇచ్చేశావు. మరి మిగతా రెండు ఐటమ్స్ ఏవమ్మా? " అన్నాడు.

ఆ రెండు ఐటమ్స్ ఏంటో వంశీకి, వరలక్ష్మికి కూడా అర్థం కాలేదు. "ఏంటండీ ఆ రెండు వస్తువులు? " అంది వరలక్ష్మి అమాయికంగా ముఖం పెట్టి.

"అవేనమ్మా... పాలు, పంచదార"

"అది మీరు అడగలేదుకదండి"

"వేరేగా అడగాలటమ్మా సపోజ్ మనం ఓ హోటల్‌కెళ్లి ఇడ్లీ కావాలని ఆర్డరిచ్చాం అనుకో! ఆ సప్లయర్ ఇడ్లీతోపాటు చెట్నీ సాంబారు కలిపే పట్టుకొచ్చేస్తాడుగానీ వాటికోసం సపరేట్‌గా ఆర్డరివ్వం కదా! ఇదీ అంతే! నేను కాఫీ పొడి ఎందుకడిగేను? కాఫీ చేస్కోడానికి. నువ్వొత్త కాఫీపొడి యిచ్చేస్తే, నేను మళ్లీ పాలు కోసం ఓ యింటికి, పంచదారకోసం మరో యింటికి వెళ్తే... ఎంత నామోషీయో ఆలోచించావా? "

"సిగ్గూ శరమూ వదిలేసిన మీకు నామోషీ ఏంటి? "

"నామోషీనాక్కాదమ్మా, నీకు! ఫలానా వరలక్ష్మిగారింట్లో పాలూ, పంచదార కూడా లేవంటే అది నీకెంత నామోషీ? నీ యింటి ఓనర్‌గా నాకెంత నామోషీ? "

వరలక్ష్మికి అతణ్ణి సరుకులు యివ్వకుండా పంపడం సాధ్యం కాదని తేలిపోయింది. అతనికి డైరక్టుగా చెప్పినా, ఇన్‌డైరెక్టుగా చెప్పి డబల్‌మీనింగ్‌తో చెప్పినా, అదంతా దున్నపోతుమీద కురిసిన వర్షంలాగ వేస్ట్ అయిపోతుందనే నిర్ణయానికొచ్చి మూలుక్కుంటూనే వెళ్లి పాలు, పంచదార తీసుకొచ్చి అందించింది. "తేంక్సు చెల్లెమ్మా! ఇవాళ మధ్యాహ్నం మీ యింటికి చారుకి గానీ, కూరకిగానీ రానమ్మా! నువ్వేం కంగారుపడకు" అన్నాడు.

"ఇవాళ వాటికోసం ఎవరిమీద వాలిపోతున్నారు? "

"ఛీ ఛీ ఛీ... నేనేం వాలిపోవడంలేదమ్మా! మన వీధిలో వెంకట్రావుగారమ్మాయి పెద్దపిల్లయిందట. ఇవాళ బంధువులకి, స్నేహితులకీ భోజనాలు పెడుతున్నారట. నేనూ వెళ్లి భోంచేసేస్తాను"

"ఆ వెంకట్రావూ, మీరూ ఏడాదికిందట రోడ్డెక్కి మరీ తిట్టుకున్నారుకదండి. మిమ్మ

ల్నెలా భోజనానికి పిలిచాడు?"

"ఆ... గొడవా, నా బొందా? అలాంటి వాటిని వెంట వెంటనే మర్చిపోవాలమ్మా? పెద్దపెద్ద పొలిటికల్ లీడర్లే యివాళ తిట్టుకుంటారు, రేపు కొట్టుకుంటారు, ఎల్లుండి యిద్దరూ కలిసి కౌగలించుకుంటూ ఫొటో తీయించుకుంటారు. అలాంటి వాళ్ళకే పట్టింపులు లేనప్పుడు, నాలాంటి సాదేతీన్‌గాడికెందుకు? ఆ వెంకట్రావు నన్ను పిలవకపోతే మాత్రం మన వీధిలో ఓ శుభకార్యం జరుగుతున్నప్పుడు నేను చూస్తూ ఎలా వూరుకోగలను? నాది విశాల హృదయం కాబట్టి, అతన్ని క్షమించేసి వెళ్లిపోతున్నాను. ఆకు దగ్గర కూర్చున్న మనిషిని, ఎవరూ చెయ్యి పట్టుకుని బైటకి ఈడ్చెయ్యరుగా" అంటూ నవ్వేడు తాతారావు.

ఇంత సిగ్గూ లజ్జా లేని మనిషిని నేనెక్కడా చూళ్లేదు బాబూ అని వరలక్ష్మి మనసులోనే సణుక్కుంటూ ఇంట్లోకెళ్ళబోయింది.

తాతారావు ఆమెను ఆపి, "మన వంశీ శుభమాని ఇంటర్వ్యూ కెళ్తున్నాడు గదా!



నువ్వు ఎదురొచ్చి పంపితే అంతా శుభంగా జరుగుతుంది. నువ్వు ఎదుర్రామ్మా" అన్నాడు.

వరలక్ష్మికి ఒళ్ళంతా కారం రాసుకున్నట్టుగా భగ్‌భగ్‌మని మండింది. "ఏవండీ వాడు ఇంటర్వ్యూకి వెళ్తుండగా మీరు ఎదుర్రావడం, ఎక్కడికెళ్తున్నావని అడగడంతోనే, నా గుండెల్లో రాయి పడింది. అది చాలక, మొగుడు చచ్చిందాన్ని నన్ను ఎదురు రమ్మంటారా? ఏం, వాడికి వుద్యోగం రావడం మీకిష్టం లేదా?" అంది రుసరుసలాడుతూ.

ఆవిడ చిరాకుని ఏమాత్రం పట్టించుకోకుండా, తన ధోరణిలోనే జవాబు చెప్పాడు. "అవన్నీ పాత డైలాగులు చెల్లెమ్మా! వితంతువు ఎదురొస్తే, కొంపలు మునిగిపోతాయని భ్రమపడే భారతదేశంలోనే, ఓ వితంతువు ప్రధానమంత్రి అయింది. ఝామ్మంటూ దేశాన్ని ఏలుబడి చేసింది. ఆవిడ రూలింగ్‌ని ఎవడైనా కాదన్నాడా? ఆవిడ చేత శంకుస్థాపనలు చేయించడం మానేశారా? ఇదీ అంతేననుకో! వితంతువు ఎదుర్రాకూడదనే ఆచారాన్ని కేన్సిల్ చేసేసి చాలా సంవత్సరాలయింది. ఇప్పుడున్న లేటెస్ట్ రూల్స్ ప్రకారం..." అతను యింకా ఏదో చెప్పబోతుంటే ఆ మాటలు వింటానిక్కూడా యిష్టంలేనట్టుగా వరలక్ష్మి విసురుగా లోపలకెళ్ళి పోయింది.

తాతారావు వంశీని తీసుకుని బయటికి నడిచాడు. తాతారావు డాబామీదకెళ్ళడానికి అక్కడే మెట్లున్నాయి. అతను మెట్లెక్కబోతూ, ఏదో ముఖ్యమైన విషయం గుర్తొచ్చినట్టుగా ఆగి "ఓయ్, నువ్వెళ్తున్న ఇంటర్వ్యూలో నువ్వు సెలక్టవకపోయినా ఫీలవకు. దుబాయ్ శంకర్రావని నా ఫ్రెండొకడున్నాడు. వాడు దుబాయ్, అబూదాబీ లాంటి గల్ఫ్ కంట్రీస్‌లో చాలామందికి వుద్యోగాలిప్పించాడు. ఇప్పించినందుకు కొద్దో గొప్పో కమీషన్ తీసుకుంటాడనుకో కానీ అది నీకొచ్చే వుద్యోగంముందు ఏపాటిదిలే! సాయంత్రం నిన్ను తీసుకెళ్ళి పరిచయం చేస్తాను" అన్నాడు.

వంశీకి మనసులో ఆశ కలిగింది. గల్ఫ్ కంట్రీస్‌లోని వుద్యోగాలకి చాలా పెద్ద జీతాలొస్తాయని విన్నాడు.

"మా ఫ్రెండ్ విజయ్‌కి కూడా యిస్తారాండి?" చాలా ఆసక్తిగా అడిగాడు.

"ఇస్తాడయ్యా, వాడికి కావలసింది కమిషన్. సాయంకాలం అతన్ని కూడా తీసుకొచ్చెయ్" అన్నాడు తాతారావు అతని భుజం తడుతూ.



ఆ రోజు జరిగిన ఇంటర్వ్యూకి వంశీతో పాటు విజయ్‌కుమార్ కూడా వెళ్లాడు. వాళ్ళు అనుకున్నట్టే యిద్దరూ సెలక్ట్ కాలేదు. అయినా దుబాయ్‌లోని ఉద్యోగాలు తమ కోసం రెడీగా వున్నాయి కాబట్టి, వాళ్ళేమీ నిరాశపడలేదు. ఆ సాయంత్రం యిద్దరూ కలిసి తాతారావు దగ్గర కొచ్చేసరికి, అతను అప్పలస్వామి అనేవ్యక్తితో గొడవపడుతున్నాడు. అప్పలస్వామికుండే రెండు ఆవుల్లోను ఒకదాన్ని తాతారావుదగ్గర తనఖా పెట్టి కొంత డబ్బు అప్పుతీసుకున్నాడు. తనఖా పెట్టేటప్పటికి అది కడు

పుతో ఉంది. అది తాతారావు అధీనంలో వున్నప్పుడే ఓ దూడని ఈనింది. ఇప్పుడా అప్పలస్వామి వచ్చి, తాతారావుకి బాకీ పడిన సొమ్మిచ్చి తన ఆవునీ దూడనీ తీసుకెళ్తానన్నాడు. కానీ, తాతారావు ఆవు ఒక్క దాన్నే యిస్తానంటున్నాడు. దూడమాత్రం తనకే చెందాలని వాదిస్తున్నాడు.

"అదెలాగవుద్దండి. నేను కడుపుతో వున్న ఆవుని కదా మీ దగ్గర తాకట్టుపెట్టాను. అప్పుడే దాని కడుపులో దూడ వుంది. అంచేత ఆవుతోపాటు దూడ కూడా నాకే చెందుతుంది" అని అప్పల్రావు వాదిస్తున్నాడు. కానీ తాతారావు రివర్స్ గేర్‌లో వితండవాదం చేస్తూ "నువ్వు సూడి ఆవునే తనఖా పెట్టేవు. నేనేం కాదన్నానా? కానీ నీ ఆవు నా అండర్లో వున్నప్పుడు దానికి కొన్నాళ్ళపాటు పాలు ఎవరు పిండుకున్నారు? నువ్వా? నేనా?"

"మీరేనండి"

"పేడ ఎవరు తీసుకున్నారు?"

"మీరేనండి"

"అలాగే, దూడనెవరు తీస్కోవాలి? నేనా? నువ్వా?"

"మీరేనండి... కాదు కాదు కాదు, నేనే తీస్కోవాలండి"

"అదేం న్యాయమయ్యా? నీ ఆవు నా దగ్గర తనఖాలో వున్నంత కాలం దానికి గడ్డి ఎవరు పెట్టేరు? నేను! అంచేత ఆ గడ్డి ఖర్చుకింద ఆ దూడని తొక్కిపెట్టేసాను"

"గడ్డి ఖర్చు మీరు బరాయించేరనే, నా దగ్గర మిగతా వాళ్ళకంటే ఓ పావలా ఎక్కువ వడ్డీ తీసుకున్నారు"

"అయినా సరే, ఆ దూడ నాకే చెందుతుందయ్యా! కావాలంటే సుప్రీమ్ కోర్టులో కేసు వేస్కో... సర్సరి... నువ్వు సుప్రీమ్ కోర్టుదాకా ఏం వెళ్తావుగానీ, యిదిగో యిక్కడే యిద్దరు కుర్రాళ్ళున్నారు. ఇద్దరూ ఫస్ట్‌క్లాస్‌లో డిగ్రీ పాసయ్యేరు. నువ్వు చెప్తున్నది న్యాయమా? లేక నేను చెప్తున్నది న్యాయమా? అని వీళ్ళనే అడిగి చూడు" అన్నాడు తాతారావు.

వాళ్ళిద్దరూ యిరకాటంలో పడ్డారు. తాతారావు చేస్తున్నది నూటికి నూర్రొంతులూ అన్యాయమని స్పష్టంగానే తెలుస్తోంది. ఆ విషయమే వంశీ చెప్పెయ్యబోతుంటే తాతారావుకి వినబడకుండా కేవలం వంశీకి మాత్రమే వినబడేలా విజయ్ మెల్లగా గొణిగాడు.

"ఇప్పుడు మనకి తాతారావుతో పనుంది. ఇప్పుడు మనం కరక్టుగా తీర్పు యిస్తే మనకెవడూ హైకోర్టు జడ్జీ వుద్యోగాలు యిచ్చెయ్యడు" అన్నాడు.

వంశీ మౌనం వహించాడు. విజయ్ మాత్రం ధైర్యంచేసి "అప్పలస్వామిగారూ, ఎట్నుంచి ఎటు చూసినా తాతారావుగారు చెప్పిందే కరక్టనిపిస్తోందండి. ఇక్కడ మనం నలుగురం వున్నాం. అందులో ముగ్గురు ఒక్కలాగ చెప్పినప్పుడు అదే కదా కరక్టవుతుంది" అన్నాడు.

"అదీ మాటంటే, భలేగా చెప్పేవయ్యా" అంటూ తాతారావు విజయ్ భుజంమీద తట్టాడు.

వంశీ మాత్రం యిందులోని అన్యాయాన్ని సహించలేక "మీరు వుండండి అప్పలస్వామిగారు" అన్చెప్పి, విజయ్‌ని లాక్కుని ఓ పక్కకి వెళ్లాడు. "తాతారావుగారు చెప్తున్నది అన్యాయంరా" అన్నాడు వంశీ.

"నాకు తెలుసు" అన్నాడు విజయ్ నవ్వుతూ.

"మరి, తాతారావుని సపోర్ట్ చేస్తావేం?"

"అతన్తో మనకి పనుంది కాబట్టి, న్యాయం ఎవరి పక్షానవుందీ అని ఆలోచించి కరక్టుగా తీర్పు యివ్వడానికి మనం విక్రమార్కులం కాదు, ధర్మరాజులం కాదు"

"అది కాదురా! మనం ఓ గర్భవతిని హాస్పటల్లో జాయిన్‌చేయించి డెలివరీ చేయించామనుకో! తిరిగొచ్చేటప్పుడు, మనకా లేడీనే యిస్తాం, బిడ్డని యివ్వమని, ఆ బిడ్డ

హాస్పిటల్‌వాళ్ళకే చెందుతుందనీ వాళ్ళు వాదిస్తే"

"అలా అని ఏ డాక్టరూ వాదించడు, ఎందుకంటే వాళ్లెవరూ తాతారావులాంటి దురాశాపరులు కారు కాబట్టి! బిడ్డని తమతో పాటు వుంచేసుకుంటామని చెప్పగానే సరికా దురా, ఆ బిడ్డని జీవితాంతం పోషించాలి. పనిష్మెంటుని ఎవడు కోరుకుంటాడు? దూడని వుంచేస్కుంటే, అది పెద్దదయేక పాలు పిండుకుని అమ్ముకుంటాడు. తాతా రావులాంటి వాడికి లాభం, నష్టం అనే మాటలు తప్ప- మంచి, చెడు అనే మాటలు తెలియవు"

"అంటే మనుషులకో న్యాయం, పశు వులకోన్యాయమూనా? "

"యస్! మనుషులు అన్నం తింటారు. పశువులు గడ్డి తింటాయి. ఇవన్నీ వది లెయ్. ఇప్పుడు మనకి తాతారావు ద్వారా దుబాయ్‌లో వుద్యోగాలు రావాలి. అంచేత వాడికే ఓటు వేసేద్దాం. ఈ విషయంలో నోమోర్ డిస్కషన్స్ పదా!" అంటూ వంశీని తీస్కుని విజయ్ వెళ్ళి "చాలాసేపు న్యాయా న్యాయాల గురించి డీప్‌గా డిస్కస్ చేశాక మా వంశీకృష్ణ కూడా తాతారావుగారు చెప్పిందాన్నే కరక్టని ఒప్పుకున్నాడండి" అన్నాడు.

తాతారావు కక్కుర్తి నవ్వు నవ్వేడు. అప్ప లస్వామి మాత్రం కళ్ళంట నీళ్ళు పెట్టుకుని వెళ్ళిపోయాడు. వెళ్ళేముందు తాతారావుని బైటకే తిట్టాడు.

"ఏవండీ అతను మిమ్మల్ని ఘోరంగా తిట్టుకుంటూ వెళ్తున్నాడండీ" అన్నాడు వంశీ బాధగా.

"నాకు వినబడలేదని నువ్వు పనిగట్టుకుని చెప్తున్నావా? వాడింకా బూతులు తిడతాడ నుకున్నాను. కానీ, వాడు చాలా తక్కువ తిట్లే తిట్టాడు" తాతారావు తొణక్కుండా బెణక్కుండా చెప్పాడు.

"అది కాదండీ వాడలా తిడుతుంటే మీకు బాధకలగదా? "

"మొదట్లో కలిగేది. కానీ, ఛండాలప్ప నులు చేసేటప్పుడు యిలాంటి తిట్లు ఎన్నిం టినో భరాయించాలి. ప్రతీరోజు ఎవడో ఒక డిచేత యిలాంటి తిట్లు తింటుండడంవల్ల నాలో ఎటువంటి రియాక్షనూ రావడం మానేసింది. చన్నీళ్లతో స్నానం చేసేటప్పుడు మొదటి చెంబు పోసుకున్నప్పుడే ఒళ్ళు జల దరిస్తుంది. ఆ తర్వాత చల్లదనానికా బాడీ అలవాటుపడిపోతుంది. గదా! అలాగే యిదీని. మొదటిసారి ఒకడిచేత అడ్డమైన తిట్లూ తిన్నప్పుడు, ప్రాణం గిలగిల్లాడిపో యింది. కానీ ఆ తర్వాత ఎవడెన్ని తిట్టినా, అది దున్నపోతుమీద వర్షం కురిసినట్టే అయిపోతుంది. మనం దారంట వెళ్తుండగా, మన నెత్తిమీదో కాకి రెట్టవేసిందనుకో, అప్పుడు మనం ఏంచేస్తున్నాం? రెట్టేసింది కదాని ఆ కాకిని కొడుతున్నామా? లేదు! కాకి రెట్టపడింది కదాని మన తలకాయ నరికేసుకుంటున్నామా? లేదే! సింపుల్‌గా రుమాలుతో తుడిచేసుకుంటున్నాం! ఇదీ అంతే" అంటూ తాతారావు తను మానసి కంగా ఎంతశక్తి సంపాదించిందీ వివరిం చాడు.

ఆత్మగౌరవాన్ని చంపేసుకున్నవారిలో అగ్రగణ్యుణ్ణనీ, బతకనేర్చిన వాళ్లలో ఏ ఒన్ లెవెల్‌కి చెందినవాణ్ణనీ తనే చెప్పడంతో స్నేహితులిద్దరూ మరేమీ మాట్లాడకుండా అతన్ని తీసుకుని దుబాయ్ శంకర్రావు యింటికి బయలుదేరారు!

★ ★ ★

దుబాయ్ శంకర్రావు పొడుగ్గా నల్లరంగు పూసిన సరుగుడు కర్రలా కనిపిస్తాడు. అతను మాటలతో ఎదుటివారి మనసుల్ని ఆకాశం అంచులోకి తీసుకుపోగల సమ ర్థుడు. అందులోనూ అతని దగ్గరకొచ్చేవాళ్ళె క్కువ మంది నిరుద్యోగులే! ఆశ నిరాశల మధ్య ఉయ్యాల లూగుతుండేవారే! వారి మనసులకి గోరంత గేస్ కొడితే కొండంతగా

పొంగిపోతాయని అతనికి క్షుణ్ణంగా తెలుసు. గల్ఫ్ కంట్రీస్‌లోని పెద్దపెద్ద ఆఫీసర్లంతా తన జేబులో వున్నట్టే మాట్లాడతాడు.

తాతారావు వంశీని, విజయ్‌ని పరిచయం చేశాక శంకర్రావు కాళ్ళదగ్గర పెంపుడు కుక్కని కూర్చోబెట్టుకుని మంచంమీద మోచేతిమీద వాలి పడుకుని నవాబులు పీల్చే హుక్కా పీలుస్తున్నాడు.

తాతారావుకి హుక్కా పీల్చడం అలవాటు లేకపోయినా ఫ్రీగా వస్తోంది కదాని రెండు దమ్ములు లాగేసి "రేయ్ శంకర్రావు మావాళ్లకి ఆ వుద్యోగాలు ఎలాగైనా ఇప్పించెయ్యాల్రా" అన్నాడు.

"భలేవాడివేరా! గల్ఫ్ కంట్రీస్‌లో నేను ముగ్గురు చీఫ్ మినిస్టర్లంత పలుకుబడి వున్నవాణ్ణి. నా దగ్గరేమో నీకు ముగ్గురు ఎమ్మెల్యేలకున్నంత చనువుంది. నేను ఎలాంటెలాంటి వాళ్లనో తీసుకెళ్ళి అక్కడ అందలాల్లో కూర్చోబెట్టేను. అలాంటిది నువ్వు స్వయంగా తీసుకొచ్చిన కేండిడేట్లని నేనెందుకు వదిలేస్తాను? "

శంకర్రావు ఆమాట చెప్పాక నౌఖరు తెచ్చిన కాఫీని మిత్రులిద్దరికీ ఇచ్చాడు. వాళ్ళు మొహమాటపడుతూ కాఫీలు తాగాక శంకర్రావు తన నోట్లో వున్న గేస్ సిలండర్ని ఓపెన్ చేశాడు.

"మీ ఇద్దరికీ వుద్యోగాలు డెఫినెట్‌గా వచ్చేస్తాయి. ఆ ఉద్యోగాలకి నెలకి లక్షరూపాయలు జీతం ఇస్తారు" అన్నాడు ధీమాగా.

"ఎంతండి? నెలకి... లక్షరూపాయలా? " వంశీ నమ్మలేనట్టుగా అడిగాడు.

"ఔనయ్యా! ఆరంభంలో అంతకంటే ఎక్కువగా ఇప్పించడం కుదరదు! ఉద్యోగం రాగానే ఒక్కొక్కరికీ ఒక్కో ట్రిబుల్ బెడ్ రూమ్ ఫ్లాట్ ఇచ్చేస్తారు. దాని అద్దెకింద అందరిదగ్గర పాతిక వేలు చొప్పున నెలనెలా తీస్కుంటారు. కానీ మీ దగ్గర వెయ్యి రూపాయల కంటే ఎక్కువ తీస్కోరు. ఫ్లాట్ ఇచ్చిన నాలుగు రోజులుకి మీకు తలా ఓ మారుతీ కారు ఇచ్చేస్తారు. కారు ఖరీదు కింద నెలనెలా ఐదు వేల చొప్పున ఇన్‌స్టాల్మెంటు కట్టాలి! కానీ మీరు నెలకి వెయ్యి రూపాయలు కడితే చాలు కారుతో పాటు ఒక్కొక్కరికీ నాలుగు డ్రమ్ముల పెట్రోల్ కూడా ఫ్రీగా ఇచ్చేస్తారు. ఇవన్నీ నేను చెప్తేనే!" అన్నాడు.

ఆ విధంగా శంకర్రావు తనకి ఆ దేశాల్లో వున్న పలుకుబడి ఏమిటో తెలియజేశాడు. ఆ మాటలు వినేసరికి అతని ఎదురుగా వంశీ, విజయ్‌లు శరీరాలైతే కూర్చున్నాయి గానీ వారి మనసులు మాత్రం ఆకాశవీధుల్లో, ఎడ్రస్ చెప్పలేని ప్రాంతాల్లో విహరించసాగాయి. నెలకి లక్ష రూపాయల జీతం, ట్రిబుల్ బెడ్‌రూమ్ ఫ్లాట్, చిన్నచిన్న వాయిదాల్లో చెల్లించే విధంగా ఓ కారు, ఫ్రీగా పెట్రోలు... ఇవన్నీ నిజమా? అబద్ధమా? ఈ ప్రశ్నని అడక్కుండా వుండలేకపోయారు.

శంకర్రావు చిన్నగా నవ్వి చెప్పాడు. "మీరు ఇక్కడ పుట్టి ఇక్కడ పెరిగారు కాబట్టి మీకా విషయాలు వింతగా కనిపిస్తున్నాయి. కానీ అక్కడ అవన్నీ నిజంగా జరిగేవే! ఇక్కడ కళ్లద్దాల షాపుకెళ్ళి కళ్లద్దాలు కొంటే దాన్ని పెట్టుకోడానికి ఓ బాక్సు కూడా ఇవ్వడం లేదూ! ఇదీ అంతే! ఈ పెట్రోల్ యిచ్చే సదుపాయం అందరికీ ఇవ్వరు. కేవలం నా కేండిడేట్స్‌కి మాత్రమే ఇస్తారు.

"ఆ మాటల్తో స్నేహితులిద్దరూ వుబ్బితబ్బిబ్బయ్యారు. మరో వైపు సంశయంలోనూ కొట్టుమిట్లాడుతున్నారు. తాతారావు మాత్రం గర్వంగా "చూశారా ఎలాంటి వాణ్ణి ఇంట్రడ్యూస్ చేశానో!" అంటూ మీసం దువ్వేడు. "ఆలసించిన ఆశాభంగం కాబట్టి వెంటనే రెడీ అయిపోండి" అంటూ ఓ సలహాని కూడా ఇచ్చేశాడు.

ఆ మాట చెప్పాక శంకర్రావు ఓ బాంబు పేల్చాడు "మీ దగ్గర నేను ఎక్కువ కమీషన్

తీస్కోలేను. అంచేత తక్కువలో తక్కువ చెప్తున్నాను. మీరిద్దరూ తలా ఓ లక్ష రూపాయలు యిచ్చెయ్యండి. ఎడ్జస్ట్ అయి పోతాను" అన్నాడు హుక్కా పీలుస్తూ.

స్నేహితులిద్దరూ ఒక్కసారి ముఖాలు చూసుకున్నారు.

"ఓకే సార్. నెలకి లక్షరూపాయల చొప్పున సంవత్సరానికి పన్నెండు లక్షలు వస్తాయి. ఖర్చులకింద రెండు లక్షలు తీసే సినా, నెట్ ఎమౌంట్ పదిలక్షలు! అందులో ఓ లక్ష రూపాయలు మీకివ్వడానికి మేం అసలు వెనకాడం, ఆలోచించంకూడాను. మా మొదటి నెల జీతం అందగానే దాన్ని అలాగే తీసుకొచ్చి యిచ్చేస్తాం" అన్నాడు వంశీ.

విజయ్ కూడా వంతపలికాడు.

కానీ, శంకర్రావు ఒప్పుకోలేదు. "చూడండి, పేమెంట్స్‌లో రెండు రకాలున్నాయి. కాఫీ హోటల్‌కెళ్ళి టిఫిన్ తినేసింతర్వాతే బిల్లు చెల్లిస్తాం. కానీ సినిమా చూడ్డానికి థియేట ర్‌కెళ్ళినప్పుడు ముందుగా డబ్బులిచ్చి టిక్కెట్ కొన్నాకే థియేటర్‌లోకి వెళ్ళాలి. ఔనా? కాదా? "

"ఔనండి" యిద్దరూ ఒకేసారి జవాబు చెప్పారు.

"థేంక్యూ! నాది సినిమాహాల్ టైప్! ముందుగానే డబ్బులిచ్చి టిక్కెట్ తీసుకో వాలి" శంకర్రావు ఆ మాట చెప్పడమే కాదు, మంచంమీదనించి దిగి, ఆ మాటమీదే నిల బడిపోయాడు.

"ముందుగానే ఇచ్చెయ్యమంటే ఎలా సార్? మా దగ్గర లక్ష రూపాయలుంటే, మా జీవితాలెందుకు దులిపేసిన సంచుల్లా యిలా వుంటాయి? " అంటూ ఇద్దరు మిత్రు లూ అతన్ని ప్రాధేయపడ్డారు.

కానీ శంకర్రావు తన మాటమీదనించి ఒక్క అంగుళం కూడా పక్కకి జరగలేదు.

తాతారావుని కూడా ఓ మాట సాయం చెయ్యమన్నారు కుర్రాళ్ళు.

"బాబూ, నేను చెయ్యగలిగే మాట సాయం చేశాను కాబట్టే, మీకు వుద్యోగాలతో పాటు ఎపార్ట్‌మెంట్సు, దాంతోపాటు కారు, కారుతోపాటు పెట్రోల్ కూడా ఫ్రీగా యిప్పించే ఏర్పాటు చేశాను. కానీ మనకి లాటరీ తగలాలన్నా ముందుగా ఓ రూపా యిచ్చి టిక్కెట్ కొనాలికదా! మీదగ్గర ఆ రూపాయి కూడా లేదంటున్నారు. పోనీ, అప్పుయిద్దామంటే మొత్తం నేను రొటేషన్ చేసే డబ్బే ముప్ఫై అయిదు వేలు! అది మీరిద్దరూ దుబాయ్‌కెళ్ళడానికి కాదుగదా. బహుశా ముంబాయ్ వెళ్ళడానిక్కూడా సరి పోదు. పోనీ, మీకు మరోచోట అప్పుయిప్పి ద్దామంటే వాళ్ళు తనఖా కింద ఏం పెడ తారూ అని అడుగుతారు. మీదగ్గర నిరు ద్యోగం తప్ప తాకట్టుపెట్టడానికి మరేమీ లేదుగదా" అంటూ తాతారావు రెండు చేతులూ ఎత్తేశాడు.

దాంతో వాళ్ళ కళ్ళముందు అవకాశమనే అందమైన హరివిల్లు కనిపించినట్టే కనిపించి అలా అలా కనుమరుగైపోయినట్లయింది. వంశీ, విజయ్ ఇద్దరూ చాలాకాలంనించి నాటకాలు ప్రదర్శిస్తున్నారు. ప్రగతి కళామం దిర్ అనే ఔత్సాహిక నాటక సమాజంద్వారా వివిధ నాటక పరిషత్తుల్లో నాటకాలు ప్రద ర్శించి ఇద్దరూ చాలాసార్లు ఉత్తమ నటుడి బహుమతులు పొందారు. పగలంతా వుద్యోగాలకోసం తిరిగి తిరిగి, సాయంకాల మయేసరికి నాటక సమాజానికి చేరుకుని రిహార్సలు చేస్కోవడంతో వాళ్ళిద్దరి డైలీ టైమ్‌టేబిల్ పూర్తయేది.

ఈ కార్యక్రమం యిలా సాగుతున్నప్పుడే విజయ్‌కి అదృష్టదేవత ఎదురొచ్చి, అతన్నో ఖరీదైన కుటుంబానికి అల్లుణ్ణి చేసింది. వుద్యోగం కూడా వాళ్ళ మామగారే వేయిం చారు.

ఇప్పుడు ఒంటరిగా మిగిలిపోయింది వంశీయే! కష్టాలు గుంపులుగుంపులుగా వస్తాయి. సుఖాలు మాత్రం ఒకదాని

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో *100* పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో *100* పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన *4* వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/- పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

జనవరి చతుర నవల **స్వర్గం మీచేతుల్లోనే వుంది** ......

**సమీక్షకుని పేరు :** ..............................................................

**చిరునామా :** ..............................................................

..............................................................

..............................................................

..............................................................

తర్వాతే మరొకటి వస్తాయి. వంశీకున్న ఒకే ఒక్క దిక్కు వరలక్ష్మిగారు కూడా ఒక్క రోజు జబ్బుపడకుండా ఎవరిచేతా ఏ సేవలూ చేయించుకోకుండా, రాత్రి పడుకున్న మనిషి వుదయం ఆరోగంటకల్లా శవంగా కనిపించింది.

"నీకు పెళ్ళి చేసి, నిన్నో ఇంటివాణ్ణి చేస్తే నా జీవితానికో సార్థకత కలుగుతుంది వంశీ" అని పదేపదే చెప్పిన వరలక్ష్మి, తన జీవితాశయాన్ని నెరవేర్చుకోకుండానే ఈ లోకంనించి దాటిపోయింది. వంశీచేత యిన్ని నీళ్ళు నోట్లో పోయించుకోకుండానే మట్టిలో మట్టిగా మారిపోయింది.

విజయ్‌కుమారే దగ్గరుండి తన డబ్బుతో ఆమెకు అంత్యక్రియలు చేశాడు. తాతారావు కూడా యధాశక్తి సహాయపడ్డాడు. వుద్యోగం లేని ఒంటరి బతుక్కి అంత యిల్లు అనవసరమనిపించి తాతారావుగారి యిల్లు వదిలేసి, మరోచోట ఓ చిన్న రూమ్ అద్దెకు తీసుకున్నాడు.

ఆమె మరణించిన నెల రోజుల తర్వాత వంశీకి ఓ ప్రైవేట్ కంపెనీలో వుద్యోగం వచ్చింది. కాకపోతే సెక్యూర్టీ డిపాజిట్ కట్టాలన్నారు. ఎలా? ఎలా? అని ఆలోచిస్తున్న తరుణంలో ఓరోజు విజయ్ వచ్చి ఆ సెక్యూర్టీ డిపాజిట్ కట్టి, వంశీకి వుద్యోగం రావడానికి హెల్ప్‌చేశాడు.

వంశీ తన చేతికొచ్చిన ఎపాయింట్‌మెంట్ ఆర్డరు పట్టుకుని, కృతజ్ఞతలు చెప్పడానికి విజయ్ దగ్గరకెళ్తే అతనింట్లో లేడు "మీ దగ్గరికే వెళ్తానని ఆయన బయలుదేరేరండి" అంది విజయ్ భార్య రజని.

అతను ఆ విషయాన్ని నమ్మలేదు. "ఒకవేళ ఆఫీసులోనే ఓవర్‌టైమ్ చేస్తున్నారేమో" అంటూ మరో సమాధానం కూడా చెప్పింది. "ఫోన్ చేసి మాట్లాడతారా?" అంది రజని ఫోన్ అందిస్తూ!

వంశీ స్టేజిమీద బ్రహ్మాండమైన నటుడు కానీ అతనికి జీవితంలో నటించడం యిష్టం వుండదు. నటించలేడు కూడాను. "వద్దులేమ్మా. బావగారు రెండు మూడు సెక్షన్స్‌లో సూపర్‌వైజ్ చేయాలి ప్రస్తుతం ఏ సెక్షన్లో వున్నాడో ఏంటో! నేనే ఆఫీసుకెళ్ళి కలుస్తాను" అంటూ ఆవిడ ముఖం చూస్తూ కాకుండా నేల చూపులు చూస్తూ మాట్లాడే అక్కడనించి వెళ్ళిపోయాడు.

విజయ్ ఎక్కడికి వెళ్లుంటాడో వంశీ చాలా సులభంగానే గ్రహించగలిగాడు. ఎందుకంటే ఆ యింటికొచ్చేముందు విజయ్ పని చేసే ఆఫీసుకే వెళ్తే అతనారోజు మధ్యాహ్నం శెలవు పెట్టేడని తెల్సింది. అందుకే ఇంటికొచ్చాడు. ఇంట్లోనూ లేడు. విజయ్‌కి పర స్త్రీ వ్యామోహం వుంది. పెళ్ళికి ముందు అతను కొన్ని సార్లు అలాంటి వ్యవహారాల్లో పడినప్పుడు వంశీ చాలా తీవ్రంగా మందలించాడు. విజయ్ కూడా అంత తీవ్రంగానే తననితాను సమర్థించుకున్నాడు. పెళ్ళికి ముందు కాస్త అల్లరి చిల్లరగా తిరగడం అందరూ చేయకపోయినా కొందరు చేస్తారు. అలా చేసిన వారిలో కొందరు పెళ్ళయింతర్వాత పాత తిరుగుళ్ళకి ఫుల్‌స్టాప్ పెడతారు. కానీ విజయ్ ఇప్పుడు గూడా అలా తిరుగుతున్నాడంటే అది సహించరాని విషయంగానూ, క్షమించరాని నేరంగానూ తోచింది.

విజయ్‌కి ఓసారి గట్టిగా లెఫ్ట్ అండ్ రైట్ యివ్వాలనే ఆ జంక్షన్‌లోని ఓ కిళ్ళీ బడ్డీ దగ్గర నిలబడ్డాడు వంశీ. అది మూడు రోడ్ల జంక్షన్. విజయ్ ఆ మూడు రోడ్డుల్లో ఏవైపునించి వచ్చినా, ఆ కిళ్ళీ బడ్డీని దాటుకుంటూనే తన యింటికి వెళ్ళాలి. ఓ గంట తర్వాత విజయ్ స్కూటర్ మీద వస్తుంటే వంశీ ఆపుచేసి మాట్లాడాడు. విజయ్ దగ్గర్నించి బ్రాందీ వాసన వస్తోంది.

తన ఎపాయింట్‌మెంట్ ఆర్డర్‌ని చూపించాక "నేనివాళ వుద్యోగం సంపాదించుకోగలిగేనంటే అందుకు నూటికి నూరొంతులూ కారణం నువ్వేరా, నువ్వు సెక్యూర్టీ డిపాజిట్

కట్టకపోతే" అంటూ వంశీ కళ్లంట నీళ్ళ పెట్టుకున్నాడు.

విజయ్ పకపకమని నవ్వేసి వంశీ భుజం తట్టి "ఏ చోటీసీ బాత్ యార్! ఒకప్పుడు నువ్వూ నేనూ ఫుడ్డుకి లాటరీలు కొట్టినవాళ్ళమే! బట్ ఇప్పుడు నా పొజీషన్ బాగుంది కాబట్టి అలా ఇచ్చాను. అదే నువ్వుకాకుండా మరొకరు అడిగితే కడతానా? మనిద్దరం, టూ ఇన్ ఒన్ కాబట్టి కట్టాను. దట్సాల్" అన్నాడు.

"సరేగానీ నువ్వు చేస్తున్నదేం బాగులేదురా! గతంలో ఏదో తగలడ్డామంటే అది క్షమార్హంకాకపోయినా కొంతవరకు సహించొచ్చు! కానీ యిప్పుడు పెళ్లైంది కదా! మళ్ళీ ఎక్కడో మితాయి కొట్టుదగ్గర ఆగేవు. పైగా, నాదగ్గరకెళ్ళేనని అబద్ధం చెప్పావట. ఇదేం మంచిపనికాదు. ఆ విషయం చెప్పడానికే యిక్కడ వెయిట్ చేస్తున్నాను" అన్నాడు వంశీ సిన్సియర్‌గా.

"రేయ్ వంశీ, చెప్పిన మాటల్నే ఎన్ని సార్లు చెప్తావురా? జీవితాన్ని నువ్వోకోణం నించి చూస్తున్నావు. నేనో కోణంనించి చూస్తున్నాను. ఇద్దరి ఆబ్జెక్టూ ఒక్కటే! కానీ చేసే విధానంలోనే తేడా వుంది. నీకూ ముఖం వుంది. నాకూ ముఖం వుంది. కానీ మన ముఖాలు రెండూ ఒక్కలా వున్నాయా! జీవితాలూ అంతేరా" అంటూ మళ్ళీ తన పాత పాటనే పాడాడు విజయ్.

"అది కాదురా, భార్యాభర్తలంటే పాలూ నీళ్ళలా కలిసిపోవాలి. మనం స్వచ్ఛంగా నిజాయితీగా వుంటేనే మన మనసు మంచి నీళ్ళలా స్వచ్ఛంగా వుంటుంది. అబద్ధాలు ఆరంభించగానే, ఆ నీరు కాస్తా నిమ్మరసంలా మారిపోతుంది. పాలల్లో నిమ్మరసం కలిస్తే, పాలు విరిగిపోతాయిరా" విజయ్‌కి నచ్చజెప్తున్నట్టుగా అన్నాడు.

"ఇప్పుణ్ణేను నా మనసులో ఏనిమ్మరసం పిండేశానట? " వెటకారంగా అడిగాడు విజయ్.

"నా యింటికెళ్తానని చెప్పి నువ్వు మీ ఆవిడదగ్గర అబద్ధం చెప్పావు. కానీ నువ్వు ఎవరో అమ్మాయితో తిరిగొచ్చావు. పైగా డ్రింకు కూడా తాగున్నావు. ఇది తప్పు కాదురా"

"రేయ్, నువ్వో పిచ్చి పకోడిగాళ్ళా మాట్లాడకు. నేను మీ ఇంటికని చెప్పి ఎక్కడో తిరిగాను. కానీ నువ్వీలోగా మా ఇంటికెళ్ళి నేను నీదగ్గరకి రాలేదని చెప్పేశావ్. ఓకే! దానికి నేనేదో స్టోరీ వినిపించి మా ఆవిణ్ణి కన్విన్స్ చేస్తాన్లే. ఇంక నా దగ్గర్నించొచ్చే మందు వాసన సంగతంటావా? మరో గంట అక్కడా యిక్కడా తిరిగి, ఆ తర్వాత ఇంటికెళ్తాను. అప్పటికీ వాసనొస్తే, నీకు వుద్యోగం వచ్చిన శుభసందర్భంగా నువ్వే నాకు పార్టీ యిచ్చేవంటాను. అది కూడా నేను వద్దంటున్నా వినకుండా బలవంతంగా తాగించేవంటాను" అంటూ పగలబడి నవ్వేడు విజయ్!

వంశీ అతని మాటలు వింటూ కొద్దిగా వణికాడు. "అదేంట్రా విజయ్, నేను నీకు పార్టీ ఇచ్చేనని చెప్తావా, అదీ మందుపార్టీ! నాకసలు మందే అలవాటు లేదుకదా! ఒక వేళ నిన్ను నువ్వు సేవ్ చేస్కోడంకోసం నా పేరుని అడ్డంవేస్తే నీ భార్య నేను కూడా తాగుబోతుననుకోదూ? రేపట్నించీ నేను మీ యింటికి రాగలనా? వద్దురా, దయచేసి అలాంటి అబద్ధం ఆడకు, అఫ్‌కోర్స్ నువ్వు అబద్ధం ఆడినా మీ మిస్సెస్ నమ్మదనుకో! నా గురించి మన ఫ్రెండ్సంతా వెటకారంగానైనా, పెళ్ళి పార్టీలో మీ మిస్సెస్‌కి చెప్పారుగా" భయంతోనే కొంత ఆత్మవిశ్వాసాన్ని మిళితం చేస్తూ అన్నాడు.

"ఆవు మాంసం తినదు, పులి గడ్డి తినదు, అలాగే వంశీకృష్ణ మందు కొట్టడు. ఇవన్నీ అందరికీ తెల్సు. మా మామగారికీ, అత్తగారికీ, మా ఆవిడక్కూడా ఇప్పుడిప్పుడే తెలుస్తోంది. అలాగని, ఆ అభిప్రాయంమీద నేనిప్పుడు పనిగట్టుకెళ్ళి బురదజల్లను" అన్నాడు

విజయ్.

"అలాంటప్పుడు నేను పార్టీ ఇచ్చేనని ఎందుకు చెప్పడం?"

"నువ్వు పార్టీ ఇచ్చేవని చెప్పానుగానీ, నువ్వు తాగేవని చెప్పనుగా! నీకిప్పుడు వుద్యోగం వచ్చింది కాబట్టి పరమానందంగా వున్నావు. ఈ శుభసందర్భంలో నువ్వో నలుగురు ఫ్రెండ్స్‌కి పార్టీ యిచ్చావు. అందులో నేనూ వున్నాను. అంటే లేట్‌గా పార్టీలో జాయినయ్యేనన్నమాట. కానీ అప్పటికే వాళ్ళు నిన్ను పార్టీ యిమ్మని ఒత్తిడి చేస్తున్నారు. అంచేత నేను నిన్ను పార్టీ ఇచ్చేయ్‌రా అన్నాను. నువ్వు ఇచ్చేశావు. వాళ్ళంతా నేను కూడా ఓ రౌండ్ తాగక తప్పదని ఒత్తిడి చేశారు. నేను తాక్కపోతే వాళ్లూ తాగనన్నారు. పైగా వంశీకి వుద్యోగం రావడానికి మీరే కదా కారణం, అంచేత మీరు తాక్క తప్పదూ అన్నారు. తాగేను. దట్సాల్. నేనిప్పుడు చెప్పిన వాక్యాల్లో ఎక్కడైనా వంశీ కూడా తాగాడు. అనే మాట దొర్లిందా? లేదే!

"మా ఇంట్లో ప్రస్తుతం మా అత్తగారూ, మామగారు వున్నారు కాబట్టి ఈ మాత్రం కవరింగ్ డైలాగులు వదుల్తున్నాను. అదే మా ఆవిడనైతే మరో విధంగా మేనేజ్ చేసెయ్యగలను. అద్సరేగానీ, యివాళ్టినించి నువ్వో ఆఫీసువాడివయ్యేవు. ఈవారంలో నువ్వో బండివాడివి కావాలి. అంటే ఐమీన్ నువ్వో మోపెడ్ బండినైనా కొనుక్కోవాలి. మరో రెండు నెలల్లో నువ్వో యింటివాడివి కావాలి. అంటే అర్థం నిన్నో ఇల్లు కొనమని కాదు, నువ్వు పెళ్ళిచేస్కోవాలి. నువ్వు బద్ధకస్తుడివి కాబట్టి ఆ బాధ్యత కూడా నా భుజాలమీదేవేస్కుంటాలే! వస్తాన్రా" అంటూ విజయ్ స్కూటర్ స్టార్ట్ చేస్కుని వెళ్ళిపోయాడు.

వంశీ చాలా ఇంగ్లీషు సినిమాలు చూసి, వాళ్ళు మాట్లాడుకునే మాటల తాలూకు సెంట్రల్ అయిడియా కాకుండా డైలాగ్ టూ డైలాగ్ అర్థంచేసుకోగలిగాడు. కొన్ని మళయాళీ సినిమాలు, తమిళ సినిమాలు, చూసి అర్థంచేస్కోగలిగాడు కానీ విజయ్‌తో చిరకాల స్నేహం వున్నా ప్రతి రోజూ మాట్లాడుతున్నా, అతన్ని మాత్రం పూర్తిగా అర్థంచేస్కోలేకపోతున్నాననే అనుకున్నాడు. వాడు తనకో గాడ్‌ఫాదర్లా సహాయం చేస్తున్నందుకు చేతులెత్తి దండంపెట్టాలా? లేక తన పేరు చెప్పి కొన్ని అబద్ధాలు ఆడి జీవితాన్ని నెట్టుకొచ్చేస్తున్నందుకు కొట్టాలా? అని ఆలోచించుకుంటూనే ఇంటివైపు బయలుదేరాడు.



వంశీ డ్యూటీలో జాయినయ్యాడు.

అది చిన్న కంపెనీయే అయినా ఆ కంపెనీకి మంచి రెప్యుటేషన్ వుంది. గవర్నమెంటు జీతాలతో పోల్చకపోతే మాత్రం ఆ కంపెనీ ఇచ్చే జీతాలు బాగున్నాయనే చెప్పొచ్చు. అతనికిచ్చింది అసిస్టెంట్ మేనేజర్ పోస్టు. బాధ్యతగా పనిచెయ్యాలి. వంశీలాంటి క్రమశిక్షణ కలిగిన వ్యక్తికి ఆ పోస్టుని నిర్వహించడం మంచినీళ్లప్రాయమే. నెలా పదిహేనురోజులు గడిచేసరికి అతను సమర్థుడైన వ్యక్తిగా గుర్తించబడ్డాడు.

నాటకరంగంలో అతనికుండే ప్రవేశం,

నటుడిగా అతనికుండే ప్రావీణ్యం విషయం అందరికీ తెలిసిపోవడంవల్ల కాస్తో కూస్తో నటనానుభవం వుండి అవకాశాల్లేక నిరాశపడుతున్న ఆ ఆఫీసు కళాకారులకి ఓ ఆశాజ్యోతి అయ్యాడు. వెలుగుతున్న దీపమే వెలగని దీపాల్ని వెలిగించగలదు కాబట్టి అతని రాకతో ఆ కంపెనీలో ఓ కల్చరల్ విభాగం పుట్టుకొచ్చింది.

ఆ కంపెనీ ఎం.డి. ఆనంద్‌గారు కళాకారుడు కాకపోయినా కళాప్రియుడే. "మిస్టర్ వంశీ! మీ గురించి అంతా విన్నాను. నేనో ఆఫీసర్నని చెప్పుకోడానికి, నేనో కళాకారుణ్ణని చెప్పుకోడానికీ చాలా తేడా వుందని నాకు తెలుసు. అందులోనూ మీరు చాలా నాటక పరిషత్తుల్లో చాలా బహుమతులు పొందారని తెలిశాక అయామ్ వెరీ వెరీ హేపీ! మన హైదరాబాద్‌లో నాటకం వుంది. సినిమా వుంది, టీ.వీ. వుంది. ఈ మీడియమ్స్‌ని మీరు వీలున్నంతవరకు వినియోగించుకుంటూ మీతోపాటు మన కంపెనీలోని కళాకారుల్ని కూడా కలుపుకుపోండి. మన ఆఫీస్‌వర్క్‌కి మీరు భంగం కలిగించరని నాకు తెలుసనుకోండి. కానీ ఈ కల్చరల్ ఏక్టివిటీ పేరుతో మన ఆర్టిస్టులు ఆఫీస్ వర్క్‌ని ఎగ్గొట్టేవిధంగా తయారుకాకుండా ఆఫీస్ ఆఫీసే, కళాసేవ కళాసేవే అనే విధంగా మీరు కార్యక్రమాలు నిర్వహించండి. మీకు నా ఎంకరేజ్‌మెంటు, బ్లెస్సింగ్సు ఎప్పుడూ వుంటాయి" అంటూ షేక్‌హేండిచ్చి భుజం తట్టి ప్రోత్సహించాడు. దాంతో ఆ కంపెనీలో నాటకాల ఏక్టివిటీ మొదలయింది.

దానికి నాయకత్వం వహించింది వంశీకృష్ణ.

★ ★ ★

విజయ్‌కుమార్ తనకి తెలిసిన కొంతమంది ద్వారా వంశీ కోసం సంబంధాలు వెదికాడు. విశాఖపట్నంలో రిటైర్డ్ పోలీస్ ఇన్‌స్పెక్టర్ రామారావుగారి సంబంధం విజయ్‌కి, అతని భార్య రజనీకి నచ్చింది. రామారావుగారు తాతారావుకి తెలిసినవారేనట. చిన్నప్పుడెప్పుడో రామారావుగారూ తాతారావు విశాఖట్నంలోని హైస్కూల్లో ఫస్ట్‌ఫారమ్ చదివేరట. అంచేత వంశీకృష్ణ పెళ్ళికి విజయ్‌తోపాటు తాతారావు కూడా నడుం కట్టాడు. పెళ్ళిచూపులకి విశాఖపట్నం వెళ్ళారు. అమ్మాయి పేరు కళ్యాణి. బి.కాం. పాసయింది. తల్లిదండ్రులకి ఒక్కతే కూతురు. అందానికి కొలమానం మిస్ ఇండియా, మిస్ యూనివర్స్ బిరుదులు పొందడం ఒక్కటే కాదనుకుంటే మాత్రం కళ్యాణి అందగత్తెల జాబితాలోకే వస్తుంది. అబ్బాయికి అమ్మాయి, అమ్మాయికి అబ్బాయి నచ్చారూ అనుకున్నాక- "మరి మిగతా విషయాలు కూడా మాట్లాడేసుకుంటే ఓ పని అయిపోయినట్టుంటుంది కదా!" అన్నాడు తాతారావు చిప్స్ నములుతూ.

"మిగతా విషయాలూ అంటే... ముహూర్తాలు పెట్టుకోవడమేగదా! అది వాళ్ళిష్టమే" అన్నాడు వంశీ మెల్లగా.

"అది కాదయ్యా, కట్నాలూ కానుకలూ అవీ ఇవీ"

"నాకు కట్నం అక్కర్లేదు"

వంశీ చెప్పిన మాట ఆడపిల్లవార్ని అనుమానంలో పడేసింది.

వంశీ ఎలాంటివాడూ అని విజయ్‌ని అడిగితే "స్వాతిముత్యం" అన్చెప్పేడు.

తాతారావుని అడిగితే "జాతిరత్నమే" అంటూ సర్టిఫై చేశాడు.

ఆతర్వాతే పెళ్ళిచూపులకి అంగీకరించారు. కళ్యాణి తండ్రి రామారావు ఇటీవల రిటైరైపోయి ఖాకీ యూనిఫామ్ విప్పేసినా అతని మనసులో వున్న పోలీస్ ఇన్‌స్పెక్టర్ మాత్రం ఇంకా రిటైర్ కాలేదు. అందుకే ఏ విషయాన్ని ఆలోచించినా ముందు అనుమానించడంతోనే ఆరంభిస్తాడు. పెళ్ళిచూపులకి ముందే వంశీ పేరు తన నోటీసులోకి

రాగానే అక్కడున్న తన స్నేహితుల్ని ఆరా తీశాడు.

"వంశీ చాలా మంచి యాక్టరండి. అతను వేసిన నాటకాలు రెండు మూడు చూశానుగా! అతను మరీ అల్పసంతోషిలా వున్నాడు. ఏక్టింగ్‌లో ఓ అంటే నా రాని వాళ్లు కూడా సినిమాల్లోను, టీవీల్లోను ఏక్ట్ చేసేస్తున్నారు. కానీ ఇతను బోలెడన్ని ప్రైజులు కొట్టికూడా నాటకాలనే పట్టుకువేళ్లాడుతున్నాడు. టీవీల్లో వేషాలు వేసినా బోలెడంత సొమ్ము చేసుకునుండేవాడు" అంటూ ఒక పెద్దాయన వంశీ గురించి కితాబిచ్చారు.

మరొకాయన్ని ఎంక్వయిరీ చేస్తే, "అతనేనన్నమాటేవిటి? ఈ ప్రపంచంలోని ప్రతీ మనిషీ ఓ నటుడే. కాకపోతే వంశీ లాంటివాళ్లు ముఖాలకి రంగులు వేసుకుని అడపాదడపా స్టేజిమీద నటిస్తారు. మనబోటివాళ్లం ఏ రంగులూ హంగులూ లేకుండా నటిస్తాం. అయినా మనమ్మాయినిచ్చుకునే ముందు ఆ కుర్రాడి తాలూకూ బేక్‌గ్రౌండ్ ఏవిటీ, ఫ్రంట్ గ్రౌండ్ ఏవిటీ అని ఆలోచించాలి. అంటే ఉద్యోగం, సద్యోగం వుందా? ఫేమిలీ ఎలాంటిదీ అని ఆలోచించి నిర్ణయించుకోవాలి. కట్నాల విషయంలో మనకే మాత్రం అందుబాటులో వున్నా మనం వూ కొట్టెయ్యడమే మంచిది. పెళ్ళి అయ్యేవరకు కుర్రాడెలాగున్నాడు? అని ఆలోచించగలం తప్ప పెళ్ళి తర్వాత ఎలా వుంటాడన్న విషయం ఆ దేవుడు కూడా చెప్పలేడేమో! వంశీ మీద నాకు తెలిసి ఇంత వరకు ఏ బేడ్ రిపోర్టూ లేదు కాబట్టి మంచివాడనే అనుకోవాలి. నాకు అర్థమైన మేరకి ఈ కాలపు ఆడపిల్లలు అత్తామామా, ఆడపడుచులూ లేని సంబంధాలనే ఇష్టపడుతున్నారు. వంశీ విషయంలో ఈ ప్లస్‌పాయింటుంది" అంటూ సలహా ఇచ్చాడు.

కాస్త దగ్గర దగ్గరగా వున్న సదభిప్రాయాలు విన్న తర్వాత, రామారావు ఆ అభిప్రాయాల్ని గుణించి, భాగించి ఓ సరాసరి అభిప్రాయాన్ని తయారుచేశాడు. అలా తయారుచేసిన అభిప్రాయంలో వంశీ సంపాదించే జీతం, అతనికి వెనకాముందు ఎవరూలేరనే రెండు పాయింట్లే వున్నాయి. అతని వ్యక్తిత్వం మంచిదనే విషయాన్ని విజయ్‌కుమార్, తాతారావు చాలా ఖచ్చితంగా చెప్పారు. బయట వాళ్లెవరూ బేడ్ రిపోర్ట్ ఇవ్వలేదు. అంతే ఆలోచించాడు తప్ప అతని నటజీవితం గురించి అతను ఆలోచించలేదు. వంశీ నాటకాల్లో నటించాడనే విషయం కూడా కూతురికి చెప్పలేదు. తండ్రి భావాలతో పెరిగిన కళ్యాణికి, తండ్రి మాటే శిరోధార్యం కాబట్టి "మీ ఇష్టమే నా యిష్టం" అన్చెప్పింది. ఆ తర్వాతే వంశీని పెళ్లిచూపులకి పిలిచారు.

కానీ అతను 'కట్నం వద్దు' అనేసరికి చిన్న బ్రేక్ పడింది.

ఇవాళ్టిరోజుల్లో చదువూ-సంధ్యా, ఉద్యోగమూ-సద్యోగమూ లేనివాళ్లు కూడా లక్షల కట్నాలు డిమాండ్ చేస్తున్నారనే విషయం సుభద్రకి తెలుసు. రామారావుకీ తెలుసు. మరి వంశీ అందగాడూ జీతగాడూ అయుండి కూడా కట్నాలు అడక్కపోవడం వాళ్లకి ఆశ్చర్యంకంటే అనుమానాన్నే కలిగించింది.

వంశీ కట్నం అడక్కపోవడంతోపాటు తన వివాహాన్ని వీలున్నంత సింపుల్‌గా ఏ గుళ్ళోనో జరిపించెయ్యమంటున్నాడు. "కొంపదీసి ఇతనికి నలుగురికీ చెప్పుకోలేని లోపాలేమైనా వున్నాయా? అలాంటి లోపాలుండబట్టే ఈ కుర్రాడు ఇన్నాళ్లూ సత్తురూపాయలా చెలామణీ కాకుండా వుండిపోయడా? " ఈ రెండు సందేహాలతోనే పెళ్లి సంభాషణ ముందుకు సాగకుండా ఆగిపోయింది. పెళ్లికి పెద్దరికం వహించిన విజయ్‌కుమార్, రజనిలు కూడా ఏమీ బదులు చెప్పలేని స్థితిలోనే వుండిపోయారు.

కానీ తాతారావు ఊరుకోలేదు. "రేయ్

రామారావ్! నువ్వు చూస్తే మొన్నటిదాకా పోలీస్ ఇన్‌స్పెక్టర్‌గా ఉద్యోగం వెలగబెట్టిన వాడివి. కట్నంగా ఇంత డబ్బు కావాలీ అని అడిగితే ఏ పేకులాట వస్తుందోనని వంశీయే కాదు, ఏ కుర్రాడైనా సంశయిస్తాడుకదా! అంచేత నువ్వే ఏదో ఫిగర్ అనుకుని దానికి మరేదైనా పేరు చెప్పి ఇచ్చెయ్" అన్నాడు కానీ వంశీ అతని మాటల్ని సీరియస్‌గా ఖండిస్తూ "నేనేదో భయంవల్ల కట్నం వద్ద నటం లేదండి. కట్నాలు తీసుకుంటున్న వాళ్ళు ఎందుకు తీసుకుంటున్నారో నాకు తెలీదు. ఇచ్చేవాళ్లు ఎందుకిస్తున్నారో తెలీదు. ఈ పరిస్థితి మారితే బావుణ్ణనుకుం టున్నాను. నా అభిప్రాయాన్ని ఎవరు గౌర వించినా, గౌరవించకపోయినా, కనీసం నేన యినా పాటించాలికదా! నాకేవో లొసుగులు, లోపాలున్నాయని మీరనుకుంటే అది పొర పాటే అవుతుంది. పెళ్ళి కూడా సింపుల్‌గా జరిగితే బావుంటుందని ఎందుకంటున్నా నంటే మీకు ఎక్కువ ఖర్చు అవకూడదనే అలా అన్నాను. పెళ్లి ఎంత గొప్పగా చేసు కున్నామనికాక కాపురం ఎంత చక్కగా చేస్తామన్నదే ముఖ్యం! నా అభిప్రాయాలు మీకు బాధ కలిగిస్తే క్షమించండి" అన్నాడు.

అతని మాటల్లో నిఖార్సయిన వినయం ధ్వనిస్తున్నా, చెప్పుకోవలసింది మాత్రం నిర్మొహమాటంగానే చెప్పాడు.

అయినాసరే వాళ్ళ ముఖాల్లో బల్బు వెల గకపోవడం గమనించాడు విజయ్.

"చూడండి సార్! ఈ కాలం కుర్రాళ్ళు తెలి విమీరిపోయారని, డబ్బు వెంట రకరకాల పరుగులు తీస్తున్నారని, అందుకోసం మంచి తనాన్ని, మానవత్వాన్ని కూడా వదిలేసుకుం టున్నారని మీ తరం పెద్దవాళ్ళు బాధపడ్డం నేను గమనించాను. అంతేకాదు, తమ కొడుక్కి కట్నం బాగా రావాలని తమ కూతురికి మాత్రం కట్నాలు అడగని అల్లుడు దొరకాలని కూడా కొంతమంది అనుకుంటారని విన్నాను. మీలాంటి పెద్ద వాళ్లు ఎలాంటి కుర్రాళ్లనైతే ఎక్స్‌పెక్ట్ చేస్తు న్నారో, అలాంటి కుర్రాడే మా వంశీకృష్ణ. ఓ అభ్యుదయ భావాలుగల వ్యక్తి మీకు అల్లుడ వుతున్నప్పుడు మీరెందుకు సంశయిస్తు న్నారో నాకు అర్థం కావడంలేదు. పూర్వకా లంలో మంచివాళ్ళెక్కువమంది చెడ్డవాళ్లు తక్కువమంది వుండేవారట. అప్పట్లో చెడ్డ వాళ్లని చూసి మంచివాళ్లు భయపడేవాళ్లట. కానీ ఇప్పుడో మంచివాణ్ణి చూసి మీరెం దుకు భయపడుతున్నారు?"

తను ఇలా మాట్లాడగలనని విజయ్ అనుకోలేదు. తన గురించి విజయ్ ఇంత బాగా మాట్లాడతాడని వంశీ కూడా ఊహిం చలేదు. విజయ్ ఎప్పుడూ తన నమ్మకాల్ని, సిద్ధాంతాల్ని విమర్శించేవాడు, వ్యతిరేకించే వాడు... అలాంటివాడు తనని సమర్థిస్తూ మాట్లాడినందుకు మనస్సులోనే తన ధన్య వాదాలు తెలియజేశాడు వంశీ.

విజయ్, తాతారావుల మాటల్ని రామా రావు, ఆయన భార్య సుభద్ర చక్కగానే అర్థం చేసుకున్నారు. పెళ్ళికి అంగీకరిం చారు. ముహూర్తాలు పెట్టించి కబురు చేస్తామని చెప్పారు.

విజయ్ భార్యాసమేతంగా కిన్నెర లాడ్జిలో దిగాడు. ఆ లాడ్జిలో రూమ్ దొరక్క వంశీ, తాతారావు ఆ పక్కనున్న మరో లాడ్జిలో దిగి అక్కడికే భోజనాలు తెప్పించుకుని తిన్నారు.

మధ్యాహ్నం లంచ్ అయ్యాక విజయ్ ఒక్కడూ వంశీ రూమ్‌కొచ్చాడు. ఆ సమ యంలో తాతారావు లంక పొగాకు కోసం బయటకెళ్ళాడు. విశాఖపట్నంనించి హైదరా బాద్ వెళ్ళడానికింకా చాలా టైముంది కాబట్టి స్నేహితులిద్దరూ సరదాగా భేటీకి దిగారు. అయితే వారు ఆరంభించిన సంభా షణ నాలుగైదు నిమిషాలకే నులివెచ్చగా మారిపోయింది.

"నా గురించి చాలా బాగా చెప్పావురా విజయ్" అన్నాడు వంశీ మంచంమీద

కూర్చుని.

"నీ గురించి నేను చెప్పింది నిజమేకదరా"

"నిజమే అనుకో! కానీ ఆ టైమ్‌లో అలా చెప్పడం..."

"చెప్పబట్టే నీకో సంబంధం కుదిరింది. లేకపోతే నువ్వు చెప్పిన పప్పుసుద్ద కబుర్లకి, ఈ సంబంధమే కాదు, ఏ సంబంధమూ కుదరదు"

వంశీ అహం దెబ్బతిన్నట్టుగా బాధపడి "నేనేం దద్దోజనం కబుర్లు చెప్పలేదు" అన్నాడు.

"ఎందుకలా సీరియస్ ఫీలింగ్‌లిచ్చేస్తావ్? నీకు దద్దోజనం కబుర్లు ఇవాళేం కొత్త కాదుగా! ఆనాడు రాధ విషయంలో కూడా ఇలాంటి కబుర్లు చెప్పబట్టే మీ లవ్‌ఎఫైర్ దెబ్బతినేసింది"

మంచంమీద కూర్చున్న వంశీ కాస్త ఎమోషన్ చెందుతూ లేచి నిలబడ్డాడు. "రేయ్ విజయ్, నీకారోజూ చెప్పాను. ఈరోజూ చెప్తున్నాను. రాధ నన్ను ఇష్టపడింది. ఆ ఇష్టానికి తనకితానే ప్రేమా అని పేరు పెట్టుకుంది. కానీ నేనావిణ్ణి ప్రేమించలేదు. కాబట్టి మా పరిచయానికి స్నేహం అనే పేరు పెట్టాను"

"సర్లేవాయ్! నీకు కాబోయే మాంగారు, అత్తగారూ నిన్ను మరీ డౌట్‌చేసి మాట్లాడుతుంటే నాకు పౌరుషం వచ్చింది. నిన్ను ఎలా సపోర్ట్ చేసి వాళ్ళని ఒప్పించడమా అని ఆలోచించేసరికి మీ రాధా వంశీల ప్రణయగాథ ఠకీమని గుర్తొచ్చింది. నిన్ను ప్రేమించేవాళ్లు కూడా వున్నారంటే అది నీలో వుండే టాలెంట్‌కి నిదర్శనం కదా"

"కానీ నేనావిణ్ణి యాక్సెప్ట్ చెయ్యలేదుగా"

"కాబట్టే నువ్వో బుద్ధుడివీ, ప్రవరాఖ్యుడివీ అని సర్టిఫై చేశాన్రా. అఫ్‌కోర్స్ నీ సిద్ధాంతాల గురించి డైరెక్ట్‌గా చెప్తే నిన్నూ నన్నూ కలిపి దద్దోజనం కింద జమకట్టేస్తారని..."

"అదిగో మళ్లీ..."

"నువ్వెంత హీటెక్కిపోయినా నేనేం అనుకోన్రా. ఎందుకంటే ఈ సంబంధం కుదిరిపోయింది కాబట్టి. బట్ ఆరోజు నువ్వు రాధతో చెప్పిన మాటలు మాత్రం కేవలం దద్దోజనం కబుర్లే"

ఇంతలో ఫోన్ మోగింది. విజయ్ మాట్లాడ్డం ఆపి ఫోన్ అందుకున్నాడు. అవతల్నించి అతని భార్య రజని మాట్లాడుతూ, "ఎలాగూ ట్రైన్‌కింకా టైముందిగా. ఎమ్‌వీపి కాలనీలో వున్న మా పెదనాన్నగారింటికెళ్ళి చూసొద్దాం. మీరు వెంటనే రండి" అంది.

విజయ్ ఫోన్ పెట్టేసి "రేయ్ వంశీ మేం ఓ గంటలో వచ్చేస్తాం. ఈలోగా నువ్వూ తాతారావు రెడీగా వుండండి" అంటూ మరేమీ మాటలు పొడిగించకుండా వెళ్ళిపోయాడు.

రజనీ ఫోన్ చెయ్యకుండా వుండుంటే ఆ మిత్రుల సంభాషణ ఎంతవరకు వెళ్లి ఎక్కడ ఆగేదోగానీ మొత్తంమీద విజయ్ గతకాలంలోకి అడుగు పెట్టినట్టే పెట్టి వెనక్కి తగ్గిపోయాడు. విజయ్ ఆ రూమ్‌నించి వెళ్ళిపోయినా అతను ప్రస్తావించిన రాధ మాత్రం వంశీ మనసులో నిద్రపోతున్న జ్ఞాపకాన్ని తట్టిలేపింది.

రాధ చాలా మంచి రంగస్థల నటీమణి! రాధకి ఆ పేరుకంటే రవిచంద్రిక అనే పేరు పెడితే చాలా కరక్టుగా సూటవుతుందని ఓ సుప్రసిద్ధ నాటకరచయిత ఓ నాటకగోష్ఠిలో అర్థవంతంగానే చెప్పాడు. "ఈ సృష్టికి సూర్యుడు, చంద్రుడు ఆ దేవుడు వెలిగించిన దీపాలు. అయితే ఆకాశంలో సూర్యుడున్నప్పుడు చంద్రుడుండడు. చంద్రుడున్నప్పుడు సూర్యుడుండడు. అలాగే మన రంగస్థల నటీమణుల్లో కూడా టాలెంట్ వున్నవాళ్ళకి కొట్టొచ్చినట్టుగా కనిపించే అందం వుండదు. అందం వున్న నటీమణులకి నటనాకౌశలం వుండదు. ఆ రెండు అర్హతలూ వుండడం అసాధ్యమని నేను అననుగాని, చాలా అరుదు అని మాత్రం చెప్పగలను. అదిగో అలాంటి అరుదైన కలయిక మన రాధా

దేవి" అంటూ ప్రశంసించాడు.

అప్పటికి రాధ ఎక్కువగా నటించింది ప్రగతి కళామందిరం నాటక సమాజం వారి తోనే. అంటే వంశీకృష్ణ, విజయ్‌కుమార్‌ల తోనే. చాలా పరిషత్తుల్లో రాధా వంశీ పోటీ పడి మరీ నటించేవారు. వంశీ ఉత్తమన టుడి బహుమతి అందుకుంటే రాధ తప్పని సరిగా ఉత్తమనటి అవార్డు అందుకుతీరా ల్సిందే. విజయ్ ఎప్పుడూ హాస్యనటుడి పాత్రలు ధరించి చాలా సార్లు ప్రైజులందు కున్నాడు.

అప్పట్లో కొంతమంది రాధని వశపరుచు కోవాలని ప్రయత్నించారుకానీ అలాంటివా రందరికీ రాధ అందని చందమామ అయింది. కొంతమంది ఆమెకు డబ్బు ఎర చూపి తమ సెకెండ్ వైఫ్‌గానో, గర్ల్‌ఫ్రెండ్ గానో ఉండమన్నారు. కానీ ఆవిడ తన వ్యక్తిత్వాన్ని వ్యక్తం చేస్తూ, "నేను కిరాయి నటినేగానీ కిరాయి మనిషిని కాను" అని చెప్పింది.

"రాధ అంటే గంజాయి వనంలో పుట్టిన తులసి మొక్క" అంటూ ఆవిడ వ్యక్తిత్వాన్ని స్టడీ చేసిన వాళ్లు కాంప్లిమెంట్ ఇచ్చారు.

నాటకాలమ్మాయిలంటే ఆనాటినుంచీ ఈనాటివరకూ సమాజం దృష్టిలో చాలా చిన్నచూపే ఉంది. తెరమీద కనిపించే సినిమా కళాకారులకుండే గ్లామరు, ఫాలో యింగ్, ఆదాయం వేదిక మీద నటించే నాటక కళాకారులకుండదు. నాటకాలు వేసే అమ్మాయికి నైతిక విలువలు ఉండవని కొందరు అపోహ పడతారు. మరికొందర యితే రెండురెళ్లు నాలుగే అన్నంత నిజ మని నమ్ముతారు. వంశీకృష్ణ అలాంటివా ళ్లతో చాలాసార్లు గొడవ పడ్డాడు.

"ఈ లోకంలో చెడిపోయినవాళ్లంతా నాటకాలాడే చెడిపోయారా? నాటకాలాడేవా ళ్లంతా చెడిపోయే బతుకుతున్నారా? ఓ మనిషి చెడిపోడానికీ, బాగుపడ్డానికీ, నాటకా లకీ ఎందుకు లింక్ పెడతారండీ?" అంటూ ప్రశ్నించేవాడు. కొంతమందిమీద విసుక్కో వటం, మరికొంతమంది వీపు చిట్లగొట్టడం కూడా చేశాడు.

ఇవన్నీ రాధకి తెలుసు. రిహార్సల్సు చేసే టైమ్‌లోనూ, బయట ఊళ్లలోని పరిషత్తుల కెళ్లేటప్పుడూ ఇద్దరూ చనువుగానే వుండే వాళ్లు. ఆ పరిచయాన్ని రాధ ప్రేమగా మార్చుకుంది. ఆ ప్రేమని పెళ్ళిగా మార్చు కోవాలని తహతహలాడింది.

అయితే ఈ వూహలు, ఆలోచనలన్నీ ఆమెవైపునించే సాగాయి తప్ప వంశీ ఏనాడూ ఆ దృష్టితో ఆవిణ్ణి చూడలేదు. రాధని ఉత్తమనటిగా నాటకరంగంలోనూ, మంచి స్నేహితురాల్లా జీవితరంగంలోనూ చూశాడు తప్ప పెళ్లికి దారితీసే 'ప్రేమ' అనే దృష్టితో ఆమెనెప్పుడూ చూడలేదు.

హైదరాబాద్‌లో నాటకాల యాక్టివిటీ కంటే సినిమా నిర్మాణం, ప్రస్తుతం సిని మాని కూడా అధిగమిస్తూ, ఉధృతంగా టీ.వీ. సీరియల్స్ నిర్మాణం సాగుతోంది. చాలామంది ఆర్టిస్టులు ఎక్కువగా అటువైపే మొగ్గుచూపిస్తున్నారు. నాటకాలు వేసే ఔత్సాహిక నటుల్లో ఎక్కువమంది మిడిల్ క్లాస్‌వాళ్ళే! దాదాపుగా అందరూ ఉద్యోగ స్థులే. తమకున్న కళాతృష్ణ తీర్చుకోడానికి నాటకాల్లో నటిస్తున్నారేతప్ప అందువల్ల వాళ్ళకి కలిసొచ్చే ఆదాయమంటూ ఏమీ వుండదు. వృత్తి కళాకారిణులకి, అంటే రాధ లాంటి నటీమణులకి కొంత కిరాయి ఇస్తుం టారు. కానీ టీవీ సీరియల్స్‌లో వేషం వేస్తే ఎంతో కొంత పారితోషికం ఇస్తారు. అంచేత అలాంటి అవకాశం వచ్చినప్పుడు సాధారణంగా ఏ ఆర్టిస్టూ వదులుకోడు. టీవీ మీడియా హైదరాబాద్‌లో బలపడు తున్న సమయంలో రాధ తిరుగులేని నటిగా పేరు పొందింది కాబట్టి చాలా బిజీ టీవీ ఆర్టిస్టు అయిపోతుందనుకున్నారు. ఆవిడ అందగత్తె కాబట్టి డెఫినెట్‌గా టీవీ 'ఏంకర్'గా సెలక్టయిపోతుందనుకున్నారు.

ఆవిడ గొంతు కూడా మధురంగా వుంటుంది. ఎలాంటి మాడ్యులేషన్ అయినా పలుకుతుంది. కాబట్టి నెంబర్ ఒన్ డబ్బింగ్ ఆర్టిస్టయినా అయిపోతుందనుకున్నారు. కానీ అందరి వూహలకే భిన్నంగా, రాధ టీవీ రంగంవైపే కన్నెత్తి చూడలేదు. నాటకరంగంలో వచ్చే ఆదాయం తక్కువే అయినా ఆ రంగాన్ని వదల్లేదు. అందులో కూడా వంశీతో కలిసి నటించడానికే ఫస్ట్ ప్రిఫరెన్స్ ఇచ్చేది. చాలా మంది రాధకి సలహా ఇచ్చినట్లే వంశీ కూడా ఆవిడకి సలహా ఇచ్చాడు.

"అవకాశాలు నిన్ను వెదుక్కుంటూ వస్తున్నప్పుడు వాటిని వదులుకోవడం తెలివి తక్కువతనమవుతుంది. నాటకకళే నా జీవితం అంటూ కళాజగతిలో బతికిన వాళ్లెంతోమంది వృద్ధాప్యంలో బీదరికంతో అలమటించడం మనకి తెలియనిది కాదు. కాలం గడిచేకొద్దీ నీ నటనా కౌశలం పరిణతి చెందొచ్చు కానీ అప్పటికి నీకా భగవంతుడిచ్చిన అందం, యవ్వనం పొద్దుగూకే దశలోకొస్తాయి. అప్పుడు ఆరిపోయిన అగ్గిపుల్లని చూసి నిట్టూర్చినట్టు నువ్వూ నిట్టూర్చాల్సుంటుంది" అన్నాడు.

అతని సలహా విన్న రాధ వెంటనే జవాబు చెప్పలేదు. మర్నాడు రాధ అతనికో ఉత్తరాన్ని అందించింది. ఆ ఉత్తరంలో రాధ తన పెళ్లి అతన్తో జరగాలనే అభిలాషని స్పష్టంగా వ్యక్తంచేసింది.

ఆ ఉత్తరం చదివిన వంశీ సంతోషపడలేదు. బాధపడ్డాడు. తన ఆత్మీయుడైన విజయ్‌కి విషయమంతా వివరించాడు. రాధకి వంశీమీద చాలా ప్రగాఢమైన ప్రేమ వుందన్న విషయాన్ని విజయ్ గమనించి చాలా రోజులయింది కాబట్టి. ఈ విషయంలో జవాబు చెప్పడానికి రెండు క్షణాలు కూడా టైమ్ తీస్కోలేదు.

"పెర్సనాల్టీల రీత్యా చూసినా, ప్రొఫెషన్ రీత్యా చూసినా మీరిద్దరూ 'మేడ్ ఫర్ ఈచ్ అదర్'లా వుంటారు. ఆవిడకీ చెప్పుకోతగిన ఫేమిలీ బేగ్రౌండ్ అంటూ ఏమీలేదు. నువ్వు కూడా డిటోయే. మనం ప్రేమించడానికి చాలామంది దొరకొచ్చు కానీ మనల్ని ప్రేమించేవాళ్లు ఒక్కరు దొరికినా మనం అదృష్టవంతులమే! అలాంటిది ఎందరో రాధ కోసం ప్రయత్నిస్తుంటే ఆవిడ నిన్ను ప్రేమిస్తోంది సో... వన్‌వే, యూఆర్‌ఏ లక్కీ ఫెలో! రాధ ఒక్క స్టెప్పు టీవీ రంగంలోకి వేస్తే ఆవిడ జీవితంలో కనకవర్షం కురుస్తుంది. నువ్వు కూడా టీవీల్లోకి వెళ్తే ఓ దుమ్ము దులుపుతావని నాకు తెలుసు. మీరిద్దరూ కలిసి సంపాదిస్తే మీ లైఫ్ నవ్వుల నదిలో పువ్వుల పడవలా సాగిపోతుంది. నా మాట విని రాధని పెళ్లి చేస్కో" అంటూ చాలా సిన్సియర్‌గా సలహా ఇచ్చాడు.

వంశీ చాలాసేపు ఈ పెళ్లివల్ల కలిగే పరిణామాల్ని అన్నివైపుల్నించీ ఆలోచించి చెప్పాడు. "వద్దు విజయ్, నా భవిష్యత్తు గురించి నాకెటువంటి భయమూ లేదు. అవసరాన్ని మించి అధికంగా సంపాదించాలన్న కోరిక నాకెప్పుడూ లేదు. వున్నదాంతో సర్దుకుపోయే మనస్తత్వం నాకుందని నీకు బాగా తెలుసు.

నా భార్యవల్ల కూడా నాకు ఆదాయం రావాలనే ఆశ అస్సల్లేదు. నన్నూ, నా ఇంటినీ, నా పిల్లల్ని చక్కగా చూస్కునే ఆడది నా భార్య అయితే చాలనుకుంటున్నాను. ఆఫీసునించి నేను రాగానే చిరాకులు, పరాకులు లేకుండా చిరునవ్వుతో రిసీవ్ చేస్కునే ఇల్లాలిగా, వున్నదాంతో సర్దుకుపోతూ, లేనిదాని కోసం ఆశపడకుండా, మాకంటే గొప్పవాళ్ళతో పోల్చుకోకుండా ఆడంబరాలమీద మోజుపడకుండా నా పిల్లలకి కనీసం ఫిఫ్త్‌స్టాండర్డ్ వరకైనా ట్యూషన్ చెప్పుకునే టీచర్‌గా వుండగలిగే స్త్రీ అయితే చాలు"

"నువ్వు చెప్పినవన్నీ చాలా సింపుల్ కోరి

కలేగా! అవేవో రాధకే చెప్తే ఆవిడ తప్పకుండా నెరవేరుస్తుంది"

"నెరవేరుస్తుంది కానీ రాధ చాలా టాలెంటు, చాలా భవిష్యత్తున్న ఆర్టిస్టు. అలాంటి వ్యక్తిని నా సంసారచట్రంలో ఇమిడ్చేసి ఆవిడ్లోని కళాకారిణిని చంపెయ్యడం నాకిష్టంలేదు. మనం ఓ ఆర్టిస్టుని ఓ ఉన్నతస్థాయికి తీసుకురావాలంటే చాలా చాలా కష్టపడాలి. కానీ ఓ ఉన్నతస్థాయిలో వున్న ఆర్టిస్టుకి సంసారబంధాలనే సంకెళ్లు బిగించి సామాన్య స్త్రీగా మార్చెయ్యడం చాలా సులభం. కానీ అది నా దృష్టిలో నేరమే కాదు, పాపం కూడా అవుతుంది. వీటన్నింటికీ మించి నేను రాధని ప్రేమించడం లేదు. అలాగని ద్వేషించడమూలేదు. అసలు నాకా అమ్మాయిమీద అలాంటి భావమే లేదు. ఆవిడమీద ఓ మంచి ఆర్టిస్టు, మంచి మనిషి అనే గౌరవం తప్ప పెళ్లికి దారితీసే ప్రేమంటూ ఏమీలేదు"

వంశీ ఈ అభిప్రాయాన్ని విజయ్‌కి చెప్పినట్టే రాధ క్కూడా వివరించాడు. "ఇదంతా నీ మేలు కోసమే" అని కూడా అన్నాడు.

ఆ మాటలు విని రాధ తన ఇంటికెళ్ళి ఏడ్చిందేమోగానీ, ఆ లొకేషన్లో మాత్రం ఏడవలేదు. వంశీమీద కోప్పడలేదు. శుష్కమందహాసం చేసి అక్కడనించి వెళ్ళిపోయింది. తర్వాత ఓ ఆరునెల్లపాటు రెండు ప్రముఖ టీ.వీ. ఛానల్స్‌లో యాంకర్‌గా పనిచేసి, ఆ మీడియాలకి సంబంధించిన వ్యక్తినెవరినో పెళ్లిచేసుకుని టీ.వీ. సీరియల్ ప్రొడ్యూసర్‌గా మారింది. అందులో ప్రధానపాత్ర వేస్తూ ఓ డైలీ సీరియల్ ఆరంభించింది. అది ఈమధ్యనే స్టార్టయి తక్కువ టైమ్‌లోనే మంచి వూపు అందుకుంది.

"వంశీ... వంశీ..." అంటూ తాతారావు వంశీని భుజంతట్టి కుదిపేసరికి స్మృతిపథంలోని ఆలోచనలు ఆగిపోయి చెదిరిపోయాయి. "ట్రైన్‌కి టైమయింది పదా" అన్నాడు తాతారావు హడావిడి పడుతూ. వంశీ గతంనించి తేరుకుని హైదరాబాదు వెళ్ళడానికి సిద్ధమయ్యాడు.

★ ★ ★

వంశీ, కళ్యాణీల వివాహం జరిగిపోయింది. పెళ్లి ముహూర్తం నిశ్చయమయిన వెంటనే వంశీ శ్రీనగర్‌కాలనీలో ఓ ఇల్లు తీసుకున్నాడు. అది కాస్త చిన్న ఇల్లే అయినా ముచ్చటగా కనిపించే ఇల్లు. అద్దె కూడా మరీ ఎక్కువేం కాదు.

ఆరోజు రాత్రి శోభనం అనగా ఆ మధ్యాహ్నం వంశీని విజయ్ ఓచోట కూర్చోబెట్టి యల్‌కేజీ స్టూడెంట్‌ని పరీక్షకి పంపిస్తున్న తల్లిలాగా బాధ్యతగా కొన్ని సూచనలిచ్చాడు. "వినాయకుడికి పూజ చేసేటప్పుడు వినాయకస్తోత్రమే చదవాలి. అలాగే ఆంజనేయుడికి దండం పెట్టేటప్పుడు ఆంజనేయదండకమే చదవాలి. నువ్వు వెధవ తెలివితేటలుపయోగించి అక్కడ స్తోత్రం ఇక్కడ, ఇక్కడి స్తోత్రం అక్కడ చదివేవనుకో వినాయకుడికి వీరావేశం వచ్చి తొండంతో కొడతాడు. ఆంజనేయుడికి ఆగ్రహం వచ్చి తోకతో కొడతాడు"

"నేను వెళ్లబోయేది శోభనం గదిలోకి రా! అక్కడ దండకాలు, స్తోత్రాలు ఎందుకు చదువుతాననుకున్నావు? " అన్నాడు వంశీ అమాయకంగా.

"నువ్వు స్తోత్రాలు, దండకాలు పాడతావని నేను చెప్పడంలేదు. ఇది మీకు ఫస్ట్ నైట్! అది మళ్లీ తిరిగిరాదు. అంచేత హాయిగా ఎంజాయ్ చెయ్యవలసిన తొలి రాత్రి నీ సిద్ధాంతాల గురించి, నమ్మకాల గురించి లెక్చర్లిచ్చేవనుకో. జాతర సమయంలో జాతీయగీతం పాడినట్టుగా వుంటుంది"

"నువ్వు సెటైర్లు కొట్టక్కర్లేదురా! ఏం మాట్లాడాలో పదిరోజుల్నించి రిహార్సల్సు చేసుకుంటూనే వున్నాను. నాకు నువ్వేం చెప్పక్కర్లేదు" అంటూ వంశీ ఎంతో నమ్మకంగా చెప్పాడు.

మిడిల్‌క్లాసి వాళ్ళ శోభనంగది ఎలా వుండాలో, అలాగే ఆ గదిని తయారుచేశారు. కళ్యాణి ఆ గదిలోకి పాలగ్లాసు పట్టుకొచ్చింది. గ్లాసుని టీపాయ్‌మీద పెట్టి వంశీ ముందు కిందకి ఒంగింది.

ఆమె పాదాభివందనం చేస్తుందనుకుని వంశీ కంగారుపడి కాస్త వెనక్కి జరిగి "వద్దు కళ్యాణీ, నాకిలాంటి నమస్కారాలు ఇష్టం వుండదు" అన్నాడు.

కళ్యాణి నేలమీద పడిపోయిన తన కర్చీఫ్‌ని తీసుకుని నిలబడింది. నిజానికామె అతని కాళ్ళకి నమస్కరించాలనుకోలేదు. ఆవిడ దృష్టిలో భార్యాభర్తలిద్దరూ సమానమే. ఒకరికొకరు నమస్కారాలు చేస్కునేపద్ధతికి ఆవిడా విరుద్ధమే. "నా రుమాలు కింద పడిపోయింది. దాన్ని తీస్కోడానికి ఒంగేను" అంది మామూలు స్వరంతోనూ.

"వెరీగుడ్, భార్య కంపల్సరీగా భర్త కాళ్లకి నమస్కరించాలనే ఆచారానికి నేను కాస్త విరుద్ధం" అంటూ ఆమెను మంచంమీద కూర్చోబెట్టి, అతను పక్కకి జరిగి కూర్చున్నాడు. తను చెప్పదలచుకున్న విషయాన్ని గుర్తుకు తెచ్చుకుని, "చూడు కళ్యాణీ! ఇది మన తొలిరాత్రి అంటే మన రెండు జీవితాలూ కలిసి ప్రయాణం చెయ్యడానికిది స్టార్టింగ్‌డే" అంటూ ఆమెను చూశాడు. ఆమె శూన్యంలోకి చూస్తోంది. "నేను చెప్తున్నది వింటున్నావా? " అన్నాడు.

"వింటున్నానండి" అంది కళ్యాణి చూపు తిప్పకుండా.

"వింటే వూ కొట్టవేం? నేను చెప్పబోయేది చాలా చాలా ముఖ్యమైన విషయం"

"చెప్పండి"

"భార్యాభర్తల మధ్య స్వచ్ఛమైన అనుబంధం, పటిష్టమైన అవగాహన ఏర్పడాలంటే ఇద్దరిమధ్యా దాపరికాలు, అరమరికలు వుండకూడదు"

"నిజమే"

"అంచేత నా గురించి నేనే ముందుగా చెప్పేస్తాను. ఆ తర్వాత నువ్వు చెబుదువుగాని"

"అవన్నీ ఇప్పుడే చెప్పాలా? " ఆవిడ కాస్త ఇబ్బందిగానే అడిగింది.

"చెప్పాలి చెప్పాలి. ఎందుకంటే ఆటో ఎక్కేముందే వాడు మీటర్‌మీద వస్తాడా లేక మీటర్‌మీద ఎక్కువ తీసుకుంటాడాని అడిగెయ్యాలి. లేకపోతే తర్వాత వాడికీ మనకీ గొడవలొస్తాయి. దట్‌మీన్స్ కాస్సేపు ప్రయాణం చేసి దిగిపోయే ఆటో విషయంలోనే అంత ముందుజాగ్రత్త తీసుకున్నప్పుడు ఇది మనం జీవితాంతం కలిసి చేసే ప్రయాణం కదా! అందుచేత మనం ఇప్పుడే ఒకరి గురించి ఒకరు తెలుసుకోవాలి"

"సరే... చెప్పండి" గత్యంతరం లేనట్టుగా అంది.

"కొంతమంది మనుషులు... వాళ్లు ఆడవాళ్లుగానీ, మగవాళ్లుగానీ... ఒకర్ని ప్రేమించి మరొకర్ని పెళ్లాడతారు. కానీ అలాంటి దురదృష్టం నాకు కలగలేదు. ఎందుకంటే నేనింతవరకు ఎవర్నీ ప్రేమించలేదు. నేను నాటకాలు వేసేరోజుల్లో..."

కళ్యాణి ఉలిక్కిపడి "మీరు నాటకాలు ఆడేవారా? " అని అడిగింది.

"ఔను... తాతారావుగారు నీకు చెప్పలేదా? బహుశా మర్చిపోయుంటాడు. నేనూ, మా విజయ్ కలిసే నాటకాలు వేసేవాళ్ళం. చాలా పరిషత్తుల్లో నేను బెస్ట్ యాక్టర్ ప్రైజులు పొందాను కూడాను. ఓసారి ఏం జరిగిందంటే..." అంటూ లేచి నిలబడి ఇంకా ఏదో చెప్పబోతూ కళ్యాణిని చూశాడు.

ఆమె సీరియస్‌గా కనిపించింది. ఆమె గదిలోకి వస్తున్నప్పుడు, వచ్చేక కూడా ముభావంగానే వుంది. అదంతా సిగ్గుగానే భావించాడు. కానీ ఇప్పుడావిడ ముఖంలో కనిపించే భావం 'సిగ్గు' కాదు.

"అదేంటీ అలా అయిపోయావు? "

"ఏంలేదు"

"ఏమీ లేకుండా ఎందుకలా డల్ అయిపో యావు? నీకు నాటకాలంటే ఇష్టంలేదా? "

"నాటకాలాడేవాళ్ళంటే ఇష్టం వుండదు"

"ఏం? "

"మా చిన్నాన్న కూడా ఇలాగే నాటకాలూ నాటకాలూ అంటూ రాత్రీ పగలూ తిరిగి తన వాటాకొచ్చిన ఆస్తంతా ఆర్పేసుకున్నాడు. తాగుడికీ, వ్యసనాలకీ బానిసైపోయాడు. కళాపోషణ పేరిట ఓ నాటకాలమ్మాయిని చేరదీసి మా పిన్నిని చిత్రహింసలు పెట్టాడు. పిల్లల ఆలనాపాలనా చూడకుండా రోడ్డున పడేశాడు. మా పిన్నిని వదిలేశాడు."

కళ్యాణి మాటల్లో బాధకంటే తన చిన్నాన్న మీదున్న కోపమే ఎక్కువగా కనిపించింది.

"సారీ కళ్యాణీ, నేను మీ చిన్నాన్నమీద జాలిపడుతున్నాను"

"ఆయనందుకు అర్హుడు కాదు!"



"**చూ**డు కళ్యాణీ! మీ చిన్నాన్న అలా అయిపోడానికీ నాటకాలు వెయ్యడానికీ ఏం సంబంధం లేదు. ఆయన జీవితం అలా అవడానికి కారణం ఆయనకున్న వ్యసనాలు, వ్యక్తిగతమైన బలహీనతలు. నేను స్టేజ్ మీద నాటకాలాడేను తప్ప జీవితంలో ఏనాడూ నాటకాలు ఆడలేదు. అనవసరంగా అబద్ధాలాడలేదు. అందుకే రాధతో కూడా ఈ మాటే చెప్పేశాను"

రాధ అనే పేరు వినగానే కళ్యాణి దిగ్గుమని తలెత్తింది. "రాధెవరు? " సీరియస్ గానే అడిగింది.

వంశీ ఒక్క మాట కూడా దాచకుండా రాధ గురించి నిజమే చెప్పేడు.

కళ్యాణి మనసు ఆవేశంతో బుసలుకొట్టింది. ఆమెకు తల్లి స్వభావంకంటే తండ్రి స్వభావమే అలవడింది. పోలీస్‌మెంటాలిటీ చాలావరకు ఆమెలో చోటు చేసుకుంది. వంశీ తన గురించి తాను నిజాయితీగా చెప్పడాన్ని అతనికున్న భోళాతనంగా భావించలేదు. రేపెప్పుడైనా ఎవరిద్వారానైనా రాధ విషయం తెలిసిపోతుందనే భయంతో ముందుచూపు ఉపయోగించి అసలు విషయానికి నిజాయితీ అనే పూతపూసి మొదటి రోజే ఈవిధంగా తెలియజేశాడని భావించింది. తెలివైన నేరస్థులు కొంతమంది ఈ విధంగా చేస్తుంటారని ఆవిడ తండ్రి అప్పుడప్పుడు చెప్పిన విషయాలు ఆవిడకిప్పటికీ గుర్తే! అందుకే అతను చెప్పిందాంట్లో మొదటి భాగాన్నే నమ్మింది. రెండో భాగాన్ని నమ్మలేదు. అంటే రాధ ఇతన్ని ప్రేమించింది. బహుశా ఇతనూ ప్రేమించే వుంటాడు. కానీ తను స్వచ్ఛమైన మనిషినని చెప్పడం కోసం ఆ విషయాన్ని ఇలా మార్చిచెప్పేడు. మగాళ్ళు, ముఖ్యంగా కళారంగంలో వుండేవాళ్లు ఆడవాళ్లని లొంగదీస్కోడానికే శతవిధాలా ప్రయత్నిస్తారుగానీ కోరి వచ్చిన ఆడదాన్ని అందులోనూ అందమైన ఆడదాన్ని ఎందుకు తిరస్కరిస్తారు? తిరస్కరించరు. ఇది ఆవిడకున్న నమ్మకం! ఆ నమ్మకం నిజమేనని చెప్పడానికున్న ఓ ఉదాహరణ ఆవిడ చిన్నాన్నే! అతనూ నాటకాల రాయుడే. ఓ నాటకాలమ్మాయిని చేరదీశాడు. వంశీ కూడా నాటకాలు ఆడుతున్న

# సచిత్ర విచిత్రం



## మీసాల సొగసులు

ఇంగ్లాండులోని లైసెస్టర్ అనే ఊళ్లో 'హ్యాండిల్ బార్ క్లబ్' సభ్యులు వీళ్లు. సైకిల్ హ్యాండిల్‌బార్ ఆకారంలో వుండే మీసాలను పెంచే వాళ్లకే ఆ క్లబ్‌లో సభ్యత్వం లభిస్తుంది. ప్రపంచం మొత్తంమీద ఆ క్లబ్‌లో 9867 మంది సభ్యులున్నారు. ఇటీవల వాళ్లలో జరిగిన పోటీలో టెడ్ సెడ్‌మేన్ మొదటిస్థానం పొందాడు. ఇతని మీసాల పొడవు ఆ చివరి నుంచి ఈ చివరికి 5 అడుగుల 3 అంగుళాలు.

వాడే! ఇతని జీవితం కూడా ఓ నాటకాల మ్మాయితో ముడిపడింది. ఇతను ఆవిణ్ణి పర్మినెంటుగా చేరదియ్యకుండా వాడుకుని వదిలేశాడు. ఆ నిజానికి ఇతను అబద్ధం అనే అందమైన పూతపూసి తెలివిగా ఇలా చెప్పేడు. ఎంతైనా నాటకాలోడి వుత్తమ నటుడి బహుమతిని పొందినవాడుగదా! కళ్యాణి ఈవిధంగా ఆలోచించాక "నాటకాలు, జులాయ్ తిరుగుళ్లు ఈ చరిత్రంతా మా చిన్నాన్నతోనే పరిసమాప్తమయిందనుకున్నాను. కానీ మళ్లీ అదే చరిత్ర నా జీవితంలో పునరావృతం కాబోతోందా? " అనే సంశయంలో పడింది. తన సందేహాన్ని, భయాన్ని, అనుమానాన్ని మాటల్లో తెలియజేసింది.

వంశీ ఖంగుతిన్నాడు, కంగారుపడ్డాడు. "నువ్వు నన్ను అపార్థం చేసుకున్నావు కళ్యాణీ" అన్నాడు ఆత్రంగా.

"లేదు, మీ మాటల్తో మీకు మీరే నాకు అర్థమయేలా తెలియజేసుకున్నారు" అంటూ కళ్యాణి తలగడతీసి నేలమీద వేసుకుని, దుప్పటి కూడా పరుచుకోకుండా పడుకుంది. వంశీ కాస్సేపు బతిమాలేడు. కానీ అతను ఎన్ని మాటలు చెప్పినా ఆమె మౌనాన్నే సమాధానంగా చెప్పి నిద్రలోకి జారుకుంది. వంశీ నిస్సహాయంగా నిట్టూర్చేడు.

మర్నాడు విజయ్‌తో వంశీ నిన్న రాత్రి జరిగిందంతా చెప్పి బాధపడ్డాడు.

కానీ వంశీ గురించి విజయ్ జాలి పడలేదు, బాధపడలేదు సరిగదా కోపంతో కుతకుతలాడిపోయాడు. "మూర్ఖులనేవాళ్లు చదువూ సంధ్యాలేని అలగాజనంలోనే వుంటారనుకున్నాను. కానీ చదువుకున్న వాళ్లలో కూడా వుంటారని నువ్వు నిరూపించావు" అన్నాడు ఆవేశంగా.

"ఇందులో నా మూర్ఖత్వమేం వుంది? "

"ఫస్ట్‌నైట్‌నాడు రాధ గురించి ప్రస్తావించడం మూర్ఖత్వం కాకుండా మరేమవుతుంది? "

"ఇది మరీ బాగుందిరా! ఆవిడ అడిగినప్పుడు చెప్పకపోతే ఎలా? "

"ఆవిడెప్పుడడిగింది? ఒకానొక అందమైన రాధ నేనంటే ఎగబడిపోయేదే, కానీ నేనో ప్రవరాఖ్యుణ్ణి కాబట్టి ఛీ అవతలకి పొమ్మన్నానూ అని నువ్వు డప్పువాయించుకుంటుంటే అప్పుడేగదా అడిగింది ఆ వివరాలు.

"నిజం చెప్పడం అంటే డప్పువాయించుకోవడమా? "

"కాక మరేంటి? అయినా శోభనం రాత్రి మీరిద్దరూ మాట్లాడుకోడానికి బోలెడన్ని టాపిక్కుండగా నువ్వు రాధ గురించే ఎందుకు మాట్లాడాలి? నువ్వు ఆ ఎపిసోడ్ గురించి ఎత్తకుండా వుంటే అసలీ గొడవంతా ఎందుకొస్తుంది? నువ్వు చెప్పిన విషయంలో సగమే నమ్మింది నీ భార్య. మిగతా సగాన్ని నమ్మకపోగా మీ నాటకాల వాళ్లంతా పోరంబోకులేనంటూ అందర్నీ కలిపి తిట్టేసింది. అలా తిట్లు తిన్నవాళ్లలో నేనూ వున్నట్టేకదా! నువ్వోసెంటిమెంటల్ ఫూల్‌వి. నీకు నిజాయితీ తప్ప లౌక్యం తెలీదు. ఈ రోజుల్లో లౌక్యం ఉపయోగపడినంతగా నిజాయితీ ఉపయోగపడ్డం లేదని నీకు లక్షసార్లు చెప్పాను. అయినా నువ్వు వినలేదు. చివరికి నీ ఫస్ట్‌నైట్‌ని కూడా నువ్వు నీ నిజాయితీతోనే తగలబెట్టుకున్నావు"

"అలా అనకురా! కళ్యాణికి ఇంకా నా మనస్తత్వం పూర్తిగా తెలీదు కాబట్టి తొందరపడి అపార్థం చేసుకుంది. క్రమంగా ఆవిడే అర్థం చేసుకుంటుంది. నా నిజాయితీని కాంప్లిమెంట్ చేస్తుంది. సత్యమేవ జయతే అన్నారు కదా పెద్దలు"

విజయ్‌కి సహనం చచ్చిపోయింది. "రేయ్ బుద్ధి లేకుండా మాట్లాడకు. సత్యం ఎప్పుడో జయిస్తుంది. కానీ అప్పటివరకు మనం బతికుండాలికదా! ఈలోగా నువ్వు చెప్పే సత్యాలతో నీ జీవితాన్ని నువ్వు తగలబెట్టుకుంటున్నావు. దయచేసి రేపట్నిం

మైనా నీ పద్ధతి మార్చుకో. బతకడం నేర్చుకో" అంటూ విజయ్ వెళ్లిపోయేడు.

వంశీ మాత్రం తన పద్ధతిని తానే సమర్థించుకున్నాడు. మచ్చికచేసుకుంటే మృగాలు సైతం మనుషుల మాట వింటున్నాయి. అలాంటప్పుడు మెల్లగా నచ్చజెప్తే కళ్యాణి మాత్రం ఎందుకు అర్థం చేసుకోదు? అని తనకి తానే ధైర్యం చెప్పుకున్నాడు.

★ ★ ★

తర్వాత రెండుమూడు రోజులు వంశీ, కళ్యాణిల మధ్య ఎటువంటి గొడవలూ జరగలేదు. అందుకు కారణం కళ్యాణి అతన్తో ముభావంగా ప్రవర్తించడమే.

ఆరోజు సోమవారం. వంశీ ఆఫీసునించి వచ్చి ముఖం కడుక్కుని కళ్యాణి ఇచ్చిన కాఫీ తాగేసి, టీవీ ఆన్ చేశాడు. నవరాగం డైలీ సీరియల్ని అతను చాలా ఆసక్తిగా చూస్తాడు. కానీ పెళ్లి కార్యక్రమంలో పడడంవల్ల ఆ సీరియల్ శని, ఆదివారాలు వేయకపోవడంవల్ల అతనీమధ్య నాలుగైదు ఎపిసోడ్స్ మిస్ అయాడు. సాయంత్రం ఆరున్నర నించి ఏడువరకు ఆ సీరియల్ వస్తుంది. అది రాధ నిర్మించి, నటించిన సీరియల్.

సీరియల్ ఇంకా ఆరంభం కాలేదు. ఏవో ఎడ్వర్టైజ్మెంట్స్ వస్తున్నాయి. కళ్యాణి శివాలయంకి బయలుదేరుతూ "నేను శివాలయానికెళ్తున్నాను. మీరు వస్తారా? " అంది.

"వస్తాను వస్తాను. ఈ సీరియల్ అయిపోగానే వెళ్దాం" అన్నాడు.

కళ్యాణి అతని పక్కనే కూర్చుంది. విశాఖపట్నంలో వున్నప్పుడు కళ్యాణి కూడా టీవీ సీరియల్సు చూస్తుండేది. ఆవిడకి బాగా నచ్చిన సీరియల్స్లో నవరాగం సీరియల్ కూడా వుంది. అందుకే ఆవిడా ఆసక్తిగా చూసింది. అందులో ప్రధానపాత్ర వేస్తున్న రాధాప్రకాష్ అనే ఆవిడ ముఖం, పేరు కూడా ఆవిడకి గుర్తుంది. కానీ శోభనం రాత్రి వంశీ చెప్పిన రాధ, ఈ సీరియల్లో నటిస్తున్న రాధాప్రకాష్ ఒక్కరేనని ఆవిడకి తెలీదు. ఆరోజు ఎపిసోడ్ ఓ హాస్పిటల్ సీన్తో ఆరంభమయింది. డాక్టరు పాత్రలో రాధ కనిపించగానే ఈవిడే నేను చేప్పిన రాధ అనే మాట అతని నాలిక చివరిదాకా వచ్చి ఆగిపోయింది. చెప్పకుండానే చూస్తున్నాడు. తాతారావు అదే సమయంలో వెకిలినవ్వు నవ్వుకుంటూ వచ్చాడు. పెళ్లైన తర్వాత అతను రావడం అదే ప్రథమం. కళ్యాణి అతన్ని నవ్వుతూనే ఆహ్వానించింది.

"ఏమిటర్రా ఏం చేస్తున్నారూ! అని అడగను ఎందుకంటే మీరిద్దరూ ఎంచక్కా కూర్చుని టీవీ చూస్తున్నారన్న విషయం నేను చూసేనుగా" అంటూ సోఫాలో కూర్చున్నాడు.

"మీరు టీవీ సీరియల్స్ చూడరా బాబాయ్? " కళ్యాణి అడిగింది.

"ఎందుకు చూ౦నమ్మా. మా ఎదురింటి వాళ్ల దగ్గర కలర్ టీవీ వుందిగా అక్కడకెళ్లి చూసేస్తుంటాను? "

"ఏం... మీకు టీవీలేదా? "

"ఎందుకు లేదమ్మా వుంది. కానీ అది బ్లాక్ అండ్ వైటు. పైగా దానికి రెండే రెండు డిఫెక్ట్సు వున్నాయి. బొమ్మ కనిపించదు. శబ్దం వినిపించదు. మిగిలిందంతా బాగానే వుంది"

కళ్యాణి ఫక్కుమని నవ్వి ఓ కలర్ టీవీ పోర్టబుల్ సైజ్దయినా కొనుక్కోలేకపోయారా? " అంది.

"డబ్బిచ్చి ఏ వస్తువూ కొనడం నాకు అచ్చిరాదమ్మా. ఈ విషయం మీ నాన్నకి తెలుసు. ఇప్పుడున్న టీవీ అయినా నేను డబ్బిచ్చి కొన్నదికాదు. ఎవడో తలకి మాసినవాడు దాన్ని తాకట్టుపెట్టి ఏడొందలు అప్పు తీసుకెళ్లాడు. వాడు ఆ డబ్బూ ఇవ్వలేదు, నేనా టీవీ ఇవ్వలేదు"

వంశీకి ఈ సంభాషణంతా చిరాకు కలిగించింది. టీవీలో చాలా ఇంట్రెస్టింగ్గా వుండే సీన్ నడుస్తోంది. రాధ ఏదో సీరి

యస్ డైలాగ్ చెప్తోంది. ఆ మాటలు వినబడకుండా తాతారావు డబడబమని వాగడంవల్ల డిస్టర్బెన్స్ ఫీలై "కాస్సేపు ఆగుతారా" అన్నాడు వీలున్నంత సౌమ్యంగా. తాతారావు నోరు టక్కున మూతబడింది. అతనూ ఇప్పుడు టీవీని నిశితంగా చూసి రాధని గుర్తుపట్టి అడక్కుండా వుండలేకపోయాడు.

"ఆ అమ్మాయి పేరు రాధ కదటోయ్?" అన్నాడు.

"వూ" అని మాత్రం ముక్తసరిగా అన్నాడు వంశీ.

"ఈ రాధా అప్పట్లో నీతో కలిసి నటించిన రాధా ఒక్కరేననుకుంటాను"

వంశీ జవాబు చెప్పలేదు.

తాతారావే మళ్లీ అన్నాడు "అనుకుంటానూ ఏవిటి నా బొంద! ఆ పిల్లా ఈ పిల్లా ఒక్కరే"

కళ్యాణి వంశీవైపు చూసింది. "ఈ రాధా ఆ రాధా ఒక్కరేనని నాకు చెప్పలేదేం?" అంది మెల్లగానే.

"నువ్వు అడగలేదుగా"

"మన మొదటిరాత్రి నేను అడిగితేనే రాధ గురించి నాకు చెప్పారా? భార్యాభర్తల మధ్య దాపరికాలేం వుండకూడదన్నారుగా! మరి ఈ విషయం దాచారేం?"

వంశీ చాలా ఇరకాటంలో పడ్డాడు. తాతారావు సమక్షంలో గొడవ జరగడం అతనికి ష్టంలేదు. తాతారావు నైజం అతనికి బాగా తెలుసు. గోరంత విషయాన్ని కొండంతలు చేసి ఇంటింటికీ వెళ్లి మనిషి మనిషికీ చెప్తాడు. అందుకే "తాతారావుగారు వచ్చారుకదా. ముందు ఆయన విషయం చూస్తే బావుంటుందిగా" అన్నాడు.

తాతారావుకి ఆసక్తి పెరిగింది. "ఏంటమ్మా! మీ భార్యాభర్తలు ఏవైనా గొడవ పడుతున్నారా? అలాంటివేవైనా వుంటే నాకు చెప్పండమ్మా. నాకు తగువులు తీర్చడమంటే ఎంత సరదానో" అన్నాడు.

"అబ్బే అలాంటివేం లేవు బాబాయ్. ఇంతకీ మీరొచ్చింది మమ్మల్ని చూసిపోదామనేకదా! ఏంటి విశేషాలు?" అంది కళ్యాణి నవ్వుతూనే.

వంశీ అక్కడనించి లేచి బెడ్‌రూమ్‌లోకెళ్లిపోయాడు.

"మరేం లేదమ్మా! మా స్నేహితుడి కూతురొకావిడ ఈ వీధిలోనే ఓ ఇంట్లో అద్దెకి దిగింది. ఆ చివరున్న గులాబీరంగు మేడలో వుంటున్న లాయర్ మాలతీ ఆవిడే! ఆవిణ్ణోసారి చూసి పోదామని వచ్చాను. పన్లోపనిగా మీ ఇంటికీ వచ్చాను. ఆవిడ ఒంటరిమనిషి. పేరుకేదో లాయర్‌గా ప్రాక్టీస్ చేస్తోందిగాని నిజానికి ఆవిడకా అవసరం ఏమీలేదనుకో. ఆవిడ భర్త శామ్యూల్ సింగపూర్‌లో ఉద్యోగం చేస్తున్నాడు. నీ విషయం ఆవిడతో కదలేశాను. వంశీ ఆఫీసుకెళ్లిపోయాక నీకెప్పుడైనా బోర్ కొడితే అలా ఆవిడ దగ్గరకెళ్లి కాస్సేపు బాతాఖానీ కొట్టొచ్చుకదాని నీకు చెప్తున్నాను. రేపోసారెళ్లి ఆవిడతో మాట్లాడు" అంటూ ఓ సలహా ఇచ్చేడు. వెళ్లేముందు "అమ్మా నువ్వు నా కూతుర్లాంటిదానివి. నీ దగ్గరకి వుత్త చేతుల్తో రాకూడదు. కానీ వచ్చేశాను. కనీసం వెళ్లేటప్పుడైనా ఏదో ఒకటి ఇక్కణ్ణించి పట్టుకెళ్తే బాగుంటుందికదా! అంచేత ఓ కేజీ బియ్యం ఇచ్చేస్తే నాకు రెండు పూటలకీ సరిపోతుంది" అంటూ సిగ్గూబిడియం లేకుండా అడిగేశాడు. కళ్యాణి విసుక్కోకుండానే ఓ కేజీ బియ్యం ఇచ్చి పంపించింది.

మర్నాడు వంశీ ఆఫీసుకెళ్లిం తర్వాత కళ్యాణి లాయర్ మాలతి ఇంటికి వెళ్లింది. మాలతి వయసు ముప్ఫై రెండేళ్లు. కానీ ఆవిడ అలా కనిపించదు. ఆ ఇంట్లో ఓ పనిమనిషిని పెట్టుకుని ఒంటరి జీవితాన్నే గడుపుతోంది.

కళ్యాణి వెళ్లి తనకి తానే పరిచయం చేసుకుంది.

"నిన్న తాతారావుగారు చెప్పేర్లెండి"

అంటూ నవ్వుతూ జవాబు చెప్పి చాలా మర్యాదిచ్చి మాట్లాడుతూ తన సంస్కారాన్ని ప్రదర్శించింది మాలతి. ఆరోజు మాలతికి కోర్టుకి వెళ్ళే పనిలేదు కాబట్టి కళ్యాణితో తీరిగ్గానే మాట్లాడింది.

"మీవారు సింగపూర్‌లో... మీరు ఇక్కడ.. అదీ ఒంటరిగా వుంటున్నారని విన్నాను. మీ వాళ్లెవరూ లేరా? " అడిగింది కళ్యాణి.

"మావాళ్లంతా ఇక్కడే ఈ వూళ్లోనే వున్నారు. కాకపోతే రాకపోకల్లేవంతే"

"ఏం? ... అభ్యంతరం వుంటే చెప్పొద్దులెండి"

మాలతి నవ్వింది. "ఇందులో రహస్యాలేం లేవండి. చాలామందికి తెలిసిన విషయమే! మా ఆయనగారు ఇంజినీర్! ఆయన క్రిస్టియన్. మేం బ్రాహ్మిన్స్. మా పెద్దవాళ్లు ఆయన మతాన్ని చూసి అభ్యంతరం చెప్పారు. నేనాయన మంచితనం చూసి ఈ పెళ్లికి అంగీకరించాను. ఆయనకి రెండేళ్ల కాంట్రాక్ట్ మీద సింగపూర్‌లో మంచి జాబే వచ్చింది. ఇక్కడ పన్నెండేళ్లు పని చేస్తే ఎంత వస్తుందో అక్కడ రెండేళ్లు పనిచేస్తే అంత డబ్బు వస్తుంది. వెళ్తానన్నారు. అవకాశం వచ్చినప్పుడు దాన్నెందుకు వదులుకోవాలి? అందుకే వెళ్లమని ప్రోత్సహించాను"

"మీరు ఒంటరిగా వుండడానికి భయం వేయడంలేదా? "

"ఎందుకూ భయం? అయినా భయ సందేహాలనేవి జీవితంలో ఓ భాగంగా వుండాలేగానీ అవే జీవితంగా మారిపోకూడదు. మనం అనుకున్నట్టుగా ఓ పని జరగనప్పుడు జరిగిందాంతో రాజీపడ్డానికే అలవాటుపడ్డాను"

"రాజీపడ్డారా? ఏ విషయంలో? "

"సింగపూర్ కంపెనీవాళ్లు బేచ్‌లర్స్‌కి మాత్రమే ఉద్యోగం ఇస్తానన్నారు. అఫ్‌కోర్స్ ఆయన పెళ్లి కాకముందు అప్లై చేసిన ఉద్యోగం మా పెళ్లయేక వచ్చింది. పెళ్లి అయిందని నిజం చెప్పి వచ్చిన అదృష్టాన్ని వదులు కోవడం తెలివి తక్కువే అవుతుంది. అందుకే ఆయన పెళ్లి విషయం చెప్పకుండా ఉద్యోగంలో జాయినయేరు. అలాంటప్పుడు నేనక్కడికి వెళ్లడం భావ్యంకాదుకదా! అందుకే నేనిక్కడున్నాను. కొన్ని పనులు సాధించాలనుకున్నప్పుడు కొన్ని రిస్కులు భరించాలి. కొన్ని అబద్ధాలాడాలి. ఎప్పుడూ ఏ అబద్ధమూ ఆడని వాడు ఈ ప్రపంచంలోనే వుండడు. ఒకవేళ వుంటే గింటే అతనికి నేను చేతులెత్తి నమస్కరిస్తాను"

మాలతికి జీవితంపట్ల వుండే అవగాహన, మనసులో వుండే విశ్వాసం అభినందనీయమే అనిపించింది కళ్యాణికి. పనిమనిషి ఇద్దరికీ కాఫీలిచ్చింది. కాఫీ తాగేక కళ్యాణి తను అడగదలుచుకున్న మాట అడిగేసింది. "మంచి అవకాశాన్ని వదులుకోవడం ఇష్టంలేక మీ వారు సింగపూర్ వెళ్లారు. బాగానే వుంది. అక్కడాయన ఒంటరిగానే వుంటున్నారా? "

"ఔనండి"

"మరక్కడ... ఒంటరిగా వుంటూ అందులోనూ చేతినిండా డబ్బున్న మనిషి, పైగా యవ్వనంలో వున్న మగవాడు... ఒంటరితనం ఆ మనిషి చేత ఏ తప్పు అయినా చేయించొచ్చుగా"

మాలతి కళ్యాణిని రెప్పార్పకుండా కొన్ని క్షణాలపాటు తదేకంగా చూసి చిన్నగా నవ్వింది. "మీ సందేహం నాకు అర్థమైంది. తప్పు చేసే వాడికి ఒంటరితనమే అక్కర్లేదు. పదిమందితో కలిసున్నప్పుడు కూడా వాళ్ల కళ్లు గప్పి మరో స్త్రీతో సంబంధం పెట్టుకోవచ్చు. తప్పు చెయ్యడానికి ఒంటరితనం ఓ అవకాశం మాత్రమే అవుతుంది. తప్పు చెయ్యాలనే కోరిక లేనప్పుడు ఆ ఒంటరితనం ఆ వ్యక్తిచేత తప్పు చేయించలేదు"

"ఏమిటంత నమ్మకంగా చెప్తున్నారు?

ఒకవేళ ఆయన తప్పుచేస్తే? "

మాలతి ఫక్కుమంటూ నవ్వింది. తను అడిగిన విషయం నవ్వు తెప్పించేదికాదే! అలాంటప్పుడు ఆవిడ ఎందుకలా నవ్విందో కళ్యాణికి అర్థం కాలేదు. "ఎందుకు నవ్వుతున్నారు? " అంది.

"ఘరేం లేదండి... మా ఆయన ఏదైనా తప్పు చేస్తే? అని అడిగారు. ఒకవేళ ఆయనకే నా మీద అలాంటి అనుమానం వస్తే? "

మాలతి అడిగిన ప్రశ్నకి కళ్యాణి కాస్త ఖంగుతిని "అంటే అది అది..." అంటూ కాస్త నీళ్లు నమిలింది.

"భార్యమీద భర్తకి, భర్త మీద భార్యకీ కావలసింది నమ్మకం! ఆ నమ్మకమే సంసారానికి పటిష్టమైన పునాది వేస్తుంది. ఆ నమ్మకం వున్నప్పుడు భార్యాభర్తలు దూరంగా వున్నా నైతిక విలువలు పాటిస్తారు. ఆ నమ్మకం లేనప్పుడు ఆ దంపతులు కలిసి కాపురం చేస్తున్నప్పుడు కూడా ఒకరికి తెలీకుండా మరొకరు తప్పులు చెయ్యొచ్చు. మరో విషయం ఆ నమ్మకం లేకపోతే ఏ భర్తనీ ఏ భార్యా వుద్యోగానికి వెళ్లనివ్వదు. ఏ భార్యనీ ఏ భర్తా ఇంట్లో ఒంటరిగా వుండనివ్వడు"

మాలతి చెప్పిన మాటలు కళ్యాణి సందేహాల్ని ఎంతవరకు తీర్చేయో తెలీదుగానీ కళ్యాణికి మాత్రం కాస్సేపు కాలక్షేపం కలిగించాయి.

"ఏమైనా మీరు ధైర్యవంతులే" అంది కళ్యాణి అక్కడనించి బయలుదేరేముందు.

"నేను లాయర్నికదా పైగా అందరూ వుండి కూడా అందరికీ దూరమైన దాన్ని. ఇలాంటప్పుడు నాకున్న ఆత్మబలమే నాకో సెక్యూర్టీగార్డ్‌గా పని చేస్తోంది. తీరికున్నప్పుడు వస్తుండండి. ఈసారి మీవార్ని కూడా తీసుకురండి" అంది మాలతి ఆమెను సాగనంపుతూ.

తొలి పరిచయం ఓ గంటన్నర కాలక్షేపంగా సాగినా మాలతి కళ్యాణికో ఆప్తురాల్లాగే కనిపించింది.

★ ★ ★

మర్నాడు సాయంత్రం వంశీ ఇంటికి ఏడు గంటలుదాటేక వచ్చేడు. కళ్యాణి కావాలనే అతన్ని హర్ట్ చేస్తూ "నిన్న సాయంత్రం మీరు టీవీ చూస్తున్నప్పుడు మిమ్మల్ని రాధ గురించి అడిగేనని మీరు బాధపడ్డారా? అంది"

"లేదు" అన్నాడు కాఫీ తాగుతూ.

"మరైతే ఇవాళ మీరు ఎక్కడో ఆ సీరియల్ చూసి తీరిగ్గా ఇంటికొచ్చేరేం? "

వంశీకి ఆ ప్రశ్న, ఆ ప్రశ్న వెనకనున్న అంతరార్థం కూడా అర్థమయింది. ప్రశ్నలు అడగడంలో ఇదోరకం అనుకుంటూ "దయచేసి ఆ రాధ టాపిక్కు వదిలెయ్" అన్నాడు.

"నేను వదిలేసినా ఆవిడ నన్ను వదలడం లేదే! సాయంత్రం టీవీ ఆన్ చెయ్యగానే ఆవిడే కనిపిస్తోంది"

"పోనీ ఆ సీరియల్ చూడ్డం మానెయ్"

"ఎందుకు మానెయ్యాలి? ఆ సీరియల్ చాలా ఇంట్రెస్టింగ్‌గా నడుస్తోంది. నేనివాళ లెక్క పెట్టేను. ఆ సీరియల్‌కి ఎనమండుగురు స్పాన్సర్స్ వున్నారు. అంటే ఆ ప్రొడ్యూసర్‌కి ఐమీన్ ఆ రాధకి చాలా ఇన్‌కమ్ వస్తుండాలి"

"ఔను. సర్వేలో కూడా ప్రస్తుతం వస్తున్న తెలుగు సీరియల్స్‌లో అదే నెంబర్ ఒన్ పొజీషన్లో వుందని తేలింది"

"మీకెలా తెలుసు? "

"ఎవరో చెప్తుంటే విన్నాను"

"మీరు అడిగితే అతను చెప్పాడా? లేక అతనంతటతనే మీకు చెప్పాడా? ఎందుకంటే నాలాంటివాళ్లు సీరియల్స్‌ని చూసెయ్యడమే తప్ప దేని గ్రేడ్ ఎంతుందో పట్టించుకోరు. కానీ మీరు గ్రేడ్స్ కూడా తెలుసుకుంటున్నారంటే రాధ మీద ఐమీన్ ఆ సీరియల్ మీద మీకు స్పెషల్ ఇంట్రెస్టు వున్న

ట్టేకదా"

వంశీకి ఆ సంభాషణే నచ్చలేదు. ఇది కేవలం అనవసర ప్రసంగం! జవాబులు చెప్పే కొద్దీ ప్రశ్నలు పెరుగుతాయి. ప్రశ్నలు పెరిగితే మానసిక వ్యాకులత పెరుగుతుంది. అందుకే వంశీ సహనం వహించి టాపిక్ మార్చేడు. "నాకు సిటీకే బుల్లో న్యూస్ చదివే ఛాన్సొచ్చింది. నెలకి అయిదునించి పది రోజులవరకు ఛాన్స్ వస్తుంది. రోజుకి వంద రూపాయలిస్తారు"

"న్యూస్ చదవాల్సిన అవసరం మీకేం వచ్చింది?"

"జస్ట్ ఇన్‌కమ్ పెంచుకుందామనే ఈ పార్ట్‌టైమ్ జాబ్ సంపాదించేను. ఇంతవరకు నేనొక్కణ్ణే కాబట్టి నా జీతం నాకు సరిపోయేది. కానీ ఇప్పుడు నాకంటూ ఓ ఫామిలీ ఏర్పడిందికదా! ఇంటికి కావలసిన ఫోన్, ఓ ఫ్రిజ్, ఓ గ్రైండర్, ఓ మిక్సీ, ఓ మంచిబెడ్... ఇలాంటివెన్నో సమకూర్చుకోడానికి కాస్త ఆదాయం కూడా పెరిగితే బావుణ్ణనిపించింది. పైగా ఇలాంటి న్యూస్ రీడర్ జాబ్ అందరికీ రాదు. మాట స్పష్టత, మంచి కంఠం కావాలి. నాకున్న డ్రామా అనుభవం అందుకు పనికొచ్చింది"

ఆ సాయంత్రానికి అంతటితో ఆగిపోయిందా సంభాషణ! అయితే అది కేవలం విరామమే తప్ప విరమణ కాదని ఆ రాత్రి మరోసారి నిరూపణయింది. కళ్యాణి ఇంటి పనులన్నీ ముగించుకొచ్చేసరికి వంశీ మంచంమీద పడుకుని ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ ఆమె రాకని గమనించలేదు.

"ఏంటి ఆలోచిస్తున్నారు?" అంది తనూ అతని పక్కన పడుకుంటూ.

"ఏంలేదు" ముక్తసరిగా అనేసి చిన్నగా నవ్వేడు.

"ఏమీ లేకపోతే మీ మూడ్ ఎందుకలా వుంటుంది? నాకు తెల్సు మీరేదో ఆలోచిస్తున్నారు"

"లేదని చెప్పేనుకదా"

"చెప్తే నమ్మేస్తానా? నేను పోలీస్ ఇన్స్పెక్టర్‌గారి కూతుర్ని. నేను పుట్టుమచ్చల్ని చూసి పుట్టిన వూరేదో చెప్పెయ్యగలనని మా నాన్నగారు నన్ను చాలాసార్లు కాంప్లిమెంట్ చేశారు"

"అయితే ఏంటంటావ్?"

"మీరేం వూహిస్తున్నారో నేనూహించగలను. రెండు కారణాలు చెప్తాను. అందులో ఒకటి డెఫినెట్‌గా కరక్టవుతుంది. నెంబర్ ఒన్ మీరు మా నాన్నగారి దగ్గర కట్నం తీసుకునుంటే బావుణ్ణని ఇప్పుడు ఫీలవుతున్నారు"

"నోనో... ఆ విషయం నేను అప్పుడూ ఆలోచించలేదు. ఇప్పుడూ ఆలోచించడం లేదు. అయినా నీకా డౌట్ ఎందుకొచ్చింది?"

"మరేంలేదు, మీరు ఇంటికి కావలసిన సామాను కొంటానికి పార్ట్‌టైమ్ జాబ్‌గా న్యూస్ చదువుతానంటున్నారుగా! మీరు కట్నం తీసుకునుంటే ఆ డబ్బుతో మీరు అలాంటి వస్తువులు చాలా కొనగలిగేవారు కదాని! చెప్పండి... నేను నిజమే చెప్పేనా?"

"లేదు"

"అయితే రెండోది చెప్తాను. అది డెఫినెట్‌గా కరక్టవుతుంది. మీరు రాధని పెళ్లి చేసుకునుంటే బావుణ్ణని ఇప్పుడు ఫీలవుతున్నారు"

వంశీకి మనసు మీద సూదితో పొడిచినట్టయింది. అయినా అతని మానసిక వ్యథనర్థం చేస్కోకుండా కళ్యాణి తను చెప్పదలుచుకున్నది ప్రతీ అక్షరం అతనికి వినిపించేలా చెప్తూనేవుంది. "మీకిప్పుడు డబ్బు అవసరం ఎక్కువయింది. మీకు స్వతహాగా డబ్బులేదు. మా నాన్నగారి దగ్గర కట్నం తీస్కోలేదు. అప్పట్లో రాధ కేవలం ఓ డ్రామా ఆర్టిస్టు. అలాంటి వారి సంపాదన పిట్టని కొట్టడం, పొయ్యిలో పెట్టడం లాగే వుంటుంది. కానీ ఇప్పుడావిడ టీవీ ప్రొడ్యూసర్‌గా లక్షలకి లక్షలు సంపాదిస్తోంది.

అరరే అలాంటి బంగారుబాతుని తొందరపడి మిస్ చేసుకున్నాననే ఫీలింగ్ ఏమైనా కలిగిందా? సాధారణంగా నూటికి తొంభై మంది అలాగే అనుకుంటార్లెండి"

వంశీ చిన్నగా నిట్టూర్చేడు. తను ఏవిటో తన సిద్ధాంతాలేంటో కళ్యాణికి తెలియజేసే అవకాశం ఇంతవరకు దొరకలేదు. మొదటి రోజే చెప్పడానికి ప్రయత్నించాడుగానీ అనుకోకుండా రాధ టాపిక్ రావడంతో అర్ధాంతరంగా ఆగిపోవల్సొచ్చింది. ఇప్పుడైనా తనేవిటో ఆమెకు తెలియజేయకపోతే ముందు ముందు మరికొన్ని అపార్థాలు తలెత్తే ప్రమాదం వుంది.

"చూడు కళ్యాణీ నాకు కావల్సింది ఏదైనా సరే నా సొంత సంపాదనతోనే కొనుక్కోవాలనుకుంటాను. ఎవరో ఏగో ఇవ్వాలని ఎప్పుడూ ఆశపడను. వారసత్వంగా వచ్చే కోటిరూపాయలకంటే స్వయంకృషితో సంపాదించుకునే ఒక్క రూపాయినే ఎక్కువగా గౌరవిస్తాను. స్వయంకృషితో పైకొచ్చిన వాళ్లంటేనే ఇష్టపడతాను. నాకెటువంటి బ్యాగ్రౌండు లేకపోవడంవల్ల నాక్కావలసిన ప్రతీ చిన్న వస్తువునీ నేనే కష్టపడి సంపాదించుకున్నాను. నా శక్తికి మించిన ఏ వస్తువునీ నేను కోరుకోలేదు. దాన్ని అందుకోలేక భంగపడలేదు. సింపుల్ లివింగ్ హైథింకింగ్ అని గాంధీగారు చెప్పిన సిద్ధాంతం నాకు బాగా నచ్చింది. ఆ సిద్ధాంతాన్ని అమలు చేస్తున్నాను కూడాను. నా కోరికలకి తగ్గట్టుగా నా ఆదాయం లేదనిపించే పార్ట్‌టైమ్ జాబ్‌గా న్యూస్ చదువుతున్నాను. అది కూడా నాకో సంతృప్తిని కలిగించింది కాబట్టి చేస్తున్నాను" అంటూ కళ్యాణివైపు చూశాడు. ఆవిడ ఎప్పుడు నిద్రపోయిందో గమనించలేదుగానీ తను నిజాయితీగా చెప్పిన విషయాలేవీ వినకుండానే ఆమె నిద్రపోయినందుకు నిరాశగా నిట్టూర్చేడు.

★ ★ ★

ఆ రోజు సంజీవయ్యపార్కులో సిమెంట్ బెంచి మీద విజయ్, వంశీ కూర్చుని దాదాపుగా అరగంటనించి మాట్లాడుకుంటూ పల్లీలు తింటున్నారు. అంతసేపూ వాళ్లు మాట్లాడుకుంటున్నారనడంకంటే వంశీ నాన్‌స్టాప్‌గా చెప్తుంటే విజయ్ మధ్యలో అడ్డుతగలకుండా వింటున్నాడని చెప్తే సబబుగా వుంటుంది. వంశీ చెప్తున్నది తన ఆఫీసు గురించి కాదు, నాటకాల గురించి కాదు. కేవలం గత పది రోజులుగా కళ్యాణి



తీస్తున్న పెడర్థాల గురించి, వెల్లడిస్తున్న అనుమానాల గురించే! అంతా సావధా నంగా విన్నాక విజయ్ అభిప్రాయాన్ని అడి గాడు.

"టీవీలో ఆదివారంనాడు ఇదీ సంగతి అనే పేరుతో ఓ ప్రోగ్రామ్ ఇస్తున్నారు. ఈ వూళ్లో ఆ వారంలో జరిగిన కల్చరల్ ప్రోగ్రామ్స్ అన్నీ రివ్యూ చేసినట్టు మీ ఫామిలీ డ్రామాలో జరుగుతున్న ప్రతీ ఇన్సి డెంటుని డైలాగుల్తో సహా వినిపించేవు. ఇన్సిడెంట్లన్నీ బాగానేవున్నాయి. కానీ నీకు మంటెక్కిస్తోంది. దీనికి విరుగుడుగా నేనో ప్లాన్ చెప్తాను చేస్తావా?" అన్నాడు విజయ్.

"ఏంటది?"

"నువ్వా అయిడియాని అమలు చేస్తానని మాటిస్తే చెప్తాను"

"అదేంటో నువ్వు చెప్పకుండా మాటి మ్మంటే ఎలా? ముందా విషయమేంటో చెప్పు"

"ఆడవాళ్ల సైకాలజీని ఎంతో కొంత స్టడీ



అన్నింట్లోనూ నీ ఫెయిల్యూరే స్పష్టంగా కని పిస్తోంది. ఇందువల్ల నాకేం బోధపడిందో చెప్పమంటావా?"

"చెప్పమనేకదా అడుగుతున్నాను"

"మొదటి రోజు నువ్వు సత్యహరిశ్చం ద్రుడి టైపులో డైలాగులు చెప్పి నీ పిలక మీ ఆవిడ చేతికి అందించేశావు. దాంతో మీ ఆవిడ చీటికీ మాటికీ నీ పిలకలాగుతూ

చేసిన వాడిగా అంటే నీకంటే వెయ్యి రెట్లు బెటర్ నాలెడ్జివున్న వ్యక్తిగా నేను చెప్తున్నాను. ఆడవాళ్లని మన దారికి తిప్పుకోడానికి ఆరేడు టెక్నిక్కులున్నాయి. జీవితంలోనైనా, వ్యాపారంలోనైనా పోటీ అంటూ వున్నప్పుడే ఏ మనిషైనా జాగ్రత్త పడతాడు. నిజానికి నీకు ఏ అమ్మాయితోనూ లవ్ ఎఫైర్స్ లేకపోయినా ఏ వ్యసనాలూ లేకపోయినా వున్నాయా వున్నాయా అంటూ మీ ఆవిడ చిర్రుబుర్రులాడుతోంది. అంచేత నువ్వేం చెయ్యాలంటే నువ్వే ఆవిడకి ఎదురెళ్లి ఆవిడకున్న అలవాటుని మానుకునేలా చెయ్యాలి"

"ఎదురెళ్లడం అంటే ఎలా? "

"నిన్ను లవ్ చెయ్యడానికి ఓ నలుగురైదుగురు అమ్మాయిలు అదీ అందమైన అమ్మాయిలు ఎగబడుతున్నారని మీ ఆవిడకో బిల్డప్ ఇవ్వాలి. అవసరమైతే అలాంటి సీన్లు నేను కొన్ని క్రియేట్ చేస్తాను. అప్పుడు లవ్ మార్కెట్లో నీకున్న డిమాండ్ ఏంటో మీ ఆవిడ గమనిస్తుంది. నా మొగుణ్ణి తన్నుకుపోడానికి ఇంతమంది పోటీ పడుతున్నారే అని కంగారుపడుతుంది. లబోదిబోమంటూ ఏడుస్తుంది. ఆ తర్వాత నిన్నా అమ్మాయిల బారినించి రక్షించుకోడానికి, నిన్ను శాశ్వతంగా దక్కించుకోడానికి నిన్ను ఓవర్‌గా లవ్ చేస్తుంది. తన అనుమానాల వల్లే నీ మనసు విరిగిపోయిందని నువ్వు అప్పుడప్పుడు డైలాగులు వదులుతుండాలి. దాంతో ఆవిడ నిన్ను అనుమానించడం మానేస్తుంది. ఎలావుంది నా అయిడియా? " చాలా గొప్ప సలహా ఇచ్చినవాడిలా ప్రశ్నించాడు విజయ్.

"నువ్వు చెప్పినట్టు చేస్తే నా పని పెనం మీదనించి పొయ్యిలో పడినట్టవుతుంది. కొండనాలిక్కి మందేస్తే వున్న నాలిక వూడిపోయినట్టవుతుంది"

"ఎంచేత? "

"అంతమంది అమ్మాయిలు ఎగబడుతున్నప్పుడు మళ్లీ నేనెందుకు దండగా అని ఆవిడ నన్ను అభిమానించడం మానేస్తే? వాళ్లతోనే వూరేగండి అని నా మీద ఎదురు తిరిగితే? ఇంతమంది అమ్మాయిల్తో తిరగడమంతా నిజమని నమ్మి నన్ను ఛీ కొడితే? " అంటూ వంశీ తన భయాన్ని, సంశయాన్ని బయటి పెట్టేశాడు.

"నీ దేహం నిండా సందేహాలే వున్నప్పుడు నిన్నా దేవుడు కూడా బాగు చెయ్యలేడు. నేను చెప్పిన టెక్నిక్కుని నేను మా ఆవిడ మీద ప్రయోగించి సక్సెస్సయేను కాబట్టి నీకూ చెప్పేను. అఫ్‌కోర్స్ నేను ఔట్‌డోర్లో ఎన్ని రంగుల రాట్నాలు తిరిగినా మా ఆవిడ నన్నెప్పుడూ డౌట్ చెయ్యలేదనుకో. అయినా ఈ టెక్నిక్కు ప్లే చేసి ఆవిడ అభిమానాన్ని పొందగలిగేను" విజయ్ చాలా గర్వంగా చెప్పాడు. కానీ వంశీ ఎందుకో విజయ్ సాధించినదాన్ని ఓ విజయంగా భావించలేకపోయాడు.

"నీ జీవితవిధానానికీ నా జీవితవిధానానికీ చాలా తేడా వుంది. అంచేత నువ్వు చెప్పిన టెక్నిక్కు నీకే పనికొస్తుంది తప్ప నాకు పనికిరాదు"

నువ్వు అబద్ధాలతో సంసారాన్ని నెట్టుకొస్తున్నావు కాబట్టి, నీ తప్పులు బయటకి రాకుండా యిలాంటి టెక్నిక్కులు ప్లే చేస్తున్నావు. కానీ నేను అబద్ధాలే ఆడనప్పుడు యీ దిక్కుమాలిన టెక్నిక్కులెందుకు ప్లే చెయ్యాలి? నేను నా పద్ధతిలోనే కళ్యాణిని మారుస్తాను"

"మార్చలేవేమో? "

"అలాటి సందేహాలేం పెట్టుకోవద్దు. చిన్నప్పుడు మన లెక్కల మేష్టారు నీకూ నాకూ ఒకే లెక్క ఇచ్చి చెయ్యమన్నప్పుడు నువ్వు ఓ నిమిషంలో ఆన్సర్ తెచ్చేవాడివి. నేను ఆన్సర్ తేవడానికి రెండు మూడు నిమిషాలు పట్టేది. అలాగే యీ విషయంలో కూడా నేను కొంచెం లేట్ అవుతానేమోగాని ఆన్సర్ మాత్రం తేకుండా వుండను" వంశీ

చాలా నమ్మకంగా చెప్పాడు.

కళ్యాణిని తీసుకుని మర్నాడు తన యింటికి లంచ్‌కి రమ్మని ఆహ్వానించాడు విజయ్.



మర్నాడు మధ్యాహ్నం విజయ్ ఇంట్లో వంశీ, విజయ్ భోజనాలు చేశాక, రజనీ, కళ్యాణి ఓ రూమ్‌లో కూర్చుని లోకాభిరామాయణంలో పడ్డారు. సాధారణంగా ఇద్దరు పెళ్లైన ఆడవాళ్ళు మాటలాడుకున్నప్పుడు ఆ సంభాషణ రెండు విధాలుగా వుంటుంది. ఒకటి "మా ఆయన చాలా మంచివాడు గొప్పవాడంటూ" చెప్పుకునే ఆడవాళ్ళు తమ మాటల్లో కొద్దోగొప్పో అతిశయోక్తులు కలుపుకుంటారు. రెండు "మా ఆయన్తో నేను కాబట్టి వేగుతున్నాను, అదే మరొకరయితేనా" అంటూ భర్త గురించి తక్కువ చేసి మాట్లాడి తనమీద సింపతీ మార్కులు పడేలా చేసుకుంటారు.

రజని మొదటి తరహా మనిషి! అందుకే "ఈరోజుల్లో మా ఆయనలాంటివాళ్లు చాలా అరుదుగా వుంటారండి. ఇది అబద్ధమూ కాదు. అతిశయోక్తీ కాదు. ఆయన సిగరెట్ కాల్చరు. పేకాట ఆడరు, మందు కూడా తాగరు. మా పెళ్లైన తర్వాత ఒకేఒక్కసారి తాగేరు. అదీ రెండు పెగ్గులే! ఆ పార్టీ మరొకరయా మరొకరయా యిస్తే, ఆ రెండు పెగ్గులూ తాగేవారు కారనుకోండి. కానీ ఆ పార్టీ ఇచ్చింది మీ ఆయనగారే అవడంవల్ల కాదనలేకపోయారు. మీ ఆయనగారికి వుద్యోగం వచ్చిన సందర్భంగా పార్టీయిస్తే, అక్కడున్న ఫ్రెండ్సంతా మరీ బలవంతం చేస్తే, అద్దైనా తాగారు. అలా తాగినందుకు ఆ తర్వాతాయన ఎంత ఫీలైపోయారో" అంటూ తన భర్తమీద జాలి, అభిమానం కురిపించేసింది.

కళ్యాణి చాలా ఇంట్రెస్ట్ వ్యక్తం చేస్తూ అడిగింది.

"మా వారు తాగుతారా? "

"ఆయన తాగలేదని మా వారు చెప్పినట్టే గుర్తు. ఆ సంగతి వదిలెయ్యండి. మేం కాస్త డబ్బున్న వాళ్ళమే, మా ఆయన్ది కూడా మంచి పెర్సనాల్టీ. అంచేత కొంతమంది వయ్యారి భామలు ఆయన్ని లైన్‌లోకి లాగడానికి గేలం విసిరేరు. కానీ, మావారు అలాంటి గేలాలకి చిక్కుకునే మనిషి కాదుగా..." అంటూ రజనీ చాలాసేపు విజయ్ గురించి గొప్పగా చెప్తుంటే కళ్యాణి ఓపిగ్గా వింటూ కూర్చుంది.

వాళ్ళ మాట కచేరీ సాయంకాలం నాలుగు గంటలవరకు సాగింది. ఆ తర్వాత కాఫీలు కూడా అక్కడే తాగేసి కళ్యాణి వంశీని తీసుకుని ఇంటికి బయలుదేరింది. ఇంటికొచ్చి బట్టలు మార్చుకున్నాక, వంశీని కూర్చోబెట్టి "మీకు వుద్యోగం వచ్చినప్పుడు మీరు మీ ఫ్రెండ్సుకి మందు పార్టీయిచ్చేరా? విజయ్‌గారు తాగనుకాక తాగనంటున్నా వినకుండా బలవంతంగా అతనిచేత తాగించేరా? " అని అడిగింది.

వంశీ గతుక్కుమన్నాడు. గతం గుర్తుకొచ్చింది. విజయ్ ఆరోజు ఎక్కడో తాగి యింటికి వెళ్తుండగా, తను దారిలో ఆపు చేసి, ఏదో హితబోధచేశాడు. తాగడం తప్పని కూడా మందలించాడు. కానీ "నువ్వే

యివాళ పార్టీ యిచ్చేవని చెప్తాన"ని విజయ్ అంటే తను భయపడ్డాడు. ఆ తర్వాతా విషయమే మర్చిపోయేడు. ఇన్నాళ్ళ తర్వాత మళ్ళీ ఆ రిఫరెన్స్ వచ్చింది. విజయ్ తన భార్యకి చెప్పిందంతా అబద్ధమే నని చెప్పేద్దామనుకున్నాడు గానీ అందువల్ల విజయ్‌కీ, అతని భార్యకి తగాదాలు రావచ్చు! విజయ్ తన ప్రాణస్నేహితుడు. తనకి వుద్యోగం రావడానికి సెక్యూర్టీ ఇచ్చిందీ, తన పెళ్ళి జరిపించిందీ అతనే! తనిప్పుడు నిజం మాట్లాడితే, విజయ్‌కి అప కారం చేసినవాడవుతాడు. ఇలా ఆలోచించి "ఆరోజు నేనేం తాగలేదు" అని మాత్రం అనగలిగాడు.

"ఆ మాట రజనీగారే చెప్పేరండి. మీరు ఆరోజు తాగలేదని విజయ్‌గారు వాళ్ళావిడకి చెప్పేరట"

"అలాంటప్పుడు మళ్ళీ అడగడంఎందుకు? "

"ఎందుకూ అంటే... అతను నిజమే చెప్పాడో, లేక వాళ్ళావిడ దృష్టిలో మిమ్మల్ని చెడు చెయ్యడం యిష్టంలేక అలా చెప్పేడో, ఎవరికి తెలుసు"

కళ్యాణి పుల్ల విరుపుగా అన్న మాటకి వంశీకి బుర్ర దిమ్మెక్కిపోయింది. కథంతా యిలా రివర్స్‌లో నడుస్తోందేమిటి? ఆ రజనీ జరిగిన విషయాల్ని ఏ వెర్షన్‌లో చెప్పిందో, యీవిడే మూడ్‌లో విన్నదోగానీ, యింటికి రాగానే ఇంటర్వ్యూ ఆరంభిం చింది. కళ్యాణికి ఏర్పడిన అనుమానాలకి తోడు, రజనీ కదలేసిన గతం మరింత బలాన్ని సమకూర్చిందా? నేను నేరకపోయి కళ్యాణిని ఆ యింటికి తీసుకెళ్ళేనా? అని మనసులోనే ప్రశ్నలు వేసుకుంటూ, ఆవిడ అడిగిన అన్ని ప్రశ్నలకీ కలిపి ఒకే సమా ధానం చెప్పాడు. "నువ్వు నమ్మినా, నమ్మక పోయినా నాకు తాగుడు పేకాటలాంటి అల వాట్లు లేవు. ఏదేవుడి మీద ప్రమాణం చెయ్యమన్నా చేస్తాను" అన్నాడు.

★ ★ ★

మరి కొన్ని రోజులు గడిచాయి.

అప్పుడప్పుడు తాతారావు వస్తున్నాడు వెళ్తున్నాడు. "మీమధ్య ఏమైనా గొడవలుంటే చెప్పండి నేను తీర్చిపెడతాను. ఈమధ్య తెలిసిన వాళ్ళెవరికీ గొడవలు రాకపోవడం వల్ల నాకు తీర్పులిచ్చే ఛాన్స్ దొరకడంలేదు. దాంతో నానోరంతా అదోలా అయిపో తోంది" అంటూ అతను బాధపడితే...

"మీ నోటి దురద తీర్చడానికి మేం ఎక్కడ తగవులు సృష్టించుకోం" అంటూ వంశీ విసుక్కున్నాడు. కళ్యాణికి తాతారావు గురించి తెలిసింది అంతంతమాత్రమే కాబట్టి అతన్తో ఎప్పుడూ ఏ ఫేమిలీ మేటరూ డిస్కస్ చెయ్యలేదు. ఓరోజు కళ్యాణి తల్లి సుభద్రకి ఏదో సుస్తీ చేసిందని విశాఖపట్నంనించి టెలీగ్రాం వస్తే కళ్యాణి హడావిడిపడుతూ వూరికి బయలుదేరింది. బయలుదేరేముందు "మీరూ రాకూడదూ" అంది వంశీతో. అతనికైతే వెళ్ళాలనే వుంది గానీ, ఆఫీసులో ఆడిట్ ఇనస్పెక్షన్ జరుగు తోంది కాబట్టి, ఆఫీసుకి శెలవు పెట్టే అవకా శంలేదు. అందుకే కళ్యాణి ఒక్కదాన్నే ట్రైన్ ఎక్కించాడు.

వంశీకుండే మొహమాటం, మంచితనం వల్ల ఆఫీసులో అందరికీ యివ్వక్కర్లేనంత మర్యాదిచ్చాడు. ఇవ్వకూడనంత చనువి చ్చాడు. అది గమనించిన విజయ్ "రేయ్, నువ్వు మనుషులంతా ఒక్కటేననే సోష లిజం కబుర్లని ఆఫీసులో వినిపించకు. ఓ క్లాసులో కొంతమంది స్టూడెంట్సు, ఓ టీచరూ వుంటారు. అలాగని టీచరూ, స్టూడెంట్సూ సమానమే అనుకుంటే ఎలా? ఒకరు విద్యని బోధించేవారు మిగతావారు విద్య నేర్చుకునేవారు. ఇద్దరి మధ్యా కొంత భేదం వుండాలి. వుండనప్పుడు టీచరు విద్యని బోధించలేడు. స్టూడెంట్సు విద్యని నేర్చుకోనూలేరు. కోర్టులో జడ్జీ వుంటాడు. లాయర్లూ వుంటారు, నేరస్థులూ వుంటారు.

చట్టం దృష్టిలో అందరూ సమానమే కావచ్చు. కానీ న్యాయవిచారణ జరిగేటప్పుడు లాయరు పని వాదించడంవరకే. జడ్జీ మాత్రమే తీర్పు ఇవ్వాలి! అక్కడా చిన్నా పెద్దా, ఎక్కువా తక్కువా అనే తేడా లుంటాయ్. ఆఫీస్ వర్క్‌లోనూ మనం ఆ పద్ధతిని పాటించాలి. నువ్వు అసిస్టెంట్ మేనేజర్‌వి. కానీ ప్యూన్ దగ్గర్నించి గుమస్తాల వరకు అందర్నీ నెత్తికెక్కించుకుంటావు. దాంతో మంచి ఫలితాలకంటే చెడు ఫలితాలే ఎక్కువ కలిగే అవకాశం వుంది" అంటూ విజయ్ రెండుమూడుసార్లు హెచ్చరించాడు.

అయినా వంశీ ఆ మాటల్ని పక్కకి నెట్టేశాడు. వంశీ అధీనంలో కొంతమంది పని చేస్తున్నా, అతనిచ్చిన అతి చనువువల్ల అతన్ని "ఏమండీ" అని "సార్" అనీ పిలిచే వాళ్లు తక్కువ. "ఏంగురూ" అనో "వాట్ బాసూ" అనే వాళ్ళే ఎక్కువయ్యారు.

"తక్కువ్వాడికి ఎక్కువ విలువిస్తే, వాడు నిన్ను తక్కువ్వాడిగా చూసే అవకాశం వుంది" అనే ఓ డైలాగ్‌ని ఓ నాటకంలో వాడేడు వంశీ. అది అందరి విషయంలో కాకపోయినా చాలామంది విషయంలో నిజమేనని నిరూపణయింది. అలాగే తన విషయంలోనూ నిజమైంది.

వంశీ భార్య పుట్టింటికెళ్ళిందనే విషయం కేవలం ప్యూన్ రంగారావుకి మాత్రమే చెప్పాడు. అంతే! అరగంటయేసరికి ఆఫీసులో వున్నవాళ్ళందరికీ తెలిసిపోయింది. అందులో ఓ నలుగురు మామూలు గుమస్తాలే! వాళ్ళు వంశీ చూపించే మర్యాదని అలుసుగా భావించి అతన్ని 'ఏంగురూ' అని పిలిచేవాళ్లు! అందులోనూ వాళ్ళందరిచేత ఓ నాటికను వేయించి, దర్శకత్వం వహించి వాళ్ళలో ఒకడిగా మసలుకోవడాన్ని వాళ్ళు అలుసుగా తీస్కుని, ఖాళీగా వున్నపుడు వంశీ కూర్చుండే రూమ్‌లోకొచ్చి బాతాఖానీ కొట్టడం అతని డబ్బులతో కాఫీలు తెప్పించుకుని తాగడం, ఆఫీస్‌కి లేట్‌గా రావడం, వేగంగా వెళ్ళడం లాంటివి చేస్తుంటారు. కొంతమంది అతని పర్మిషన్ని మాటవరసకు తీసుకుంటారు. మరికొంతమంది అదీ చెయ్యరు. వాళ్ళ వర్క్ ఏదైనా పెండింగ్ వుంటే, అదీ వంశీయే చేసేస్తుంటాడు.

ఇదంతా వంశీ కుండే సహనంవల్ల విపరీతమైన మొహమాటంవల్లే జరుగుతోందని గ్రహించిందీ, బాధపడిందీ ఒక్క జయలతే! ఆమె ఇరవై నాలుగేళ్ళ అవివాహిత! అక్కడ టైపిస్ట్ కమ్ స్టెనోగ్రాఫర్‌గా పనిచేస్తోంది. చదువుకున్న చదువుని సార్థకం చేస్కోడానికి ఆవిడావుద్యోగం చెయ్యడంలేదు. ఆవిడ సంపాదనమీదే ఇల్లు గడుస్తోంది. జబ్బుతో మంచానపడిన తల్లి జానకమ్మ తప్ప మరో దిక్కు ఎవరూ లేరు. ఆవిడ లోయర్ మిడిల్ క్లాస్‌లోని లోతుల్ని, ఒడిదుడుకుల్ని చూస్తూ బతుకుతున్న మనిషి. ఆవిడ జీవితంలోని దైన్యత, నిస్సహాయతలకి వంశీ విపరీతంగా జాలిపడతాడు. ఆమధ్య ఆఫీస్ ఫంక్షన్‌కి నాటిక వేసినప్పుడు అందులో వున్న లేడీ ఆర్టిస్టు పాత్రని జయలత చేతనే బలవంతాన వేయించాడు.

"అబ్బే నేనెందుకు పనికొస్తానండి" అంటూ జయలత మొహమాట పడిపోయింది.

"ఈ ప్రపంచంలో పనికిరాని పదార్థం ఏదీ లేదండీ. పాడైపోయిన గడియారం కూడా రోజుకి రెండుసార్లు కరక్ట్ టైమ్‌ని చూపిస్తుంది. మన తెలుగు అక్షరాల్లో 'ఞ' అనే అక్షరం వుంది. అది మాటల్లో వాడటానికి, రాతల్లో రాయడానికి వుపయోగపడదు. కానీ దాన్నే తిప్పి చూడండి. 'ఒ' అనే అక్షరంగా మారుతుంది. ఈనాడు ప్రసిద్ధ నటులు, నటీమణులు అనిపించుకున్న వారంతా ఒకప్పుడు కొత్త వారేకదండీ. మీతో కలిసి నటించే వాళ్ళంతా మన ఆఫీసులో పని చేసేవాళ్ళే కదా! పైగా డైరక్ట్‌చేసేది కూడా నేనే! మీరు వేసేది కూడా నా

చెల్లెలి పాత్రే! అన్నయ్యతో కలిసి నటించడానికి భయమెందుకు?" అంటూ ఆమెను ప్రోత్సహించి, భయాన్ని పోగొట్టి నటింపజేశాడు.

ఆనాటినించి ఆమెకు అతనిమీద గౌరవ భావం పెరిగింది. ఆఫీస్‌స్టాఫ్ అతనికివ్వవలసిన గౌరవం ఇవ్వడం లేదని గమనించడమే కాకుండా ఫ్రెండ్లీగా సలహా ఇస్తూ, "మీరు కాస్త రిజర్వ్‌డ్‌గా వుండడం మంచిదేమో సార్" అంది.

వంశీ చిన్నగా నవ్వేసి "నా కలా వుండ బుద్ధికాదండి. వాళ్ళిక్కడ వుద్యోగరీత్యా ఎవరైనా కావచ్చు. కానీ వాళ్ళంతా నా ఫ్రెండ్సు. ఫ్రెండ్స్ అన్నాక ఎక్కువ తక్కువలు పాటించడంలో అర్థంలేదని నా అభిప్రాయం" అన్నాడు.

ఆరోజు అతన్తో మరీ చనువున్న నలుగురు గుమస్తాలు, ఫ్యాన్ రంగారావు వంశీ రూమ్‌లోకొచ్చారు.

"ఏంటీ అందరూ ఇలా కట్టకట్టుకొచ్చారు?" అన్నాడు వంశీ నవ్వుతూ.

"మరేంలేద్సార్, మన ఆవిడగారు" అంటూ ఫ్యాన్ రంగారావు అంటుంటే వంశీ అతనివైపు కాస్త సీరియస్‌గా చూశాడు. రంగారావు తన తప్పుకి నాలిక కరుచుకుని "సారీ సార్! మీ మిస్సెస్‌గారు, అంటే మేడమ్‌గారు తమ పుట్టింటికి అంటే విశాఖపట్నం వెళ్లేరని చెప్పారు కదా! మళ్ళీ మేడమ్‌గారు తిరిగొచ్చేదాకా మీ యింట్లో మీరు తప్ప మరెవరూ వుండరు కదా"ని అంటూ ఆగాడు.

"వుండకపోతే ఏంటట?"

"మరేం లేదుగురూ! క్లబ్బుకంటే ఇల్లు సేఫ్టీ అన్నారు కదా జూదకళాప్రపూర్ణులు" అన్నాడోగుమస్తా.

"అంటే?"

"అదే గురూ, ఈ నాలుగు రోజులూ సాయంత్రం ఆఫీసు అయ్యాక మీ యింట్లో సరదాగా చతుర్ముఖపారాయణం చేద్దామని మనవాళ్ళంతా కుతకుతలాడిపోతున్నారు... సారీ సారీ, తహతహ లాడిపోతున్నారు"

"చతుర్ముఖపారాయణం అంటే ... పేకాటా?" వంశీ అడిగాడు.

"ఔను గురూ! సంస్కృతంలో అలాగంటారు. తెలుగులో పేకాట అంటారు. ఇంగ్లీషులో గేంబ్లింగ్ అంటారు"

"ఏ భాషలో ఏం అన్నా సరే, నాకు పేకాటాడ్డం రాదు. నేను ఆడను"

"నీకు రాకపోతే పేకాట ప్రొఫెసర్లం మేం వున్నాంగా. మేం నేర్పించేస్తాం"

"వద్దులే! నేను నేర్చుకోవలసిన విద్యలు చాలా వున్నాయి. కానీ, ఆ లిస్టులో ఈ పేకాట లేదు! సారీ"

వంశీ ఆ మాటలు చెప్తుండగానే తన తండ్రి జ్ఞప్తికొచ్చాడు. అలా చెప్పినా అక్కడున్న వారిలో రాంబాబు అనే గుమస్తా మహా గడుగ్గాయ్ కాబట్టి, వంశీని మొహమాటపెట్టేశాడు. "అది కాదు బాసూ, నువ్వు ఆడనూ అంటే బలవంతంగా నిన్ను కూర్చోబెట్టి నీ చేతికి పేకముక్కలిచ్చి ఆడించెయ్యంగా! నువ్వెలాగూ పుస్తకాల పురుగువే కదా! మా మట్టుకు మేం ఆడుకుంటుంటే నీ మట్టుకు నువ్వు నవల్సు చదువుకో... మనది ప్రజాస్వామ్యం గదా! పదిమంది ఏదంటే పదకొండోవాడూ అదే అనెయ్యాలి. అందులోనూ నువ్వు ఆఫీస్‌రంగంలో అధికారివి, నాటకరంగంలో గురువ్వి... కాదనకు బాసూ"

వంశీ మనసుకైతే, వాళ్ళని యింట్లో పేకాట దుకాణం పెట్టొద్దని చెప్పెయ్యాలనుంది. కానీ అతన్తోపాటు ఎదిగిపోయిన అతని మొహమాటం అతని మనోభిప్రాయాన్ని నోరు విప్పనివ్వలేకపోయింది.

"సరే!" అనక తప్పలేదు. వాళ్ళు హేపీగా వెళ్ళిపోయారు. వారు వెళ్ళిన కాస్సేపటికి జయలత ఆ రూమ్‌లోకి వచ్చింది.

"నేను నిన్ను పిలవలేదు లతా" అన్నాడు.

"మీరు పిలిచేరని రాలేదు సార్! కానీ,

నాకేదో భయం కలిగి నేనే వచ్చాను" అంది జయలత ఏదో సలహా చెప్పడానికొచ్చి, చెప్పలేక సంశయిస్తున్నట్టుగా.

"భయమా? నీకా? ఎవరివల్ల? " వంశీ ఆసక్తిగా అడిగాడు.

"భయం నాక్కాదండి... మనస్టాఫ్ వాళ్ళు మీ ఇంటికొచ్చి పేకాట ఆడుకుంటామని హాల్లో మా అందరికీ గొప్పగా చెప్పన్నారు సార్"

"ఔను... వాళ్ళు పర్మిషన్ అడిగారు"

"మీరు ఒప్పుకోకుండా వుండాల్సింది సార్"

"మనవాళ్ళే కదాని... సరే అనేశాను"

"వదినగారికి తెలిస్తే... అదే మీ మిస్సెస్ గారికి తెలిస్తే, వారేమైనా అనుకోవచ్చు, తర్వాత అది గొడవలకి దారితియ్యొచ్చు"

"ఆవిడ వూళ్లో లేదులే! పైగా, ఇలాంటి సరదా కాలక్షేపాలకి అభ్యంతరం చెప్పేటంత నేరోమైండెడ్ మెంటాలిటీ కాదు ఆవిడది"

జయలత నిట్టూర్చి వెళ్ళిపోయింది. వంశీ ఆ మాట జయలత ముందు అలా అనేసాడు గానీ మనసులో మాత్రం భయం నీడలు కొద్దిగా కదలాడేయి. అయినా అంతలోనే తనకి తానే ధైర్యం చెప్పుకుంటూ "నేనేం పేకాట ఆడ్డం లేదు కదా" అనుకున్నాడు.

★ ★ ★

ఆ సాయంత్రం

వంశీ ఇంట్లో వంశీ ఓ నవల చదువుకుంటూ కూర్చున్నాడు. అతని కొలీగ్స్ నలుగురు, ప్యూన్ రంగారావు నేలమీద చాప పరుచుకుని పేకాట ఆరంభించారు. మధ్యలో కాఫీలు, సిగరెట్లు కావాలంటే రంగారావు వెళ్ళి పట్టుకొచ్చాడు. సాయంత్రం ఆరున్నరకి టీవీలో వచ్చే 'నవరాగం' సీరియల్ వంశీ చూస్తుంటే, ఓ కొలీగ్ "సౌండ్ తగ్గించండి బాసూ" అంటూ కాస్త విసుక్కున్నాడు. వంశీకి మనసు చివుక్కుమన్నా తమాయించుకుని సౌండ్ తగ్గించి సైలెంట్ పిక్చర్‌నే చూస్తున్నాడు. అక్కడ ఆడుతున్న వాళ్ళంతా సిగరెట్లు కాల్చే స్మోకర్సే! మొదటి పావుగంట సేపు అసిస్టెంట్ మేనేజర్‌గారి ఎదుట సిగరెట్లు కాల్చడం మర్యాదకాదని నిభాయించుకున్నారు. కానీ ఒకటి రెండు ఆటలు జరిగాక పేకాటలో సహజంగావుండే టెన్షన్ మర్యాద అనే మాటని పక్కకి నెట్టేసింది. సిగరెట్లు వెలిగాయి. బూడిద నేల రాలుతోంది. సిగరెట్ పీకల్ని అస్తవ్యస్తంగా విసిరేస్తున్నారు. డ్రాయింగ్ రూమ్‌లో చెల్లాచెదురుగా పడుతున్న విషయం వంశీ గమనించాడు. అతను గమనించినట్టుగానీ, అసహనంగా ఫీలవడంగానీ వాళ్ళు గమనించలేదు. ఆపరేషన్ చేస్తున్నప్పుడు సర్జన్ తన దృష్టి, మనసు ఆ పనిమీదే కేంద్రీకరించినట్టుగా వాళ్ళందరి దృష్టి పేకముక్కలమీదే వుంది. వంశీ టీవీ ఆఫ్ చేశాడు. నవల పక్కన పెట్టేశాడు. ఓ కాగితం తీసుకుని సిగరెట్ పీకల్ని అందులో పెడుతుండగా, గుమ్మంలోకి ఎవరో వచ్చినట్టనిపించి తలెత్తి చూశాడు.

గుమ్మం దగ్గర లాయర్ మాలతీదేవి నిలబడింది!

వంశీ కంగారుపడి చేతిలో వున్న కాగితాన్ని పక్కకి విసిరేసి గబగబ బైటకి వెళ్ళాడు. అప్పటికి ఒకటి రెండుసార్లు కళ్యాణితో కలిసి ఆవిడ యింటికెళ్ళి మాట్లాడడం వల్ల ఆవిడతో కాస్త పరిచయం ఏర్పడింది.

"నమస్కారమండీ" అన్నాడు వంశీ.

"నమస్కారం. కళ్యాణిగారు లేరాండీ? " మాలతి నవ్వుతూనే చాలా యధాలాపంగా అడిగింది.

"లేదండీ... వాళ్ళమ్మగారికి సుస్తీగా వుందని తెలిస్తే వైజాగ్ వెళ్ళింది" అంటూనే వంశీ, ఆవిణ్ణి లోపలకి పిలుద్దామా వద్దా అనే సందిగ్ధంలో పడ్డాడు. లోపలకి పిలిస్తే, అక్కడంతా పేకాట ఆడుతూ సిగరెట్లు కాలుస్తున్నారు. పిలవకపోతే యింటి

కొచ్చిన లాయర్ని గుమ్మంలోనే నిలబెట్టి మాట్లాడేశాడని ఫీలవుతుందేమో! ఏం చెయ్యాలి? ఆ సందిగ్ధంలో కొట్టుమిట్టాడుతూనే "మరేం లేదండి... వాళ్ళంతా మా ఆఫీస్ కొలీగ్స్... సరదాగా పేకాడుకుంటామని అడిగితేను... తెల్లారిలేస్తే అందరం ఒక్కచోట పనిచెయ్యాల్సిన వాళ్ళంకదా... వద్దంటే బాగోదు కదాని... నేను మాత్రం ఆడ్డం లేదు. నాకు పేకాట రాదు. ఏదో నవల చదువుకుంటూ కూర్చున్నాను" తడబడుతూ, తడబడుతూ మాట్లాడేడు. మాలతి చిన్నగా నవ్వుతూ అతన్ని నిశితంగా గమనించి "మీరేదో టెన్షన్ ఫీలవుతున్నారు. నేను మార్కెట్ కెళ్తూ కళ్యాణిగారున్నారేమో ఓసారి పలకరించి వెళ్దామని యిక్కడాగేను. యూ కేరీఆన్" అనేసి వెళ్ళబోయింది.

"మీరు కేరీఆన్ అంటానికి నేనేం ఆడ్డం లేదండి. నవల చదువుకుంటున్నానంతే" అన్నాడు కంగారుగా.

"పోనీ ఆపనే కానివ్వండి. నేనెళ్లొస్తాను" మాలతి నమస్కరించి వెళ్ళిపోయింది. వంశీ లోపలకొచ్చాడు. పేకాట ఆడుతూనే ఓ కంట మాలతిని గమనిస్తున్న ప్యూన్ రంగారావు "ఎవరు సార్ ఆ లేడీస్" అని అడిగాడు. వంశీకి సమాధానం చెప్పబుద్ధి కాక మౌనంగా వూరుకున్నాడు. రంగారావు "కదిలిస్తే కందిరీగ"టైపు మనిషి. ఆఫీసులో కొంతమంది అతన్ని కె.కె.ఈగ అనే నిక్ నేమ్‌తోనే పిలుస్తారు. కె.కె.ఈగ అంటే 'కదిలిస్తే కందిరీగ' అని వంశీకి ఒకాయన అర్థం చెప్పాడు. వంశీ మళ్ళీ గదంతా చూశాడు. ఇంకొన్ని సిగరెట్ పీకలు కన్పించాయి. గది నిండా సిగరెట్ పొగ వ్యాపించింది. వాళ్ళు వెళ్ళింతర్వాత ఆ స్థలమంతా చీపురుతో తుడిచేసి, ఫినాయిల్ ఇల్లంతా జల్లాలని నిర్ణయించుకున్నాడు.

సమయం పావుతక్కువ ఎనిమిది అవుతుందనగా అక్కడికి విజయ్ ప్రవేశించాడు. దాంతో అక్కడున్న వాతావరణం మరింత దుర్భరమయింది. విజయ్ కూడా అప్పుడప్పుడు పేకాడుతాడు. విజయ్ అంతవరకు ఆఫీస్ వర్క్ చూస్కుని చాలా కేజువల్‌గా అక్కడకొచ్చాడు. కళ్యాణి వూరికెళ్లిన విషయం అప్పుడే తెల్సింది. పేకాటాడుతున్న వాళ్ళందరికీ విజయ్, వంశీల మధ్యనున్న స్నేహం సంగతి తెలుసు. అలాగే విజయ్ ఒకప్పుడు మామూలు బాతులాగ బతికి, పెళ్ళిద్వారా బంగారపు బాతులాగ మారేడనీ తెలుసు. విజయ్ పేకాటాడ్డానికి వుత్సాహం చూపించాడు. కానీ వంశీ అతన్ని వారించి "వద్దురా నేనొక్కణ్ణి బోర్‌కొట్టి చస్తున్నాను. నువ్వూ నేనూ వరండాలో కూర్చుని సరదాగా కబుర్లు చెప్పుకుందాం" అన్నాడు.

"మనం మాట్లాడుకోవడం ఎప్పుడూ వుండేదే కదరా! మీ వాళ్ళతో కలిసి పేకాడే అవకాశం ఎప్పుడొస్తుంది? నువ్వు నవల చదువుకో" అంటూ విజయ్ కూడా పేకాటలో కూర్చున్నాడు. ఆట అవుతుండగా రాంబాబు ఓ ప్రపోజల్ పెట్టేడు. "విజయ్ గారూ, మీపెళ్ళి జరిగేనాటికి మనం ఫ్రెండ్సు కాము. మీ ఫ్రెండు వంశీగారు మాకు అసిస్టెంట్ మేనేజరుగా వచ్చిన నాటి నించే మనం కలిశాం. ఆ తర్వాత పేకముక్కలతో ఇప్పుడు కలిశాం. పేకాటలో కలిసిన స్నేహం ప్రాణస్నేహంగా మారుతుందంటారు. సో... యీ హేపీ సందర్భాన్ని సెలబ్రేట్ చేస్కోవాలంటే చేతిలో పేక ముక్కల్తోపాటు కడుపులో మందు చుక్కలూ పడాలి. మనం తలాకాస్త వేస్కుని ఓ ఫుల్ బాటిల్ ఓ నాలుగు బీర్ బాటిల్స్ తెచ్చుకుని ఛీర్స్ కొడితే ఎలా వుంటుందంటారు?" అన్నాడు పేకముక్కల్ని డ్రాప్ చేస్తూ.

ఆ మాటలు విని వంశీ అదిరిపడ్డాడు. "ఏయ్ రాంబాబూ, ఏంటా మాటలు? మీరంతా కలిసి యిక్కడ మందు దుకాణం పెడతారాఏంటి" అన్నాడు అయిష్టంగా,

# పలిన ముత్యాలు

★ మిత్రుడి ప్రశంసలకు, పగవారి దూషణకు అర్థంలేదు. మిత్రుడి విమర్శ, పగవారి ప్రశంస గమనించతగ్గవి.

★ హృదయానికి ఏదైతే ఈరోజు తెలిసి ఉంటుందో దాన్నే మస్తిష్కం మరుసటిరోజు అర్థం చేసుకుంటుంది.

-జేమ్స్ స్టీవెన్స్

★ ప్రతీవాడూ ఇది చెడు అని చెప్పగలరు. అందులోనుండి బయటపడే మార్గం చెప్ప గలిగినవాడే ఆప్తుడు.

-వివేకానందుడు

★ ఉత్తమ వ్యక్తిని ప్రణామంద్వారా అనుకూలుని చేసుకోవాలి. శూరుని భేదనీతి ద్వారా, నీచుని అల్పవస్తువు ఇచ్చుట ద్వారా, సమానశక్తి కలవానిని పరాక్రమంతోను వశం చేసు కోవాలి.

-ఒక సూక్తి

★ కొందరు తమ తప్పులను ఒక నిధికంటే విలువయినదిగా భావించి దాచి పెడతారు.

-ఒక సూక్తి

★ ఆచరణకి సాధ్యంకాని ఆలోచనలు అవివేకికి మాత్రమే వస్తాయి.

-ఒక సూక్తి

★ ఒక మంచి ఆశయాన్ని మనసులో పెట్టుకుని నేడు నిద్రించు. రేపు దాన్ని ఆచరణలో పెట్టు

-బాల్‌జక్

★ మోహం కంటే నిప్పు మరొకటిలేదు.

-ధర్మపాల్

★ మహాత్ముల గొప్పతనాన్ని కీర్తించటంకంటే చేతలద్వారా వారి ఆశయాలను ఆచర ణలో పెట్టడం వలన అత్యంత గౌరవం లభిస్తుంది.

-హోరస్‌మాన్

★ ఒక లక్ష్యానికి, ఆచరణకు కట్టుబడని జీవితం జీవితమనిపించుకొనదు.

-రాఛెల్

★ వీరుని రక్తం కన్నా పండితుని సిరా ఎక్కువ పవిత్రమైనది.

-మహమ్మద్ ప్రవక్త

★ మన విధులను మనం సక్రమంగా నిర్వర్తించినపుడే మనకు నిజమైన హక్కులు వస్తాయి.

-మహాత్మాగాంధి

సేకరణ: వాకాడ దుర్గాప్రసాద్

ఆవేశంగా. విజయ్ లేచివెళ్ళి వంశీ తల నిమిరి "నీ చేత తాగించి, నీ శీలాన్ని చెడగొట్టి నీ పాతివ్రత్యాన్ని పాడుచెయ్యంలేరా! డోంట్‌వర్రీ, అయామ్ హియర్, డోంట్ ఫియర్" అంటూ రాంబాబువైపు తిరిగి "మిష్టర్ రాంబాబూ, నువ్వు చెప్పిన పేకాట ఫ్రెండ్షిప్పు గురించి ఆలోచించాను. చాలా బావుంది. కానీ ఆఖరి వాక్యమే బాగోలేదు. మనందరం కలిసినప్పుడు నేనే మీఅందరకీ పార్టీ యివ్వాలి" అంటూ విజయ్ పర్సులోనించి డబ్బు తీసి ప్యూన్ రంగారావు చేతికిచ్చాడు. రంగారావు యిలా వెళ్ళి అలా ఓ విస్కీబాటిల్, నాలుగు బీర్‌బాటిల్స్ తీసుకొచ్చాడు. అతనే కిచెన్‌లోకి వెళ్ళి గ్లాసులు తీసుకొచ్చాడు. పార్టీ ఆరంభమయింది. అది పూర్తయ్యేసరికి పదిన్నరయింది. అంతవరకు వంశీ అసహనంగా, కాలుతున్న పెనంమీద కూర్చున్నంత బాధ భరిస్తూ కూర్చున్నాడు. విజయ్ డ్రింక్సు, పేకాట కూడా ముగించి "రంగా యీ సీసాలన్నీ బైటవున్న డస్ట్‌బిన్‌లో పడెయ్" అన్నాడు. రంగారావు ఆ సీసాల్ని పట్టుకోబోతే "రంగా, ఆ బీర్ బాటిల్స్‌ని పారేసి, విస్కీబాటిల్‌ని మాత్రం వదిలెయ్" అన్నాడు వంశీ! రంగారావు బీర్ బాటిల్స్ పట్టుకుని బయలుదేరాడు. విస్కీ సీసా అందంగా ఆకర్షణీయంగా చూడముచ్చటగా వుంది.

"ఇది ఖాళీసీసారా" అన్నాడు విజయ్ చిన్నగా నవ్వుతూ.

"అందుకే నాక్కావాలంటున్నాను"

"దీంతో నీకేం పని? "

"వచ్చేనెల్లో ఫ్రిజ్ కొనబోతున్నానుకదా! అందులో వాటర్ పోసి ఫ్రిజ్‌లో పెట్టుకుంటే బావుంటుంది"

విజయ్ పిచ్చిగా పగలబడి నవ్వేడు. మిగతా వాళ్లూ వంతపలికారు. విజయ్ నవ్వుని కంట్రోల్‌చేసుకుంటూ అన్నాడు.

"రేయ్ వంశీ! నిన్ను మొదట్లో ఫూల్‌వనుకునేవాణ్ణి. కానీ ఆ తర్వాత ఆ అభిప్రాయాన్ని మార్చుకుని నువ్వో సెంటిమెంటల్ ఫూల్‌వనే నిర్ణయానికొచ్చేను. కానీ అదీ తప్పని తెల్సుకున్నాను. నిజం చెప్పాలంటే నువ్వో క్రేక్ మాస్టర్ జెనరల్‌వి"

తన స్టాఫ్‌ముందు తనని క్రేక్‌మాస్టర్ అన్నందుకు వంశీ బాగా హర్టై "నేనేం క్రేక్ గాణ్ణి కాదు" అన్నాడు వుక్రోషంగా.

"క్రేక్‌గాడివి కాకపోతే మరెవడివి? ఎవడైనా, కారు కొన్నాక పెట్రోల్ గురించి ఆలోచిస్తాడుగాని ముందుగా పెట్రోల్‌ని స్టాక్ చేసుకుని వుంచుకోడు. నువ్వింకా ఫ్రిజ్జే కొనలేదు. దాన్లో పెట్టే వాటర్ సీసాల గురించి యిప్పట్నించీ ఆలోచించడం వేస్ట్! అది కేవలం పిచ్చి వాళ్ళు చేసే పని"

"నీకివాళ మందుకాస్త ఎక్కువైనట్టుంది. పెట్రోల్ని యింట్లో దాచుకుంటే అదెప్పుడైనా మంటగా మారే ప్రమాదం వుంటుంది. కానీ ఖాళీ సీసా దాచడంవల్ల ఏం ప్రమాదాలుంటాయ్"

ఆ వాదన పెరగకుండా రాంబాబు అన్నాడు "సార్! సీసాలో వున్న మందు మనం తాగేశాం. ఖాళీ సీసా మా బాస్‌కి కావాలి. అదెలాగూ బయట పారేసేదేగా! దానికింత ఆర్గ్యుమెంట్ ఎందుకు? ఇచ్చెయ్యండి. ఓ పని అయిపోయినట్టుంటుంది"

విజయ్ ఆ సీసాని టీపాయ్‌మీద పెట్టేసి మిగతా వాళ్ళని తీస్కుని వెళ్ళిపోయేడు. వంశీ ఆ గదంతా చూశాడు. ఖాళీ అయిపోయిన సిగరెట్ పాకెట్లు, కాల్చి పారేసిన సిగరెట్ పీకలు, బూడిద... గది నిండా యింకా పూర్తిగా తొలగిపోని పొగ... వాసన... "ఛ! రేపట్నించి వీళ్ళనిక్కడ పేకాట ఆడనివ్వకూడదు" అని మనసులోనే తీర్మానించుకున్నాడు. బట్టలు మార్చుకుని లుంగీ, బనీను వేస్కుని తలుపులు మూసి చీపురుతో ఆ డ్రాయింగ్ రూమంతా ఒకటికి రెండుసార్లు తుడిచాడు. సిగరెట్ పీకల్ని ఓ కాగితంలో పొట్లం కట్టి వీధిలోకి దూరంగా

పడేలా విసిరాడు. తర్వాత ఫినాయిల్ ఆ గదంతా జల్లి ఓ గుడ్డతో గచ్చుని బాగా తుడిచాడు. ఫ్యాన్ని హైస్పీడ్లో పెట్టి, గదిలో మిగిలున్న సిగరెట్ పొగ పూర్తిగా బైటకి పోయేలా చేశాడు. మొదట్నించీ అతనికి శుభ్రతంటే మహాయిష్టం. పేకాట ఆడుకుంటామంటే పర్మిట్ చేశాడుగానీ దానివల్ల యిల్లు యింత అసహ్యంగా తయారవుతుందని మాత్రం వూహించలేకపోయాడు. విస్కీసీసాని కిచెన్లోకి తీసుకెళ్లి నీళ్లతో ఒకటికి నాలుగు సార్లు కడిగాడు. సీసాలో వున్న విస్కీవాసన పూర్తిగా పోయిందని నిర్ధారించుకున్నాకే దాన్ని బీరువాలో పెట్టాడు! అప్పటికి టైమ్ పావుతక్కువ పన్నెండయింది. కడుపులోని ఆకలి విషయం అప్పుడు గుర్తొచ్చింది. ఇప్పుడు వంట చేస్కోలేడు. కాస్త దగ్గర్లో ఓ మెస్ వుందిగాని అదీపాటికి కట్టేసుంటారు. ఓ కిలో మీటర్ దూరంలో ఓ ఇరానీ హోటల్ వుంది. అది తెల్లారుఝాము మూడుగంటలవరకు తెరిచుంటుంది. కానీ యింత రాత్రి టైములో అంతదూరం వెళ్ళడానికి మనస్కరించక రెండు గ్లాసుల మంచినీళ్ళు తాగేసి మంచమెక్కి నిద్రపోయాడు.

★ ★ ★

మర్నాడు ఆఫీసులోని కొలీగ్స్ "ఈనాటి కార్యక్రమం బేమనిన" అంటూ పేకాట గురించి ప్రస్తావించబోతే "సారీ, యివాళా రేపూ నాకు సిటీకేబుల్లో న్యూస్ చదివే డ్యూటీ పడింది. నేనింట్లో వుండను. వచ్చేసరికి చాలా లేట్ అవుతుంది" అని ముందుగా నిర్ణయించుకున్న మాటనే చెప్పేశాడు.

"మీరుండకపోయినా ఫర్వాలేదు. మీ మట్టుకు మీరు న్యూస్ చదువుకోండి. మా మట్టుకు మేం ఆడుకుంటాం. మీరు అర్ధరాత్రి ఒంటిగంటకొచ్చినా ఫర్వాలేదు. మేం అప్పటివరకు పేకాడుకుంటూ మీ యింటికి కాపలాకాస్తుంటాం" అంటూ వెకిలిగా నవ్విన రాంబాబుని చూసి వంశీకి ఒళ్ళు మండినా, తమాయించుకుని టాపిక్కుని ఆఫీస్ వర్క్వైపు డైవర్ట్ చేస్తూ, ఏదో ఫైల్ని ఓ గంటలో సబ్మిట్ చెయ్యమని చెప్పి అతన్ని పంపించేశాడు. రాంబాబు వచ్చి అడిగినప్పుడు వంశీ ఎదుటిసీట్లో జయలత కూర్చుని ఏదో డిక్టేషన్ తీసుకుంటోంది. ఈ సంభాషణ విన్నాక, రాంబాబు వెళ్ళాక జయలత చిన్నగా నవ్వి "ఒక్కరోజుకే బోర్ కొట్టేసిందా సార్?" అంది.

"బోర్ లేదు లతా! ఏదో చిరాకు, ఏదో అసహ్యం కలిగాయి. నీట్నెస్ ఈజ్ నెక్స్ట్ టూ గాడ్లీనెస్ అనే మాట నా కెంతో బాగా నచ్చుతుంది. శుభ్రతనేది ప్రతీ మనిషికీ అవసరం గదా! నిన్న జరిగిన అనుభవాన్ని దృష్టిలో పెట్టుకుని యికమీదట మనవాళ్లకా అవకాశం యివ్వకూడదనుకుంటున్నాను" అంటూ నవ్వుతూనే జవాబిచ్చాడు.

అతను తీసుకున్న నిర్ణయం బావుందన్నట్టుగా అతనివైపు చూసింది జయలత. ఆరోజు, మర్నాడు కూడా వంశీ టీవీలో న్యూస్ చదివాడు. మూడోరోజు సాయంత్రం లాయర్ మాలతి కోర్టునించి కారులో యింటికి వెళ్తూ, వంశీ యింటి దగ్గర కారు ఆపి యింట్లోకి వెళ్ళింది. కిచెన్లో కాఫీ చేస్కుంటున్న వంశీ ఆమెను సాదరంగా ఆహ్వానించి ఆవిడక్కూడా కాఫీ అందించాడు. "నేను చేసే కాఫీ బహుశా మీరు చేసినంత రుచిగా వుండదనుకోండి" అంటూ మొహమాటపడ్డాడు.

"భలేవారే! కాఫీ బ్రహ్మాండంగా చేశారు. నేను కూడా యింత బాగా చెయ్యలేను" అంది నవ్వుతూ.

"మీరు అనవసరంగా పొగుడుతున్నారు గానీ ఆడవాళ్ళు చేసినంత బాగా మగాళ్లెలా చెయ్యగలరండి"

"అదేం మాటండీ. ఇళ్లల్లో అంటే ఆడాళ్ళు కాఫీలు, వంటలూ చేస్తారు గానీ కాకా హోటల్నించి ఫైవ్స్టార్ హోటల్స్దాకా

అన్నింట్లోనూ వంటలు చేసేది మగాళ్ళేనండి. మన పురాణాల్లో కూడా మహా వంటగాళ్ళుగా పేరు పొందిన భీముడు, నలుడు మగాళ్లేగా... అద్సరే నేను ఎందుకొచ్చేనంటే నిన్న మీరు టీవీలో చదివిన న్యూస్ విన్నాను. విన్నానూ అనడంకంటే చూశానూ అని చెప్పడం సమంజసంగా వుంటుందేమో! కొంతమంది న్యూస్‌ని న్యూస్‌లాగే చదివేస్తుంటారు. కానీ, మీరు చక్కగా మాడ్యులేట్ చేస్తూ చదవడం, సమ్‌థింగ్ స్పెషల్ అనిపించింది" అంది.

"థ్యాక్సండీ... చాన్నాళ్ళు నాటకాలు వేసేనుగదా! ఆ అనుభవాన్ని బట్టి..."

"ఇప్పుడు టీవీ మీడియా చాలా బాగుంది కదా! సినిమాల్నిగూడా డామినేట్ చేసేసింది. వుదయంనించి రాత్రి పదకొండువరకు సీరియల్సు వస్తూనే వున్నాయి. ఇంత నాటకానుభవం వున్న మీరెందుకు సీరియల్స్‌లో నటించలేదు. ట్రై చెయ్యలేదా? ఇంట్రెస్ట్ లేదా?" మాలతి ఆసక్తిగా అడిగింది.

జవాబు చెప్పడానికి వంశీ కాస్సేపుటైమ్ తీసుకున్నాడు. "ఇంట్రెస్టుందండి.

కానీ ఇంటర్ పాసైనవాడు డిగ్రీ పాసవాలని, పోస్ట్‌గ్రేడ్యుయేట్ అవాలని ఆశపడ్డంలో తప్పులేదు. అలాగే, ఇన్ని డ్రామాలు వేశాక ఇన్ని ప్రైజ్‌లు పొందేక, టీవీ సీరియల్స్‌వల్ల ఎక్కువ పాప్యులార్టీ, కాస్త డబ్బులూ వస్తాయని తెలిశాక కూడా నేనెప్పుడూ టీవీ సీరియల్స్‌లో నటించలేదండీ. ఐ మీన్ నాకు అవకాశంమివ్వండి అని నేనెవర్నీ అడగలేదు. ఏ ప్రొడ్యూసరూ తనంతతానుగా నాకో ఛాన్స్ ఇవ్వలేదు. మళ్ళీ... ఈ ఊర్లో అందరికీ నా టాలెంట్ తెలుసండి"

"అంటే మీకు అవకాశాలు రాకపోడానికి కారణం మీ కృషిలోపమేనన్నమాట"

"కృషీ అంటే ఏంటి మీ ఉద్దేశ్యం? ఒక్కో ఆఫీస్‌కీ వెళ్లి ప్రొడ్యూసర్లకీ, డైరక్టర్లకీ నేను ఫలానా ఫలానా ఆర్టిస్టునండీ అన్చెప్పి నా సర్టిఫికేట్లు, నా బహుమతులూ చూపించాలనా?" ఈ ప్రశ్న అడిగేటప్పుడు అతని ఆత్మాభిమానం స్పష్టంగా ధ్వనించింది. మాలతికి అతని ఆత్మాభిమానం ఎంత పటిష్టమైందో అర్థమైంది.

"చూడండి, నాకీ ఏక్టింగ్ విషయం, అవకాశాలు రావడం విషయం ఇలాంటి వాటిల్లో పెద్దగా ప్రాక్టికల్ నాలెడ్జి లేదనుకోండి. కానీ 'ఏదీ తనంతతానై నీ దరికి రాదు, శోధించి సాధించాలి అదియే ధీర గుణం' పాట మాత్రం బాగా నచ్చిందండి. అందులో వున్న ప్రతీ వాక్యం జీవితాన్ని నడిపించడానికి ఉపయోగపడే కరదీపికలేనని నా ఉద్దేశ్యం. ఆ ప్రకారంగా కొంతమందికి అవకాశాలు వెదుక్కుంటూ వస్తాయి. అలాకాకుండా కొంతమంది ప్రతిభావంతులు అవకాశాల దగ్గరకెళ్లి అందుకుని రాణిస్తారు. నా వుద్దేశ్యం ఇవాల్టినించి మిమ్మల్ని అవకాశాల దగ్గరకి వెళ్లమనికాదు. నా క్లయింట్స్‌లో ఒకాయన టీవీ సీరియల్ తీస్తున్నాడట, రేపు మిమ్మల్ని ఇంట్రడ్యూస్ చేస్తాను. ఆయన్ని కూడా మీరేం రిక్వెస్ట్ చెయ్యక్కర్లేదు. ఆయనే మీకో మంచి వేషం ఇచ్చేలా మాట్లాడతాను". అంది మాలతి.

వంశీ ఆనందించాడు.

కళ్యాణి తల్లిగారి ఆరోగ్యం గురించి వాకబు చేసింది మాలతి.

"ఆవిడకి మరీ సీరియస్‌గా వుంటే నాకు టెలిగ్రామ్ ఇచ్చుండేది. లేదా మీకైనా ఫోన్ చేసుండేదికదా" అన్నాడు వంశీ.

మరో అయిదు నిమిషాలు మాట్లాడి మాలతి వెళ్లిపోయింది.

ఆ తర్వాత వంట చేసేటప్పుడు, రాత్రి పడుకునేటప్పుడు మాలతి మంచితనం గురించే ఆలోచించాడు. దినదినానికీ క్షీణిస్తున్న రక్తబంధాలకంటే పవిత్రమైన, పటిష్టమైన స్నేహబంధాల గురించి చాలాచక్కగా రాసిన నవల ఒకటి గుర్తొచ్చింది. మాలతి ఎవరు? తమ వీధిలోనే ఒంటరిగా

జీవిస్తున్న లాయర్! ఆ రెండు కుటుంబాల మధ్యనున్న పరిచయం వయసు కూడా ఒక నెల దాటలేదేమో! అయినా ఆవిడ తనని, కళ్యాణిని ఆత్మీయులుగానే చూస్తోంది. తనలో వున్న నటుడు అభివృద్ధి చెందడానికి సహాయం చేస్తానంది. ఆవుని అడిగినా అడక్కపోయినా పాలు ఇస్తూనే వుంటుంది. పాముని అడిగినా అడక్కపోయినా అది కాటు వేస్తూనే వుంటుంది. ఎవరి నైజం వారిది... ఇలా ఆలోచిస్తూనే అతను నిద్రలోకి జారుకున్నాడు.



వంశీ చాలా నెలల క్రితం అప్లై చేసిన ఫోన్ ఆ రోజు టెలికామ్ డిపార్ట్‌మెంట్ వాళ్లువచ్చి ఇన్‌స్టాల్ చేశారు. కనెక్షన్ సాయంత్రంగానీ రేపు ఉదయంగానీ ఇచ్చేస్తామని చెప్పి వెళ్లారు. అప్పుడే గనక కనెక్షన్ ఇచ్చుంటే మొట్టమొదటి ఫోన్ కళ్యాణికి చేసి మాట్లాడదామనుకున్నాడు. మళ్లీ అంతలోనే మరో సందేహం వచ్చింది. తనకి ఫోన్ వచ్చిన శుభ సందర్భంలో మొట్టమొదటి కాల్ విజయ్‌కి చెయ్యాలి. ఎందుకంటే తన జీవితంలో తొలిసారిగా పరిచయమై ప్రాణ స్నేహితుడిగా మారింది విజయ్ ఆ తర్వాత చాలా సంవత్సరాలకి కళ్యాణి వచ్చి జీవన నేస్తంగా మారింది. ఇద్దర్లో ఎవరికి ముందు చెయ్యాలి? ఓ రెండు నిమిషాలు ఆలోచించేక తన నెత్తి మీద తనే ఓ దెబ్బకొట్టుకున్నాడు. ఫోన్ కనెక్షన్ ఇంకా రానప్పుడు ఎవరికి ముందుగా ఫోన్ చెయ్యాలీ అనే ఆలోచనే పరమ సిల్లీగా కనిపించింది. ఇంటికి తాళం వేసి ఆఫీసుకెళ్లిపోయాడు. వెళ్లేదారిలోనే ఓ డిపార్ట్‌మెంటల్ స్టోర్ దగ్గర స్కూటర్ ఆపి లోపలకెళ్లాడు.

సిటీ కేబుల్లో న్యూస్ చదవడంవల్ల అతని ఫేస్ చాలామందికి గుర్తుండిపోయింది. ఆ షాప్ ప్రొప్రయిటర్ అతన్ని నవ్వుతూ ఆహ్వానించాడు. వంశీ మనసులోనే చాలా సంతోషించాడు. తనకో మీడియమ్ సైజ్ ఫ్రిజ్ ఇన్‌స్టాల్‌మెంట్ పద్ధతిలో ఇస్తారా అని అడిగాడు. ఇస్తామన్నాడు. ప్రస్తుతం స్టాకులేదు. వున్న రెండు ఫ్రిజ్‌లు ఆల్‌రెడీ బుక్ అయిపోయాయి కాబట్టి ఓ వారం పది రోజుల్లో పంపించగలనని చెప్పి మిగతా టెర్మ్స్ అండ్ కండీషన్స్ వివరించాడు. అన్నీ వంశీకి అనుకూలంగానే వున్నాయి. పైగా ఈమధ్య న్యూస్ రీడర్‌గా ఏర్పడిన ఫేస్ వేల్యూవల్ల ఆ ప్రొప్రయిటర్ గారు కాస్త డిస్కౌంట్ కూడా ఇచ్చాడు.

"సాధారణంగా ఇన్‌స్టాల్మెంట్స్‌లో ఇచ్చేటప్పుడు ఎవరికీ డిస్కౌంట్ ఇవ్వం సార్! కానీ మీకు కాబట్టి" అన్నాడు ప్రొప్రయిటర్.

"మీకు కాబట్టి" అనే మాట ఆ అల్ప సంతోషికి అనల్పమైన ఆనందం కలిగించింది.

వంశీ ఆఫీసుకెళ్లిన ఓ గంట తర్వాత కళ్యాణి ఆటోలోనించి పెట్టె పట్టుకు దిగింది. తన దగ్గరున్న డూప్లికేట్ తాళంతో తలుపు తీసి లోపలికెళ్లింది. ఇల్లంతా నీటుగానే వున్నా మరోసారి తుడుద్దామనుకుంది. కానీ పనిని వాయిదావేసి మంచం మీద పడుకుని నిద్రపోయింది. మధ్యాహ్నం మూడు గంటల సమయంలో

ఇంట్లో ఫోన్ మోగుతున్న శబ్దం వినిపించి మత్తుగా నిద్రపోతున్న కళ్యాణికి కొద్దిగా మెలకువొచ్చింది. అది తన ఇంట్లో వస్తున్న శబ్దం కాదనుకుంది. అది టెలిఫోన్ రింగ్ అవుతున్న శబ్దమే కానీ తనింట్లోనించి ఆ శబ్దం రావడం ఏవిటి? తనింట్లో ఫోన్ లేదే అనుకుంటూనే డ్రాయింగ్ రూమ్‌లోకొచ్చింది. ఆ ఫోన్ చూశాక "అయితే ఫోన్ వచ్చేసిందన్నమాట" అనుకుంటూనే వెళ్లి రిసీవర్ అందుకుంది. వంశీ ఆఫీసుకెళ్లే ముందు ఫోన్ ఫిట్ చెయ్యడంవల్ల దాన్ని ఎక్కడ పెట్టాలన్నది అతనింకా నిర్ణయించుకోకుండా దాన్నో మూలనున్న చిన్న బల్ల మీద పెట్టేసి వెళ్లిపోయాడు. కళ్యాణి ఫోన్ అందుకున్నాక అవతల్నించి టెలిఫోన్ డిపార్ట్‌మెంట్ నించి లైన్ ఇన్‌స్పెక్టర్ మాట్లాడుతూ, "ఫోన్‌కి కనెక్షన్ ఇచ్చేశాం మేడమ్" అంటూ తమ బాధ్యత తాము నిర్వర్తించేమని చెప్పి ఫోన్ పెట్టేశాడు. కళ్యాణి ఫోన్ దగ్గరకి ఓ కుర్చీలాక్కుని ఫోన్‌ని ఒడిలో పెట్టుకుని వైజాగ్ యస్.టి.డి చేసి తన తల్లిదండ్రులతో ఓ అరగంటసేపు మాట్లాడింది. తర్వాత ఎవరికి ఫోన్ చెయ్యాలా అని ఆలోచించి లాయర్ మాలతీదేవికి ఫోన్ చేసింది. కానీ ఆ ఇంట్లో ఎవరూ లేనట్టున్నారు, ఫోన్ లిఫ్ట్ చెయ్యలేదు. సెల్‌నెంబర్‌కి చేద్దామనుకుంది. కానీ ఆ సమయంలో ఆవిడ కోర్ట్ హాల్లో వుంటే అనవసరంగా డిస్టర్బ్ చేసినట్టవుతుంది. అందుకే ఆ ప్రయత్నం విరమించుకుంది. తాతారావుకి ఫోన్ చేద్దామనుకుంటే అతనికి ఫోన్ లేదు. ఆ వూళ్లో ఇంకా కొంతమంది తెల్సినవాళ్లున్నారుగానీ వాళ్ల నెంబర్లు తెలీవు. త్వరలో తెల్సుకోవాలనుకుంది. ఆకలి వెయ్యకపోవడంవల్ల వంట చెయ్యాలనే ఆసక్తి కలగలేదు. లోపలకెళ్లి రెండు బిస్కెట్లు తిని, మంచినీళ్లు తాగింది. చీపురుపట్టుకుని తుడవడం ఆరంభించింది.



సాయంత్రం వంశీ ఇంటికొచ్చేసరికి కళ్యాణి సోఫాలో సీరియస్‌గా ఆలోచిస్తూ శూన్యంలోకి చూస్తూ కూర్చుంది. ఆమె ఒక రోజు ముందుగానే వచ్చేసినందుకు అతనికి పరమానందం కలిగింది. "హలో కళ్యాణి! చెప్పిందానికంటే ఒకరోజు ముందుగా వచ్చేసినందుకు అయామ్ వెరీవెరీ హేపీ! అన్నట్టు మీ అమ్మగారికెలా వుంది?" అంటూ ఆమె పక్కనే కూర్చున్నాడు.

"బాగానే వుంది" మూడ్ మార్చకుండా ముక్తసరిగా అంది.

"థేంక్‌గాడ్! మనింటికి ఫోన్ వచ్చేసింది చూశావా? ఇంకో ఘడియకో గంటకో కనెక్షన్ కూడా ఇచ్చేస్తారు. కనెక్షన్ రాగానే ఫస్ట్‌ఫోన్ నీకు చెయ్యడమా, మా విజయ్ గాడికి చెయ్యడమా అని తెగ ఆలోచిస్తున్నాను. ఈలోగా నువ్వే వచ్చేశావ్" అంటూ ఆమెను అప్పుడు గమనించాడు. ఫోన్ వచ్చినందుకు ఆవిడ ముఖంలో సంతోషం రవ్వంత కూడా కనిపించలేదు.

"మనకి ఫోన్ రావడం నీకు సంతోషంగా లేదా?" ఆమెను నిశితంగా చూస్తూ అడిగాడు.

"మనింటికి ఫోన్ రావడం సంతోషం కాబట్టే కనెక్షన్ రాగానే మా ఇంటికి ఫోన్ చేసి మాట్లాడేను"

"అంటే కనెక్షన్ వచ్చేసిందన్నమాట. మరామాట చెప్పవేం? కనెక్షన్ రాగానే నాకు ఫోన్ చెయ్యాల్సింది"

"ఏం మా ఇంటికి ఫోన్ చెయ్యకూడదా?" అంటూ కాస్త కటువుగా ప్రశ్నించింది.

"భలేదానివే! ఎందుకు చెయ్యకూడదు! నిన్ను ముందుగా కనీపెంచిన వాళ్లు మీ పేరెంట్సు. ఆ తర్వాతే నువ్వు నా భార్యవయ్యేవు. వాళ్లకి ఫోన్ చెయ్యడమే కరక్టు. మంచిది కూడాను. సర్లెరి నీ చేత్తో కాఫీ తాగి చాలా రోజులయింది. ఒక్క కాఫీ ఇస్తే"

కళ్యాణి లేచి లోపలకెళ్లింది.

నిమిషం గడవకముందే కళ్యాణి వచ్చింది

కానీ ఆవిడ చేతిలో కాఫీ కప్పులేదు. ఓ చిన్న కాగితం పాకెట్ వుంది. దాన్ని టీపాయ్‌మీద పెట్టి అడిగింది "ఏవిటిది? "అని.

అతను పొట్లం విప్పి చూశాడు. రెండు సిగరెట్ పీకలు! ఇవెలా వచ్చాయి? తనా రోజు ఇల్లంతా శుభ్రంగా తుడిచేశాడే. బహుశా ఏ మూలో వుండిపోయుంటాయి. తను గమనించి వుండడు. "ఇవి నీకెక్కడ దొరికాయి? " నవ్వుతూనే అడిగాడు. కానీ ఆవిడ మాత్రం తన ప్రశ్నల పరంపరని సీరియస్‌గానే అడిగింది.

"మనింట్లోనే దొరికాయి! మీకు సిగరెట్లు కాల్చడం అలవాటు లేదని ఈ కొద్ది కాలంలోనే చాలాసార్లు చెప్పేరుకదూ? "

"అప్పుడే కాదు ఇప్పుడూ చెప్తున్నాను. నాకు సిగరెట్లు కాల్చడం కాదుగదా సిగరెట్ వాసన కూడా పడదు"

"మరీ సిగరెట్ ముక్కలు మనింట్లోకెలా వచ్చాయి? "

"అవి మా ఫ్రెండ్సు కాల్చినవి"

"వాళ్లతోపాటు మీరూ కాల్చలేదా? "

"నాకు ఆ పొగే పడదని చెప్తుంటే సిగరెట్లు కాల్చేరా, కాల్చేరా అంటూ పదేపదే అడుగుతావేం? నువ్వు నమ్మినా నమ్మకపోయినా నాకు అలాంటి దుర్వ్యసనాలేం లేవు"

కళ్యాణి అతన్నోసారి చూసి లోపలకెళ్లి బీరువాలో వున్న ఖాళీ విస్కీ బోటిల్ తీసుకొచ్చి టీపాయ్ మీదపెట్టింది.

"విస్కీ బోటిల్ మనింట్లోకెందుకొచ్చింది? " సీరియస్‌గా అడిగింది.

"ఓహో... ఇదా? ఇదికూడా మా ఫ్రెండ్సు తాగిందే! సీసా అందంగా వుందికదాని నేనేదాన్ని బీరువాలో దాచేను"

"ఎందుకు దాచారు? "

"ఫ్రిజ్‌లో వాటర్ బోటిల్‌గా పెట్టుకుందామని"

"ఫ్రిజ్ ఏదీ? "

"మరో పది పదిహేను రోజుల్లో వచ్చేస్తుంది"

"ఎప్పుడో కొనబోయే ఫ్రిజ్‌లో దాచడానికి ఇప్పట్నించీ ఈ బంగారాన్ని దాచి వుంచేరా? ఆ మాట నన్ను నమ్మమంటారా? "

"నమ్మక పోవడానికి నేనేం అబద్ధం చెప్పడంలేదుగా"

"అంటే మీరు మందు తాగలేదంటారు"

"తాగడమంటావేంటి? నాకా వాసన కూడా పడదు"

"నా మీద ప్రమాణం చేసి చెప్పండి"

"ఏవిటి కళ్యాణీ ఈ చాదస్తం? ఈ రోజుల్లో ప్రమాణాలనేవి కేవలం మొక్కుబడిగా చేస్తున్నవే! పెళ్లి సమయంలో వధూవరులచేత ప్రమాణాలు చేయించే తాళి ముడేయిస్తుంటారు. కానీ అలా ప్రమాణం చేసిన దంపతులు ఎంతమంది ఆ ప్రమాణానికి కట్టుబడి వుంటున్నారు? కోర్టులోని సాక్షులు భగవద్గీత మీద ప్రమాణం చేసి మరీ దొంగసాక్ష్యాలు చెప్పేస్తున్నారు. ప్రమాణాలు చేసి పదవుల్లో కొచ్చిన మంత్రులు, ప్రమాణస్వీకారం అయిన పది నిమిషాల్నించి పదవిని అడ్డం పెట్టుకుని ఎంత నొక్కేద్దామా అని చూస్తున్నారు"

"మీరు వెధవ లెక్చర్లన్నీ ఇచ్చి నాకు బోర్ కొట్టించకండి. వాళ్లెవరో ప్రమాణాల్ని అధిగమిస్తే నాకెందుకు? నేనడుగుతున్నది మీ గురించి"

"సరే విను! మా ఫ్రెండ్సు ఇక్కడకోరోజు వచ్చారు. సరదాగా పేకాట ఆడుతూ సరదాగా మందు తాగారు"

"పేకాట కూడా ఆడేరా? "

"వాళ్లు ఆడేరు. నేను ఆడలేదు. ఆడ్డం నేర్పిస్తామన్నారు. నాకు నేర్చుకునే వుద్యేశ్యం లేదన్నాను. నా మటుకు నేను నవల చదువుతూ కూర్చున్నాను"

"నేన్నమ్మను"

"కావాలంటే విజయ్‌ని అడుగు"

"అతను కూడా పేకాట ఆడేరా? "

"అంటే... అదీ... అదీ"

"ఆయన కూడా మందు తాగారా? అతని గురించి అడిగితే మీరు నీళ్ల నములు తారేం?"

వంశీ చాలా దారుణమైన ఇబ్బందిలోపడ్డాడు. కళ్యాణి సీరియస్‌గా క్రాస్ ఎగ్జామిన్ చేస్తూ తననో నేరస్థుణ్ణి చేసి మాట్లాడుతుంటే సాక్ష్యంకోసం విజయ్ పేరు చెప్పేశాడు. కానీ విజయ్ ఇక్కడకొచ్చి పేకాట ఆడి, మందు తాగేడంటే కళ్యాణి నమ్మదు. ఒకవేళ నమ్మించినా నిజానిజాల వెరిఫికేషన్ కోసం సరాసరి విజయ్ ఇంటికెళ్లొచ్చు, రజనీని ప్రశ్నించొచ్చు దాంతో ఆ భార్యాభర్తలమధ్య తగవులు, గొడవలు, ఘర్షణలు చెలరేగొచ్చు! తన ప్రాణ స్నేహితుడికి తను



చేసే ప్రత్యుపకారం వాళ్ల కాపురంలో కల తలు రేపడమే అవుతుంది.

"మాట్లాడరేవిటి? ఏంటి ఆలోచిస్తున్నారు? " కళ్యాణి గద్దిస్తూ అడిగింది.

"అబ్బే ఏం లేదు కళ్యాణీ! నువ్వు కోర్టులో లాయర్‌లా నన్ను క్రాస్ ఎగ్జామిన్ చేసేసరికి నేను వుక్కిరిబిక్కిరైపోయి కంగారులో విజయ్‌ని అడుగూ అనేశానుగానీ పాపం వాడిని అడిగితే వాడికేం తెలుస్తుంది? ఆరోజు మనింటికొచ్చినవాళ్లు మా కొలీగ్స్! ఆ



రోజు అసలు విజయ్ ఇక్కడికి రానేలేదు"

కళ్యాణి ఏం అనుకుందో ఏమోగానీ ఆ టాపిక్కుని పొడిగించకుండా తమాయించుకుని వంశీకి కాఫీ చేసిచ్చింది. ఓ అరగంట తర్వాత వంశీ విజయ్‌కి ఫోన్ చేసి తనకి ఫోన్ వచ్చేసిందన్న విషయం చెప్పి తన నెంబర్ ఇచ్చేడు. "ఏంట్రా విశేషాలు? మీ ఆవిడ వూర్నించి వచ్చేసిందా? మీ ఇంట్లో మేం తాగిన మందు గురించి, ఆడిన పేకాట గురించి ఆరా తీసిందా? " అని అడిగేడు విజయ్. కానీ కళ్యాణి అక్కడే వుండడంవల్ల ఏవేవో పొడిపొడిగా మాట్లాడి ఫోన్ పెట్టేశాడు. కాకపోతే మాటల మధ్యలో కళ్యాణి వూర్నించి వచ్చేసిందని మాత్రమే చెప్పేడు. ఒకవేళ ఇంకా కళ్యాణికి అనుమానం తీరక విజయ్‌కి ఫోన్ చేసి వెరిఫై చేసినా పర్వాలేదు. ఎందుకంటే వాడు అడిగిన ప్రశ్నల్లో ఒక్కదానికి తప్ప మిగతా వాటికి సమాధానాలు దాటవేశాడు.

కాబట్టి ఇక్కడ ఏం జరిగిందో వూహించుకోగలడు. వాడికి నోరు విప్పితే అబద్ధాలు, బుర్ర విదిలిస్తే అయిడియాలు వస్తాయి కాబట్టి వాడే ఏదోవిధంగా మాటలతో మేనేజ్ చేస్కోగలడు. పైగా మరో అరగంటలో వెళ్లి విజయ్‌ని ఎలాగూ కలుస్తాడు కాబట్టి ఈలోగా ఏ కొంపలూ మునిగిపోవన్న నమ్మకంతోనే బయటకెళ్లాడు.

అతను వెళ్లాక కళ్యాణి ఫోన్ డయల్ చేసింది. ఆ ఫోన్ విజయ్‌కీ కాదు, అతని భార్య రజనీకీ కాదు, లాయర్ మాలతికి. ఆమె అప్పుడే కోర్టునుంచొచ్చి ఫోన్ అందుకుంది.

"మీకు అర్జంట్ పనేమీ లేకపోతే నేనే మీ ఇంటికొచ్చి మాట్లాడతానండి" అంది కళ్యాణి.

"మీకంటే నాకున్న పనులేవీ ముఖ్యం కాదు. మీరు రావచ్చు. యూ ఆర్ వెల్కమ్" అంటూ ఎంతో గౌరవంగా ఆహ్వానించింది మాలతి.

కళ్యాణి మాలతి ఇంటికి వెళ్లి కాఫీలు తాగి ఆ ముచ్చట ఈ ముచ్చట చెప్పుకున్న తర్వాత కావాలనే వంశీకృష్ణ టాపిక్ ప్రస్తావించింది. వంశీ చెప్పినవన్నీ అబద్ధాలేనని చెప్తూ "మీరేమో సుఖ సంసారానికి నమ్మకమే పునాదీ అన్నారు. బహుశా అదే నిజం కాబోలుననుకున్నాను. కానీ ఆ నమ్మకం ఒక్క భార్యవైపునించి వుంటే సరిపోతుందా? లేక భర్తవైపునించి కూడా వుండాలా? " అని సూటిగా అడిగింది.

"డెఫినెట్‌గా వుండాలి కళ్యాణిగారూ! చప్పట్లు కొట్టాలంటే రెండు చేతులూ కలవక తప్పదు. గాల్లో ఒక్క చేతిని ఆడిస్తే శబ్దం రాదుగా! ఇంతకీ మీరీ విషయాన్ని ఎందుకడిగేరు? " చాలా ఆసక్తిగా అడిగింది మాలతి.

కళ్యాణి, తను వూళ్లో లేనప్పుడు వంశీ మందు తాగి, పేకాట ఆడిన విషయం వివరించింది.

"నేనో హరిశ్చంద్రుణ్ణి, రామచంద్రుణ్ణి అంటూ ఆయనంతటాయనే మొదటి రాత్రినించి ఇప్పటిదాకా అనేకసార్లు చెప్పారు. ఆయన నడత, నడవడికలను గుర్తించి నేను అనుకోవలసిన మాటని ఆయనకి ఆయనే చెప్పారు. ఆయన భోళామనిషి కాబట్టి అలా చెప్పారనుకున్నాను. భార్యాభర్తల మధ్య దాపరికాలుండకూడదు. ఒకర్తో ఒకరు అబద్ధాలాడుకో కూడదూ అన్నారు. అలా వుంటే ఏ పొరపొచ్చాలూ వుండవు కదాని నేనూ సంతోషించాను. కానీ ఆయన వృత్తపుణ్యానికి అబద్ధాలాడేస్తున్నారు. నేను పిచ్చి కొయ్యననుకుంటున్నారో ఏమో... ఆయన చెప్పింది అబద్ధమని నిరూపణయిపోయింతర్వాత కూడా అడ్డంగా దబాయించేస్తున్నారు. నిప్పులేనిదే పొగరాదంటారుగదండి. ఆయనేమో తనకు తాగుడూ, జూదం, స్మోకింగ్ లాంటి దుర్వ్యసనాలు లేవని పదేపదే చెప్పారు. కానీ నేను లేనప్పుడు మా ఇంట్లోనే పేకాట ఆడేనని

ఆయనే చెప్పారు. ఆయన తాగలేదని చెప్తున్నా ఇంట్లో ఖాళీ విస్కీసీసా కనిపించింది. ఆ సీసా ఎందుకుందీ అంటే ఎప్పుడో కొనబోయే ఫ్రిజ్‌లో వాటర్ బోటిల్‌గా పెట్టడానికీ అని చెప్పేరు. ఆ మాటనెవరు నమ్ముతారు చెప్పండి? అయినా నాతో అలా చెప్పేరంటే నేను ఆయన దృష్టిలో ఎంత తెలివి తక్కువ దద్దమ్మగా కనిపించుండాలి? కాల్చి పారేసిన సిగరెట్ ముక్కల్ని చూపించినా అవి అతని స్నేహితులు కాల్చి పారేసినవే తప్ప తను కాల్చినవి కావంటూ దబాయించారు. మందు, పేకాట, స్మోకింగ్ అలవాటున్న వ్యక్తికి, అందులోనూ నాటకాల్లో తిరిగే మనిషికి పరస్త్రీ వ్యసనం వుండడానికి ఎంతైనా ఆస్కారం వుంటుందిగదా! ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే చనిపోయిన మా చిన్నాన్న జీవితానికీ ఈయన నడుస్తున్న విధానానికీ చాలా దగ్గర పోలికలు కనిపిస్తున్నాయండి. ఆయన నాటకాలు, తాగుడు, పేకాట, పరస్త్రీ వ్యామోహం... ఈ నాలుగు వ్యసనాల వల్లే భ్రష్టుడై ఎవరి జాలికీ నోచుకోకుండా చనిపోయాడు. అతని భార్యా పిల్లలు వీధినపడ్డారు"

కళ్యాణి కళ్లంట నీళ్లు సుళ్లు తిరిగాయి. ఇంకా ఇంకా చెప్పాలనుకుంది కానీ బాధతో బరువెక్కిన గుండె గొంతుక్కి అడ్డంపడడం వల్ల చెప్పలేక ఆగిపోయింది.

కళ్యాణి చెప్పిన మాటల్ని స్థంభానికి ఆనుకుని పనిమనిషి నాగరత్నం కూడా వింటోందని గమనించిన మాలతి రెండు క్షణాలు ఆలోచించి ఆవిణ్ణి దగ్గరగా పిలిచి "ఈ పూటకి నువ్వు ఇంటికెళ్లిపో నాగరత్నం" అంది.

"ఇంకా వంటవలేదు మేడమ్" అంది నాగరత్నం ఇంకా అక్కడే వుండాలన్న అభిలాషని వ్యక్తం కానివ్వకుండా.

"ఈ పూటకి నేను వంట చేసుకుంటాన్లే నువ్వెళ్లు"

"వంటయ్యాక సూపర్‌మార్కెట్ కెళ్దామన్నారు కదండి"

"రేపు వెళ్దాం.. నువ్వెళ్లొచ్చు"

నాగరత్నం అయిష్టంగానే అక్కడనించి నిష్క్రమించింది. మాలతి ఆమెను కావాలనే అక్కడనించి పంపించేసిందని కళ్యాణి చాలా సులభంగానే గ్రహించింది.

"బహుశా నేను రావడంవల్ల మీ ప్రోగ్రామ్‌కి అవాంతరం కలిగించినట్టున్నాను" అంది.

"లేదండి... మీరు మనసు విప్పి మీ కుటుంబ సమస్యని నాతో చెప్తున్నారు. అది నా వరకూ పర్వాలేదు. కానీ నాగరత్నం వింటే ఈ విషయం మరొకర్తో చెప్పొచ్చు. అందువల్ల ఆవిడకి కలిగే ప్రయోజనం ఏదీ వుండదు. కానీ మీరు నలుగురికీ చులకనవుతారు. అది నాకు ఇష్టం లేకే పంపించేశాను" అంది మాలతి శాంత గంభీరస్వరంతో.

ఆవిడ మంచితనాన్ని కళ్యాణి అర్థం చేసుకున్నా థాంక్స్ అంటూ కృతజ్ఞతలు చెప్పలేకపోయింది. మాలతి లేచి ఏదో ఆలోచిస్తూ అటూ ఇటూ తిరుగుతోంది. ఆమె లేచాక తను లేవకపోతే బాగోదేమోనని కళ్యాణి కూడా లేవబోయిందిగానీ ఆమెను లేవద్దన్నట్టుగా మాలతి సైగచేసింది. ఓ రెండు మూడు నిమిషాల తర్వాత మాలతి మెల్లగా గొంతు విప్పింది.

"మీరు చెప్పిందంతా విన్నాను. నేనిపుడు మిమ్మల్ని సమర్థించి మాట్లాడ్డం లేదు. మీ ఆయన్ని సమర్థించి మాట్లాడ్డం లేదు. మనుషుల మనస్తత్వాల్ని గురించి మాత్రమే ముందు మాట్లాడతాను. మనం పగటివేళ నల్ల కళ్లద్దాలు పెట్టుకుంటే మన చుట్టూ వున్న ప్రపంచం మనకి నల్లగా కనబడుతుంది. ప్రపంచానికంతా వెలుగునిచ్చే సూర్యుడు కూడా మసిబారినట్టే కనిపిస్తాడు. అవే కళ్లద్దాల్ని తీసేసి చూస్తే మనం నలుపు అనుకుంటున్నది నలుపు

కాదు తెలుపు అని మనకే తెలుస్తుంది"

ఆవిడ తననే తప్పు పడుతోందనుకుని కళ్యాణి తనకున్న సహజమైన తొందరపాటుతనాన్ని ప్రదర్శిస్తూ "మాలతి గారూ నేను అనుమానం అనే నల్లకళ్లద్దాలు పెట్టుకుని తెలుపుని చూస్తూ నలుపు అని భ్రమ పడ్డంలేదు. స్పష్టమైన రుజువులూ ఆధారాలూ చూసింతర్వాతే ఆయన్ని సందేహించాను"

"అదే.. అదే.. ఆ సందేహమే.." అంటూ ఏదో చెప్పబోయింది మాలతి.

"ప్లీజ్ నన్ను చెప్పనివ్వండి. 'మనిషికి ఒంటరితనం లభించినప్పుడు తుంటరి బుద్ధులు పుడతాయండీ' అని ఓసారి అన్నాను. నిజానికి అది నేనన్న మాట కాదు. ప్రాచీన కాలంనించి పెద్దవాళ్లు చెప్పినమాటే! మన ఇండియన్స్ మాత్రమే కాదండి, 'ఐడిల్ మాన్స్ బ్రెన్ ఈజ్ ద డెవిల్స్ వర్క్‌షాప్' అని ఇంగ్లీషులో ఓ సామెత వుందికదా! ఈ సామెత ముఖ్యంగా మగాళ్లకి వర్తిస్తుంది. నలుగుర్తో వున్నప్పుడు పెద్దమనిషిలా ప్రవర్తించిన వారెంతో మంది ఒంటరిగా వున్నప్పుడు తుంటరి పనులు చేస్తుంటారని మా నాన్నగారు అనుభవంతో చెప్పేరండి. ఆయన రిటైర్డ్ పోలీస్ ఇన్‌స్పెక్టర్ అని మీకు లోగడే చెప్పేనుకదా! కానీ మీరు ఒంటరితనం మనిషి చేత ఏ తప్పూ చేయించలేదని చెప్తూ మీ ఆయన గార్ని ఉదాహరణగా పేర్కొన్నారు. తప్పు చేయిస్తుందీ అని చెప్పడానికి మా ఆయనే ఓ ఎగ్జాంపుల్! మీ ఆయనగారు నాటకాలూ, గీటకాలూ అంటూ అలాంటి వ్యవహారాల జోలికి వెళ్లరు కాబట్టి ఆయన మీతో వున్నప్పుడు లేనప్పుడు గూడా జెంటిల్మేన్‌గానే వుండగలుగుతున్నారు. కానీ మా ఆయన నేనున్నప్పుడు ఒకలాగ లేనప్పుడు మరొకలాగ ప్రవర్తిస్తున్నారు" కళ్యాణి ఆగి, ఇంక మీరు చెప్పొచ్చన్నట్టుగా చూసింది.

మాలతి ఆవిడ చెప్పిన మాటల్లోని అక్షరం అక్షరం జాగ్రత్తగా విని తన కళ్లజోడుని సవరించుకుంది.

"మీరు వూరి కెళ్లినరోజు సాయంత్రం నేను మీ ఇంటికొచ్చేను. అదీ మీరు వూరికెళ్లేరని తెలీక"

కళ్యాణి కాస్త వులికిపడి "ఆరోజు మీరొచ్చేరా? " అడిగింది.

"వచ్చేనండి. మీరున్నారనుకుని వచ్చాను"

"అబ్బే! నేనున్నానా లేనా అని కాదండి ఒకవేళ లేకపోతే మాత్రం రాకూడదేంటి గానీ మీరారోజు సాయంత్రం మా ఇంటికొచ్చేరా? " చాలా చాలా ఆసక్తిగా అడిగింది.

"వచ్చేను"

"అప్పుడాయన సిగరెట్లు కాలుస్తున్నారా? మందు తాగుతున్నారా? పేకాటాడుతున్నారా? "

"లేదు ఆయన కొలీగ్స్ పేకాడుతున్నారు, స్మోక్ చేస్తున్నారు. మందు మాత్రం తాగడం లేదనుకుంటాను. నేను బయట వరండాలో నిలబడి మాట్లాడేనుకాబట్టి ఇంతకంటే క్లియర్‌గా నాకేమీ కనబడలేదు"

"అయితే మీరు వెళ్లేక డ్రింక్ మొదలెట్టుంటారు"

"కావచ్చు"

"అప్పుడు మా ఆయనా తాగుండొచ్చు"

"తాక్కపోయి కూడా వుండొచ్చుగా!"

కళ్యాణి మాలతిని వంశీకృష్ణ తరపు లాయరా అన్నట్టుగా చూసింది. ఆవిడ చూసిన చూపుని అర్థం చేసుకున్న మాలతి చెప్పదలుచుకున్నది మాత్రం చెప్పింది.

"ప్రతీ మనిషిలోనూ, రెండో మనిషి వుంటాడు. అంటే సభ్యసమాజానికి కనిపించే మనిషొకరు, అంతరాంతరాల్లోనే మసలుకునే మనిషి మరొకరు! మొదటి మనిషి భౌతికంగా కంటికి కనిపిస్తాడు. మాట్లాడతాడు. పనులు చేస్తాడు. కానీ రెండో మనిషి కంటికి కనబడడు, మాట్లాడడు! కానీ మొదటి మనిషి చేసే చేతల్ని నిర్దేశిస్తాడు. అయితే ఆ రెండో మనిషి చెడ్డ

వాడు, ఇతరులకి అపకారం చెయ్యనివాడైతే ఏ గొడవలూ రావు. కానీ మొదటి వాడు ఒకలాగ రెండోవాడు మరొకలాగ ఆలోచించినప్పుడే అతని మాటలకీ చేతలకీ పొంతన కనిపించదు. చూడండి నేను మీ ఇద్దర్లో ఏ ఒక్కర్నీ సమర్థించి మాట్లాడ్డం లేదు అని మొదటే చెప్పాను"

"నాక్కాస్త అర్థమయేలా చెప్పండి" కళ్యాణి మాటల్లో వ్యంగ్యం లేదు.

"మీ ఆయనకి వ్యసనాలున్నాయా? "

"వున్నాయి"

"లేవని నేనంటాను మీరేమంటారు? "

"మీరు ఆయన్ని సరిగా స్టడీ చెయ్యలేదు కాబట్టి ఆయన గురించి తెలీదుకాబట్టి అలా అంటున్నారు అని అనుకుంటాను"

మాలతి టీపాయ్‌వైపు చూసింది. అక్కడ గాజుగ్లాసుతో నీళ్లున్నాయి. ఆ నీళ్లలో సగం ఇందాకే తాగేసింది. ఆ గ్లాసుని చేతిలోకి తీసుకుంది.

"ఈ గ్లాసులో ఏం వుంది కళ్యాణిగారూ? "

"కనబడుతున్నాయిగా"

"కనబడుతున్న వాటినే మీ మాటల్లో చెప్పండి"

"సగం వరకు నీళ్లున్నాయి"

"కాదు సగం వరకు నీళ్లు లేవు అని నేననుకుంటున్నాను"

కళ్యాణి కొన్ని క్షణాలపాటు కన్ఫ్యూజ్ అయి "సగం నీళ్లున్నాయీ అన్నా సగం నీళ్లు లేవూ అన్నా రెండూ ఒక్కటే కదండి" అంది.

మాలతి చిన్నగా నవ్వింది. "దేర్‌యూ ఆర్! మీ మాటా కరక్టే నా మాటా కరక్టే! సగంవరకు నీళ్లుండడం మీరు చూశారు. దటీజ్ ఆప్టిమిజమ్. అంటే ఆశావాదం! సగంవరకు నీళ్లు లేకపోవడం నేను చూశాను. దటీజ్ పెసిమిజమ్ అంటే నిరాశావాదం. ఈ గ్లాసులోని నీళ్ల విషయంలో మీది పాజిటివ్ థింకింగ్ నాది నెగిటివ్ థింకింగ్. కానీ మీరు మీ లైఫ్ పార్టనర్ గురించి నెగిటివ్ తింకింగ్‌తోనే చూస్తున్నారు. నేనో మాట చెప్తాను. అది సలహాయే అనుకోండి, సుభాషితమే అనుకోండి. మనం ఏ మనిషి గురించైనా మొదట పాజిటివ్‌గానే ఆలోచించడం మంచిది. తర్వాత అతన్లో చెడుగుణాలు, లక్షణాలు కనిపిస్తే అతన్ని దూరంగా వుంచొచ్చు. కానీ ఓ మనిషిని చూసీ చూడగానే వాడో దొంగవెధవ, దగుల్బాజీ అని అనేసుకున్నామనుకోండి.

ఆ తర్వాత ఆ మనిషి నిల్చున్నా కూర్చున్నా మనకి తప్పులాగే కనిపిస్తుంది. ఆ మనిషి ఓ బిచ్చగాడికో రూపాయి ధర్మం చేస్తుండగా మనం చూసినా అతను ధర్మం చేస్తున్నాడని మనం అనుకోం. బిచ్చగాడి పళ్లెంలోనించి ఓ రూపాయి దొంగతనం చేస్తున్నాడనుకుంటాం. ఎందువల్లంటారు? మనం ఆల్ రెడీ ఆ మనిషి మీద ఓ దురభిప్రాయాన్ని ఏర్పరిచేసుకున్నాం కాబట్టి"

కళ్యాణి కాస్త సందిగ్ధంలో పడింది. మాలతి తన వ్యక్తిత్వాన్ని తక్కువ అంచనా వేసి మాట్లాడ్డం లేదు కదాన్న సందేహం కలిగి "అంటే నేను ఆల్ రెడీ ఓ దురభిప్రాయాన్ని ఏర్పర్చుకున్నానంటారా? అలాగైతే నాకు దొరికిన ఆధారాల సంగతేంటంటారు? " అని అడిగింది.

"ఏ ఆధారాలు దొరికాయి? ఖాళీ విస్కీ సీసా దొరికింది. కానీ అందులోని మందు ఆయనే తాగాడని మీరు చెప్పగలరా? మీరు చూశారా? లేదు. పోనీ అతను తాగ్గా చూసినవాళ్లెవరయినా చెప్పారా? లేదు. అలాంటప్పుడు అతను తాగలేదని చెప్పిన మాటనే మనం నమ్మాలి, తప్పదు. మిగిలిన పేకాట, స్మోకింగ్ విషయాల్లో కూడా అతను చెప్పిందే నమ్మాలి. బికాజ్ దేర్‌ఆర్ నో ఎవిడెన్సెస్! జరిగేయనుకుంటున్న సంఘటనలకే ఆధారాలు, సాక్ష్యాలు లేనప్పుడు రేపెప్పుడైనా అతను పరస్త్రీ వ్యామోహంలో పడతాడేమోననే వూహకి అసలు

అర్థం వుండదుగా! పోనీ నిందితుడి పూర్వ చరిత్రనిబట్టి ఓ అంచనా వేద్దామనుకున్నా గతంలో అతని మీద ఎటువంటి బేడ్ రిపోర్ట్స్ లేవు సో... నా సిన్సియర్ ఎడ్వయిజ్ ఏంటంటే ముందు మీరు మీ ఆయన్ని గురించి కానివ్వండి, నా గురించి కానివ్వండి, మరొకరి గురించి మరొకరి గురించి కానివ్వండి పాజిటివ్ థింకింగ్ అలవర్చుకోవడం మంచిది. ఇలా అన్నానని మీరు మరోలా అనుకోకండి. సపోజ్ నా గురించే తీసుకుంటే మీరేదో మీ ఫేమిలీ ప్రాబ్లమ్ చెప్పడానికొస్తే సాటి ఆడదానిగా మిమ్మల్ని సపోర్ట్ చేస్తూ మాట్లాడకుండా ఏదో క్లాస్ కండక్ట్ చేసి పంపేస్తోందీ అని అనుకుంటే రేపట్నించి మీకు నా దగ్గరకి రావాలనిపించదు. ఒకవేళ వచ్చినా ఏదో ఆ మాటా యీమాటా చెప్పి వెళ్లిపోతారు తప్ప మనసు విప్పి మాట్లాడరు. దయచేసి అలా మాత్రం చెయ్యకండి" అంటూ మాలతి నవ్వింది.

కళ్యాణి కూడా నవ్వి ఆ ఇంటినించి బయటకొచ్చేసిందిగానీ ఆవిడ మనస్ఫూర్తిగా నవ్వలేదన్న విషయం ఎవరికీకాదు ఆవిడకే బాగా తెలుసు. మాలతి న్యాయశాస్త్రం చదివినందువల్ల ఆవిడకి బిఎల్ డిగ్రీ వచ్చింది గానీ ఆవిడకున్న లైఫ్ స్టడీని ఏ డిగ్రీలతోనూ కొలవలేం అనుకుంటూనే ఇంటికి చేరుకుంది. వంట పని యాంత్రికంగా చేస్తోందిగానీ మనసు మాత్రం మాలతి చెప్పిన మాటల్నే పదేపదే ఆలోచిస్తోంది.

★ ★ ★

పార్క్‌లో కూర్చుని విజయ్, వంశీకృష్ణ బఠాణీలు తింటూ ఓ అరగంటనించి మాట్లాడుకుంటున్నారు. వంశీ తన ఇంట్లో జరిగినదంతా వివరించాడు.

అంతా విన్నాక "నువ్వు చెప్పిందంతా మీ ఆవిడ నమ్మిందా?" అని ప్రశ్నించాడు విజయ్. "నమ్మకపోడానికి నేను అబద్ధం చెప్పానా? నిజమేకదా చెప్పాను"

"నువ్వు చెప్పేవులేవోయ్. నేను అడిగింది అది కాదు, మీ ఆవిడ నమ్మిందాని?"

"నిజం చెప్పినప్పుడు నమ్మాలిగా"

"ఆనాడు రాధ విషయంలో కూడా నిజమే చెప్పావు. కానీ ఆవిడ నమ్మలేదుగా! ఆవిడ ప్రశ్నలంటే మార్చి మార్చి అడిగింది కానీ, నిన్ను డౌట్ చెయ్యడంలో ఏ మార్పూ కనిపించలేదు. గుడ్డిలో మెల్ల ఏంటంటే ఆరోజు నేను మీ ఇంటికి రాలేదని చెప్పడం"

"నీ శ్రేయస్సు కోసమే అలా చెప్పాను. నువ్వన్నా, మీ మిస్సెస్సన్నా మా ఆవిడకో నమ్మకం. అందుకే ఆవిడ దృష్టిలో నువ్వు చెడ్డ కావడం నాకిష్టం లేదు"

"థాంక్స్‌రా! కానీ మీ ఆవిడ దృష్టిలో నాకో గౌరవం వుందన్నావు కాబట్టి చెప్తున్నాను. నేనారోజు మీ ఇంటికొచ్చానని చెప్తుంటే కాస్త బెటర్‌గా వుండేదేమో"

"ఎలా?"

"నేనారోజు మీ ఇంటికొచ్చేనుగానీ, నేనూ నీలాగే ఓ నవల చదువుకుంటూ కూర్చున్నానని చెప్పుంటే నువ్వు కూడా బుద్ధిగా కూర్చున్నావని నేనో సర్టిఫికేట్ ఇచ్చుండేవాణ్ణి. ఆవిడా ఏ డౌటూ లేకుండా నమ్ముండేది"

వంశీ కాస్సేపు ఆలోచించాక "నిజమేరా, నాకా అయిడియా అప్పుడు తట్టలేదు. అయినా ఓ నిజాన్ని నమ్మడానికి ఓ అబద్ధం సపోర్టుగా వుండాలంటావా?" అంటూ మళ్ళీ తన ధోరణిలోనే సందేహాన్ని వ్యక్తం చేశాడు.

"ఒక్కో సీజన్‌లో ఒక్కో వస్తువు బాగా సేల్ అవుతుంది. వేసవికాలంలో కూల్ డ్రింక్సు సేల్ అయినంతగా శీతాకాలంలో సేల్ అవవు. అలా అవకపోవడం కూల్ డ్రింక్సు తప్పు కాదు. ఆ సీజన్‌లో మనకి వాటి అవసరం వుండదు. అలాగే ప్రస్తుత కాలంలో లౌక్యం ఉపయోగపడినంతగా నిజాయితీ ఉపయోగపడలేదు. అయినా నీకొచ్చిన సమస్య ఎవరో తెచ్చిపెట్టింది

కాదు. నీకు నువ్వే తెచ్చుకుంటున్నావు. ఆ ఖాళీసీసా ముందు ముందు ఉపయోగపడుతుందని భద్రంగా దాచేవు. కానీ అదే నీపాలిటి సమస్యగా మారింది. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. రేపట్నించి ఏ విషయంలోనైనా నిజం చెప్పొద్దు, అబద్ధమాడొద్దు"

విజయ్ చెప్పింది వంశీకి అర్థం కాలేదు. నిజం చెప్పకుండా అబద్ధమాడకుండా ఎలా వుండాలో అర్థం కాలేదు. అదే విషయాన్ని అడిగితే, "నువ్వూ, నీ భార్య ఎక్కడికో వెళ్తున్నారనుకో, అప్పుడు మీకో అందగత్తె ఎదురుపడిందనుకో, ఆవిడ చ్చాలా అందంగా వుందీ అని నిజం చెప్పకు. మీ ఆవిడ మెప్పుకోసం ఆ అమ్మాయి నీ ముందు దిష్టి బొమ్మలా వుందీ అని అబద్ధం చెప్పకు. సైలెంట్‌గా వూరుకుంటే ఏ గొడవా వుండదు" అన్నాడు విజయ్! ఇద్దరూ పార్కునించి బైటకొచ్చారు.



ఆ రాత్రి కళ్యాణి, వంశీకృష్ణ ఒకే మంచంమీద పడుకున్నా ఇద్దరి ఆలోచనలు మాత్రం ఒకే రూట్‌లో ప్రయాణించడం లేదు. "పాజిటివ్ థింకింగ్ అలవర్చుకో" అంటూ మాలతి చెప్పిన సలహా గురించి కళ్యాణి ఆలోచిస్తుంటే "నిజం చెప్పకు, అబద్ధమాడకు" అని విజయ్ చెప్పిన విషయం గురించి వంశీ ఆలోచిస్తున్నాడు. అలా ఇద్దరూ ఆలోచనల వెంట నడుస్తూ నడుస్తూ మధ్యలో ఎక్కడో అలిసిపోయి నిద్రలోకి ఒరిగిపోయారు.

మర్నాడు ఉదయం తాతారావు వచ్చాడు. అప్పటికింకా వంశీ ఆఫీసుకి బయలుదేరలేదు. కళ్యాణి "టిఫిన్ చేశారా బాబాయ్?" అని అడిగింది.

"చేశారా అని అడుగుతున్నావా? చేస్తారా అని అడుగుతున్నావా? నేను చేస్తే ఏవిటి? చెయ్యకపోతే ఏవిటి? చూస్తూ చూస్తూ నన్నిక్కడ కూర్చోబెట్టి, మీ మట్టుకు మీరు తినెయ్యలేరుకదా! నాకూ పెట్టు, తినకపోతే తిట్టు" అంటూనే టిఫిన్ తింటానికి రెడీ అయిపోయాడు. టిఫిన్ తింటూ ఆ ఇంటికి ఫోన్ వచ్చిందన్న విషయం తెల్సుకుని మహదానందపడిపోయాడు. అది ఎరువు తీసుకెళ్ళి వాడుకునే వస్తువుకాదు కాబట్టి ఎరువు అడగలేదు. గబగబ టిఫిన్ ముగించి జేబులోనించి ఓ రెండు కాగితాలు తీసి ఫోన్ దగ్గర కూర్చున్నాడు. "మీరేం అనుకోకపోతే ఓ పదీ, పదిహేను ఫోన్‌లు కొట్టుకుంటాను" అన్నాడు.

అన్ని ఫోన్లు ఎవరికండి?" అని అడక్కుండా వుండలేకపోయాడు వంశీ.

తన చేతిలో వున్న రెండు కాగితాల్ని వంశీకి చూపించాడు. అందులో సినిమా ఆర్టిస్టులు అక్కినేని నాగేశ్వరరావు దగ్గర్నించి, చిరంజీవి, నాగార్జున వగైరా వగైరా హీరోల ఫోన్ నెంబర్లు ఓ కాగితంలోను, కొంతమంది కేబినెట్ మినిష్టర్ల ఫోన్‌నెంబర్లు మరో కాగితంలోను రాసున్నాయి. "ఈ సినిమా హీరోలందరికీ ఫోన్లు చేస్తారా?" అన్నాడు వంశీ ఆశ్చర్యంగా.

"చేద్దామనే ఆ హీరోల ఫోన్‌నెంబర్లు, మినిష్టర్ల ఫోన్ నెంబర్లు కష్టపడి మరీ సంపాదించాను. కానీ ఫ్రీగా ఫోన్ దొరక్క

ఫోన్లు చెయ్యలేదు"

"వీళ్ళందరూ మీకు తెలుసా? " కళ్యాణి ఆశ్చర్యంగా అడిగింది.

"వాళ్లు నాకు బాగా తెలుసు. కానీ నేనే వాళ్ళకి తెలీదు" తాతారావు వెకిలిగా నవ్వుతూ అన్నాడు.

"తెలీనప్పుడు వాళ్ళకెందుకు ఫోన్ కొట్టడం? " వంశీ అడిగాడు.

"సలహా ఇద్దామని! మాటవర్సకి చిరంజీవి ఉన్నాడనుకో. అతనింకా పౌరాణిక సినిమాల్లో వెయ్యలేదుకదా! అతన్ని అర్జునుడిగానో, కర్ణుడిగానో పెట్టి సినిమా తీస్తే సూపర్‌హిట్ అవుతుందని సలహా ఇద్దామనుకుంటున్నాను. అలాగే మిగతావాళ్ళక్క్యూడా ఇవ్వడానికి చాలా సలహాలు రెడీ చేసుకుంటాను" అంటూ భార్యాభర్తల వైపు చూశాడు.

"ఫ్రీగా ఫోన్ దొరికిందికదాని ప్రైమ్‌మినిస్టరు క్క్యూడా ఓ ఫోన్ కొట్టేసేటట్టున్నారే! ఆ హీరోలు మీరు ఫోన్ చేస్తే మాత్రం మాట్లాడతారా? " వ్యంగ్యంగా అడిగాడు వంశీ.

"ఎందుకు మాట్లాడరు? అయినా ఓసారి ట్రై చేసి చూస్తే పోయేదేంవుంది? " అంటూ ఓ నెంబరుకి డయల్ చేశాడు. వంశీకి అతన్ని ఆపే శక్తిలేక ఆఫీసుకు వెళ్లిపోయాడు. తాతారావుని వారించకుండా కళ్యాణి వంటపనిలో పడింది. తాతారావుకి అవతలనించి సరైన సమాధానం రాకపోయినా పట్టువదలని ఫోన్ మూర్ఖుల్లా ఒక నెంబరు తర్వాత మరో నెంబర్‌కి ట్రై చేస్తూనే భోజనాల టైమ్‌వరకు కాలక్షేపం చేశాడు. పన్నెండున్నర అవుతుందనగా "నా కాళ్లు రెండూ తిమ్మిరెక్కిపోయాయమ్మా! ఈ పూటకి ఇక్కడే నాలుగు ముద్దలు తినేసి, ఈ సోఫామీద కాస్సేపు కునుకుతీసి మా ఇంటికెళ్లిపోతాను" అంటే కళ్యాణి తనలో తాను నవ్వుకుందిగాని అతని ధోరణికి విసుక్కోలేదు.

★ ★ ★

వంశీకి లాయర్ మాలతి చేసిన సిఫార్స్ వల్ల, ఓ టీవీ సీరియల్లో ప్రధానమైన వేషం వచ్చింది. అతను అవసరమైనప్పుడు ఆఫీసుకి సెలవు పెడుతూ షూటింగ్‌లో పాల్గొన్నాడు. కళ్యాణి అతని ఏక్టివిటీకేమీ అడ్డు చెప్పలేదు. ఒకరోజు ఆవిణ్ణి షూటింగ్‌కి కూడా తీసుకువెళ్లాడు. ఆ ఇంటికి ఫ్రిజ్ కూడా వచ్చేసింది. వంశీకి టీవీ సీరియల్ వల్ల కాస్త ఆదాయం వస్తోంది. కాబట్టి ఫ్రిజ్‌కి కట్టాల్సిన మంత్లీ ఇన్‌స్టాల్మెంట్స్ పెద్ద కష్టమేం అవలేదు.

విజయ్ భార్య రజని గర్భవతి అయింది. ఆ భార్యాభర్తల్ని పిల్చి ఓరోజు భోజనం పెట్టి సత్కరించారు. పిలవకపోయినా తాతారావు ఆరోజు వచ్చి వాళ్ళందరితో కలిసి భోంచేశాడు. తర్వాత అక్కడున్న ఫ్రిజ్‌ని ఒకటికి రెండుసార్లు తడిమిచూసి కళ్యాణిని అడిగాడు. "ఈ ఫ్రిజ్ బాగా పని చేస్తోందామ్మా? "

"పనిచేస్తోందండి" అంది కళ్యాణి. విజయ్ అంతకుమునుపే తన భార్యకి, తాతారావు అనబడే శక్తి ఎటువంటిదో చెప్పుండడంవల్ల రజనీ తాతారావు ధోరణినే ఆసక్తిగా చూస్తోంది. "కొన్ని ఫ్రిజ్‌లో కూరగాయలవీ పెడితే మర్నాటికి వాసన వస్తోందంటూ కొంతమంది అంటుంటే విన్నాను. దీనికి అలాంటి ట్రబులేం లేదుకదా? " మళ్ళీ ప్రశ్నించాడు తాతారావు.

"అలాంటిదేం లేదండి. ఒకవేళ ఏమైనా కంప్లయింట్స్ వుంటే ఆ కంపెనీవాళ్లే వచ్చి రిపైర్ చేస్తారు. ఒన్ ఇయర్ గ్యారంటీ ఇచ్చారు"

"అలా అయితే ఫర్వాలేదు"

వంశీ విజయ్‌కి కన్నుకొట్టి తాతారావుని ఆటపట్టించడానికి "ఏమండీ, ఈ డిటైల్స్ అన్నీ దేనికడుగుతున్నారు? కొంపదీసి మీరు కూడా ఫ్రిజ్ కొనేస్తారేంటి? " అని అడిగాడు.

"నా బొంద! ఏ వస్తువునైనా కొనడం మా ఫేమిలీకి అచ్చిరాదని నీకెన్నిసార్లు చెప్పానయ్యా? "

"అలాంటప్పుడు ఫ్రిజ్ గురించి ఆరాలెందుకు తీస్తున్నారు? "

"మరేంలేదు. ఒకవేళ మీ ఫ్రిజ్ గనక పెర్‌ఫెక్ట్ కండీషన్లో వుంటే ఈ వేసవికాలం మూడునెల్లూ ఎరువు అడిగి తీసుకెళ్దామని. మళ్ళీ శీతాకాలం రాగానే ఇచ్చేస్తాన్లే" అన్నాడు తాతారావు.

అందరూ పగలబడి నవ్వారు.

రోజులు గడుస్తున్నాయి. వంశీ కళ్యాణిల మధ్యనున్న మానసికమైన అనుమానాల అడ్డుగోడ కొద్దికొద్దిగా కూలుతున్నవేళ... "నేను నా భర్తని సరిగా అర్థం చేస్కోలేదేమో! అతను నిజంగానే నిజాయితీపరుడేమో!" అని కళ్యాణి అనుకోబోతున్న తరుణంలో ఒకరోజు వంశీ ఆఫీసుకి సెలవుపెట్టి టీవీ సీరియల్ షూటింగ్‌కెళ్లాడు. ఆరోజు హీరోయిన్ వేషం వేస్తున్న స్వప్న, వంశీల మీద ఓ సీన్ షూటింగ్ జరుగుతుండగా ఆ బిల్డింగ్ దగ్గరకి కారులో రాధ, ఆవిడ భర్త ప్రకాష్ వచ్చారు. వాళ్ళు తీస్తున్న సీరియల్‌లో స్వప్న కూడా ఓ ప్రధాన పాత్ర వేస్తోంది. స్వప్న కాల్‌షీట్స్ అవసరమై ఆవిడతో మాట్లాడ్డానికొచ్చేరు.

వంశీ రాధని ఈమధ్య టీ.వీలో చూడ్డమే తప్ప ముఖస్థంగా చూళ్లేదు. ఆవిడకి పెళ్లైపోయింతర్వాత ఇదే చూడ్డం కాబట్టి ఆమెను "నువ్వు" అని ఏకవచన ప్రయోగంతో పిలవకుండా "మీరు" అంటూనే మాట్లాడాడు. "నా పేరు వంశీకృష్ణ" అంటూ వంశీయే ప్రకాష్‌కి స్వపరిచయం చేస్కుంటే ప్రకాష్ పగలబడి నవ్వాడు.

భలేవారేనండి. ఫలానా రాధాదేవి భర్తనని నేను మీకు పరిచయం చేస్కోవాలిగానీ, మీరు నాకు తెలీకపోవడం ఏంటి? మీ గురించి మా మిస్సెస్ చెప్పిందిలెండి" అన్నాడు.

అతనికి తన గురించి రాధ ఏం చెప్పిందో, ఎంతవరకు చెప్పిందో తెలీదు కాబట్టి వంశీ ఏమీ అనకుండా చిన్నగా నవ్వి ఊరుకున్నాడు.

రాధ వచ్చిందగ్గర్నించి నవ్వు ముఖంపెట్టి కూర్చుంది, పొడిపొడిగానే మాట్లాడింది. ప్రకాష్ మాత్రం దడదడమంటూ మాట్లాడుతూ, గలగలమని నవ్వుతూనే మాట్లాడాడు. స్వప్నతో మాట్లాడేసింతర్వాత రాధ, ప్రకాష్ ఓ పక్కకి వెళ్ళి ఓ నిమిషం మాట్లాడుకున్నాక, వంశీ దగ్గరకొచ్చి "ఏవండీ వంశీ గారూ, మీరు మా సీరియల్లో యాక్ట్ చెయ్యరా? మేం కూడా కరక్ట్‌గానే పేమెంట్ ఇస్తున్నాం" అన్నాడు ప్రకాష్. వంశీ మొహమాట పడిపోతే, "అబ్బే అదేం లేదండి. నాకు యాక్టింగ్ అనేది హాబీయే గాని, ప్రొఫెషన్ కాదండి. అప్పుడప్పుడు ఏదో సరదాగా... అంతే" అన్నాడు.

"మా సీరియల్లో కూడా సరదాగానే నటించండి. సీరియస్‌గా నటించొద్దు. ప్రస్తుతం రన్ అవుతున్న సీరియల్ మరో పదిరోజుల్లో ఎండ్ అయిపోతుంది. మేం మరో రెండు మూడు రోజుల్లో కొత్త సీరియల్ స్టార్ట్ చేస్తున్నాం. ఈసారి మనం కలిసి వర్క్ చేద్దాం" అంటూ ప్రకాష్ నమస్కరించి వెళ్ళిపోయాడు. రాధ కూడా మర్యాదగా, హుందాగా సమస్కరించి భర్తతో పాటు వెళ్ళిపోయింది.

వారు వెళ్ళాక స్వప్న "అయితే మీరు కూడా ఆ సీరియల్లో నటిస్తున్నారన్నమాట. బహుశా అందులో కూడా మనిద్దర్నే జోడీగా పడేస్తారేమో" అంది నవ్వుతూ.

"భలేవారేనండి. మీరు అలాంటి భయమేం పెట్టుకోకండి. వాళ్ళొచ్చింది మీ కోసం! నేను కూడా ఇక్కడే వున్నాను కాబట్టి ఏదో మర్యాదకోసం ఆయనలా అనుంటారు" అన్నాడు వంశీ. నిజానికి అతను మనసులో కూడా అలాగే అనుకున్నాడు. ఆ విషయాన్ని అక్కడితో మర్చిపోయాడు. ఇంటికొ

చ్చాక కూడా కళ్యాణి "ఇవాళ షూటింగ్ విశే షాలేంటి? " అని అడిగితే ఆరోజు షూట్ చేసిన సీన్స్ గురించి తను కొన్నిచోట్ల డైలాగ్స్ లేకుండా ఎలా ఎక్స్‌ప్రెషన్స్‌తో నటించాడో యాక్ట్‌చేసి మరీ చూపించాడు. రాధ, ఆవిడ భర్తా షూటింగ్ దగ్గరకొచ్చిన విషయాన్ని అతను చెప్పలేదు.

మర్నాడు ఉదయం వంశీ ఆఫీసుకెళ్ళిపో యిన పావుగంటకి ఇంట్లో ఫోన్ మోగితే కళ్యాణి అందుకుంది. అవతల్నించి రాధ భర్త ప్రకాష్ మాట్లాడుతూ, "రాధా ఆర్ట్ ప్రొడక్షన్స్ నించి మాట్లాడుతున్నానండి. వంశీ గారు కావాలండి" అన్నాడు.

రాధా ఆర్ట్‌ప్రొడకన్స్ అనే పేరు ఆవిడకి బాగా గుర్తే! రోజూ టీవీలో వస్తున్న రాధాదేవి సీరియల్ ఆ ప్రొడక్షన్ పేరు మీదే వస్తుందన్న విషయం ఆవిడకి గుర్తొ చ్చింది. "లేరండి. ఆయన ఆఫీసుకెళ్ళిపో యారు" అని జవాబు చెప్పడంతోపాటు "ఏదైనా విషయం వుంటే చెప్పండి" అని అనకుండా వుండలేకపోయింది.

"మరేం లేదండి. నిన్న మా ప్రొడ్యూసర్ గారు వంశీగార్ని షూటింగ్ దగ్గర కల్సి కొత్త సీరియల్ కాల్‌షీట్స్ గురించి మాట్లా డారు" అన్నాడు ప్రకాష్ తను ఆ ప్రొడ్యూ సర్నని చెప్పకుండా.

"మీ ప్రొడ్యూసర్‌గారంటే ఎవరు? రాధా ప్రకాష్‌గారా? "

"ఔనండి"

"రాధా, ప్రకాష్ అనేవి రెండు పేర్లుకదా! అందులో ఎవరు వెళ్ళి మాట్లాడారు? "

"ఆ ఇద్దర్లో ఎవరు వెళ్ళి అడిగినా ఒక్కటే లెండి. వంశీగారి ఆఫీస్ నెంబర్ తెలిస్తే చెప్పండి. మేం కాంటాక్ట్ చేస్తాం"

కళ్యాణి రెండు క్షణాలపాటు ఆలోచనలో పడి "సారీ అండీ నాకు తెలీదు" అంటూ ఫోన్ పెట్టేసింది. తను ఎందుకలా అబద్ధం చెప్పింది? తను వేసుకున్న ప్రశ్నకి తనే జవాబు చెప్పుకోలేకపోయింది. ఇన్నాళ్లూ రాధ తన సీరియల్లో నటించమని వంశీని అడగలేదు.

మరి ఇప్పుడెందుకు అడిగినట్లు? నిన్న రాధే వెళ్ళి అతన్ని కాల్ షీట్స్ అడిగిందా? షూటింగ్‌లోని విశేషాలేంటీ అని అడిగితే ఆయన మాటవరసక్కూడా రాధ విషయం చెప్పలేదే అనుకుంటూ వంశీ ఆఫీసుకు ఫోన్‌చేసి అడుగుదామని ఫోన్ డయల్ చెయ్యబోతూ అంతలోనే ఆగిపోయి తమా యించుకుంది. సాయంత్రం వంశీ వచ్చాక అతనికి కాఫీ ఇచ్చి కాఫీ తాగేవరకూ ఆగి, "మీరు మరో సీరియల్‌లో దేంట్లోనైనా యాక్ట్ చేస్తున్నారా? " అని అతన్ని చూడ కుండా నేలవైపు చూస్తూ అడిగింది.

"నీకు నేను చెప్పానుగా... నా అంతట నేను ఎవర్నీ అడగనని. ఇప్పుడు యాక్ట్ చేస్తున్న సీరియల్ కూడా లాయర్ మాలతీ గారు ఇప్పించిందే" అతను చాలా యధాలా పంగా చెప్పాడు.

"మీరు ఎవర్నీ అడక్కపోయినా, మిమ్మల్ని మరో ప్రొడక్షన్‌వాళ్లు అడిగుండొ చ్చుగా"

"ఎవరడిగారు? "

"నన్ను అడుగుతారేం? నిన్న మిమ్మల్ని ఎవరో అడిగారటగా" కళ్యాణి ఆ మాటలు చెప్తూ అతన్నే రెప్పార్పకుండా చూసింది. వంశీకి నిన్నటి విషయం గుర్తొచ్చింది. దాంతోపాటు ఆ విషయం కళ్యాణికెలా తెలి సిందా అనే సందేహం కూడా వచ్చింది.

"అడిగార్లే, రాధా ఆర్ట్ ప్రొడక్షన్స్‌వాళ్లు. చాలా యధాలాపంగా అడిగారే తప్ప పర్టి క్యులర్‌గా అడగలేదు" ఆ జవాబు చెప్పేసి అక్కడనించి వెళ్ళబోయాడు. కానీ కళ్యాణి అతన్ని ఓ ప్రశ్నతో ఆపగలిగింది. "రాధ మిమ్మల్ని కాల్ షీట్స్ అడిగిందటగా"

వంశీ కాస్త ఖంగుతిన్నా సర్దుకుని "రాధ కాదు, ఆవిడ హజ్బెండ్ ప్రకాష్ అడిగారు" అన్నాడు.

"అడిగింది రాధ కాదా? "

"ఆవిడ కూడా అతన్తోపాటే వచ్చింది. కానీ నన్ను అడిగింది అతనే"

"ఆ విషయం నాతో చెప్పలేదేం? "

వంశీ నిట్టూర్చాడు. వాదన పెంచడానికి మనసు ఒప్పుకోవడంలేదు. కానీ జవాబు చెప్పక తప్పడంలేదు. అనుకుంటూనే, "చూడు కళ్యాణీ, వాళ్లిద్దరూ నా కోసం రాలేదు. స్వప్న కోసం వచ్చారు. అక్కడ నేను కనిపించాను కాబట్టి, నన్ను అడక్కపోతే బాగోదని అలా అడిగారు. అదో పెద్ద విషయం కాదు కాబట్టి నీతో చెప్పలేదంతే! ఇంతకీ ఏమిటి విషయం? వాళ్లు నాకు ఫోన్ చేశారా? " అన్నాడు. "బహుశా వాళ్లాయనో, ప్రొడక్షన్ మేనేజరో ఉదయం ఫోన్ చేశారు. ఇంట్లో లేరని చెప్పగానే ఆఫీస్ నెంబర్‌కి కాంటాక్ట్ చేస్తామని చెప్పి ఫోన్ పెట్టేశారు" అంటూ కళ్యాణి కొంత నిజాన్ని, కొంత అబద్ధాన్ని కలిపి చెప్పింది.

వంశీ మరేమీ మాట్లాడకుండా విజయ్ ఇంటికెళ్లి జరిగిన విషయం చెప్పాడు. విజయ్ క్షణంకూడా టైమ్ తీసుకోకుండా "వాళ్లు అడిగినా నువ్వా సీరియల్లో నటించకు. కుదరదని ఖచ్చితంగా చెప్పెయ్. అలా చెప్పేశానని మీ ఆవిడతో క్లియర్‌గా చెప్పెయ్. ఇంతకంటే మరో మార్గంలేదు" అన్నాడు.

వంశీ ఇంటికొచ్చి కళ్యాణితో అదేమాట చెప్పాడు. "వాళ్ళకి మనింటి ఫోన్ నెంబరు ఎలా తెలిసిందో నాకు తెలీదు. ఆఫీస్‌కి ఫోన్ చెయ్యలేదు. రేపు నాకు ఫోన్ చేస్తే అలాగే చెప్పేస్తాను. నేను లేనప్పుడు ఫోన్ చేస్తే నువ్వూ అలాగే చెప్పెయ్"

"ఎందుకొప్పుకోనంటున్నారు? నేను అడిగాననా? " వ్యంగ్యంగా అడిగింది కళ్యాణి.

"నువ్వు నన్ను యాక్ట్ చెయ్యొద్దనేం చెప్పలేదుగా? నాకే ఇష్టంలేక వద్దంటున్నాను" ఆ వాదనని అంతటితో ముగించేశాడు వంశీ. కళ్యాణి కూడా వాదన పెంచలేదు.

ఆ వారంలో విజయ్‌కుమార్ ఇంటికి రజని పిన్ని కూతురు దీప్తి విశాఖపట్నంనించొచ్చింది. రజనీ గర్భవతయింది కాబట్టి ఓసారి చూసిపోదామని వచ్చింది. దీప్తికి ఆ వూర్లో ఒకే ఒక్క స్నేహితురాలుంది. ఆవిడ ఇంటి ఎడ్రస్ తెలుసు కాబట్టి ఇంటికెళ్లి కలుస్తానని రజనీకి చెప్పి బయలుదేరింది.

ఆవిడ స్నేహితురాలి పేరు... జయలత.

జయలత ఇంటికి దీప్తి వెళ్ళేసరికి ఆవిడ తల్లి జానకమ్మ వుంది. ఆవిడకి దీప్తి ఎవరో తెలీకపోవడంవల్ల తనకితానే పరిచయం చేసుకుంది. దీప్తి, జయలత చిన్నప్పుడు విశాఖపట్నంలోనే చదువుకున్నారు. ఆ విషయాలు చెప్తూ దీప్తి కూర్చుంది. జయలత ఆఫీసుకి వెళ్లింది. ఆవిడ తల్లి జానకమ్మ చాన్నాళ్లనించి మంచంమీదే వుంటున్న ఆస్మా పేషెంటు. ఏదో వైద్యం పేరుతో ఆ మందు, ఈ మందు తింటున్నా జబ్బు జబ్బులాగే వుంది. ఆవిడ మంచాన్నే పడి వుంది. జయలత ప్రస్తుతం ఆఫీసులో ఓవర్‌టైమ్ చేస్తోందని చెప్తూ బాగా ఆయాసపడింది. దీప్తి కంగారుపడి, "డాక్టర్ని తీసుకు రమ్మంటారా పిన్నిగారూ" అంది. "వద్దమ్మా, నాకీ ఆయాసం మామూలే! ఎక్కువగా ఆయాసం వచ్చినప్పుడు వేస్కోమని డాక్టర్ గారు ఏవో మాత్రలిచ్చారు. ఆ మాత్రలు కూడా నిన్నటితో అయిపోయాయి. ఆఫీసు నించి వచ్చేటుప్పుడు మాత్రలు పట్టుకొస్తానని చెప్పి మందుల చీటీ కూడా తీసుకెళ్లింది" అంటూ ఆయాసపడుతూనే చెప్పింది. ఎలాగూ హైదరాబాద్ వచ్చాను కాబట్టి జయలతని చూసి మాట్లాడే వెళ్ళాలనుకుంది దీప్తి. కానీ జానకమ్మగారు ఊపిరి తీయడానిక్కూడా ఇబ్బంది పడుతోంది. ఊరికే కూర్చునే బదులు టాబ్లెట్స్ అయినా తెచ్చిద్దామనుకుంటే ఆ మందుల చీటీ కూడా జయలతే తీసుకెళ్ళింది. తను ఇక్కడ కొస్తున్న విషయం తెలిస్తే జయలత ఆఫీసు నించి త్వరగా వస్తుందనిపించి జానకమ్మని అడిగి ఆఫీస్ ఫోన్‌నెంబరు తీసుకుని ఆ

వీధిలో వున్న ఎస్.టి.డి. బూత్‌కెళ్లి జయలతకి ఫోన్ చేసింది.

ఆఫీస్ హాల్లో వున్న ఫోన్ జయలత టైప్ చేసే టేబుల్‌మీదే వుంది. మోగుతున్న ఫోన్ అందుకుని దీప్తితో మాట్లాడింది "నువ్వు ఈ వూరొచ్చినందుకు చాలా సంతోషంగా వుందే! అమ్మ విషయం నువ్వేం కంగారుపడకు. నేను వెంటనే వచ్చేస్తున్నాను" అంటూ ఫోన్ పెట్టేసింది.

ఇంటికి బయలుదేరుతున్న వంశీ దగ్గర కెళ్లి జయలత ఆరోజు ఆఫీసునించి ఎర్లీగా వెళ్ళడానికి పర్మిషన్ అడిగింది. వంశీ చిన్నగా నవ్వి, "నువ్వు ఆఫీస్ అవర్స్‌లో వెళ్ళడానికి నా పర్మిషన్ కావాలి. నువ్వు నీ ఓన్ ఇంట్రెస్ట్ మీద నాలుగు రోజులుగా ఓవర్‌టైమ్ చేస్తున్నావు. నీ ఇష్టం వుంటే చెయ్యొచ్చు లేకపోతే వెళ్ళిపోవచ్చు నువ్వు ఆఫీస్‌వర్క్ ఏదీ పెండింగ్ పెట్టవని నాకు తెలుసు. పైగా మీ అమ్మగారికి ఒంట్లో బాగులేదంటున్నావు. మీ స్నేహితురాలు కూడా వైజాగ్‌నించి వచ్చిందంటున్నావుకదా! అలాంటప్పుడు నేనే నిన్ను బలవంతంగా ఇంటికి పంపించెయ్యాలి" అంటూ వంశీ ఆమెను వెళ్లమని చెప్పి తనూ స్కూటర్ తాళం అందుకున్నాడు.

ప్యూన్ రంగారావు వాళ్లిద్దరికి హాల్లో ఎదురుపడి, "ఏవండీ లతగారూ రోజూ ఓవర్‌టైమ్ చేస్తూ, బస్సులన్నీ స్ట్రయిక్ చేస్తున్నపుడు ఎర్లీగా బయలుదేరారేంటండీ?" అన్నాడు తన బ్రాండ్ వెకిలినవ్వు నవ్వుతూ.

"ఉదయం నేనొచ్చినప్పుడు బస్సుల స్ట్రయిక్ ఏదీ లేదే" అంది జయలత నమ్మలేనట్టుగా.

"ఉదయం అంటారేంటండీ, ఇందాక మూడున్నరదాకా బస్సులన్నీ బంగారంలాగే నడిచాయి. కానీ పావుతక్కువ నాలుగ్గంటలకి నన్ను మీరు పోస్టాఫీసుకి పంపించారు కదా... అప్పుడే. చిక్కడపల్లి చౌరస్తా దగ్గర ఆర్టీసీ బస్సోళ్లూ, ఆటోరిక్షా డ్రైవర్లు ఏదో గొడవపడి కొట్టుకున్నారండి. అంతే! అప్పట్నించీ బస్సులూ, ఆటోలూ తిరగడం మానేశాయి. ఈ గొడవంతా సద్దుమణిగేసరికి మరో రెండు మూడు గంటలయినా పట్టేస్తుంది"

రాకరాక తన ఫ్రెండు వైజాగ్‌నించి వచ్చినప్పుడు, అత్యవసరంగా మందులు తీసుకెళ్లాల్సిన టైములోనే బస్సులన్నీ స్ట్రయిక్ చేస్తున్నందుకు జయలత బెంగపడింది. కళ్లంట నీళ్లు తిప్పుకుంటుంటే వంశీకృష్ణ ఓ నిమిషం పాటు ఆలోచించి "ఈమాత్రం దానికే దిగులు పడిపోతావేంటి లతా?. బస్సులు, ఆటోలు స్ట్రయిక్ చేసినా నా స్కూటర్ స్ట్రయిక్ చెయ్యడంలేదుగా! నీకు అభ్యంతరం లేకపోతే నా స్కూటర్‌మీద నిన్ను మీ ఇంటి దగ్గర డ్రాప్ చేస్తాను పదా" అంటూ జయలతని తీసుకుని బైటకి నడిచాడు.

★ ★ ★

వంశీ స్కూటర్‌మీద జయలత ఇంటికి వెళ్తూ దార్లో ఓ మెడికల్ షాప్ దగ్గర స్కూటర్ ఆపించింది. తన తల్లికి కావల్సిన మాత్రలు ఓ టిన్‌లో వున్నాయి. ప్రస్తుతానికి ఓ పది మాత్రం తీసుకుని, మిగిలినవి జీతం అందేక తీసుకుందామనుకుంది. కానీ ఆ షాప్ ప్రొప్రయిటర్ "తీస్కుంటే టిన్ను మొత్తం తీస్కోవాలి తప్ప లూజ్‌గా ఇవ్వలేను" అని ఖచ్చితంగా చెప్పేశాడు. టిన్‌లో వుండేవి యాభై టాబ్లెట్స్. తన తల్లికి ప్రతీ రోజూ అవసరమయ్యే టాబ్లెట్స్ అవి. కానీ టిన్ మాత్రం తీస్కోడానికి ముప్పై రూపాయలు తక్కువయ్యాయి.

జయలత నిట్టూర్చి "ఫర్వాలేదులెండి. రేపు తీసుకుంటాను" అంటూ షాపులోనించి బయలుదేరబోతుంటే వంశీ విషయమంతా తెలుసుకుని తనే ముప్పై రూపాయలు ఎడ్జస్ట్ చేసి టాబ్లెట్స్ తీసుకుని ఆమెకిచ్చాడు. ఆమె డబ్బులు తీస్కోడానికి మొహమాటపడిపోతుంటే, "మరేం ఫర్వాలేదు

లతా, ఉత్తనేకాదు, అప్పుగానే తీస్కుని జీతం అందాకనే ఇవ్వు" అంటూ వంశీ చాలా ఆత్మీయుల్లా చెప్పేసరికి జయలత కాదనలేకపోయింది.

జానకమ్మతో దీప్తి మాట్లాడుతూనే జయలత రాకకోసం ఎదురుచూస్తోంది. జానకమ్మ మాటల్ని బట్టి ఆవిడకి శారీరకమైన బాధకంటే మానసికమైన బాధే ఎక్కువగా వుందని దీప్తి గ్రహించింది. ఆవిడ బాధపడుతున్నది కూడా కూతురు గురించే! "పెళ్లి చేసి అత్తారింటికి పంపాల్సిన పిల్లని, ఆఫీసుకి పంపించి దాని సంపాదనమీద బతకాల్సొచ్చింది. దాని సంపాదనలో సగానికి సగం నా మందులకిందే ఖర్చయిపోతోంది. దాని పెళ్లికంటూ ఒక రూపాయి కూడా వెనకెయ్యలేకపోయాను. నేను పోతే దాని జీతంతో అదైనా హాయిగా బతుకుతుందనుకుంటే ఆ భగవంతుడు మంచి మంచోళ్లని తీసుకుపోతూ నన్ను ఈ మంచంమీద వదిలేశాడు" అంటూ జానకమ్మ ఏడ్చింది. దీప్తి ఆవిడ పరిస్థితికి జాలిపడిందేగాని ఓదార్చలేకపోయింది. "ఉద్యోగం చేసే అమ్మాయికి సంబంధాలు తన్నుకుంటూ వస్తాయి పిన్నిగారూ! ఈపాటికి కొన్ని సంబంధాలు వచ్చుండాలే" అంది.

"ఒక్క సంబంధం వచ్చిందమ్మా! కానీ మా దరిద్రాన్ని ఆసరాగా తీసుకుని ఆ కిరాణాకొట్టు కన్నారావు సంబంధం వచ్చింది. కానీ నేనే ఆ కబురు తీసుకొచ్చిన పెద్దమనిషిని వీధిలోకి పొమ్మన్నాను"

"అదృష్టం కలిసొచ్చి బిజినెస్ జరగాలేగానీ కిరాణాషాపులమీద కూడా లక్షలు సంపాదించినవాళ్లున్నారు పిన్నీ! అలాంటి వ్యాపారాల దగ్గర ఈ ఉద్యోగాలేం పనికొస్తాయి"

దీప్తి చెప్తున్న మాటలు నిజమేగానీ, జానకమ్మ మాత్రం తన ధోరణిలోనే బాధని వ్యక్తం చేసింది. "నువ్వు చెప్పింది నిజమేగానీ, ఆ కన్నారావుకి దగ్గర దగ్గర ఏభైఏళ్లుంటాయమ్మా! ఇద్దరు పిల్లలున్నారు. పైగా అతగాడి రెండుకాళ్లు చచ్చుబడిపోయి, చక్రాల బండిమీదే తిరుగుతుంటాడు"

దీప్తి ఆశ్చర్యపోతూ, "అలాంటివాడు మన లతని పెళ్లిచేసుకుంటానని అడిగాడా? వాడికెంత ధైర్యం? " అంది.

"మా దరిద్రమే వాడిచేత అలా అడిగించింది. నా కూతురికి అలాంటివాణ్ణి కట్టబెట్టే బదులు అదీ నేనూ ఇంత విషంతాగి చావడం మంచిదికదమ్మా" ఆ మాట చెప్తుండగానే ఇంటి బయట స్కూటర్ ఆగింది.

స్కూటర్ దిగిన జయలత అతనికి థాంక్స్ చెప్పి "ఇంట్లోకి రండి. కాఫీ తాగి వెళ్దురుగాని" అంది.

"ఇప్పుడొద్దులే, మీ స్నేహితురాలెవరో వచ్చేరన్నావుగా. ఆవిడ సంగతి, మీ అమ్మగారి సంగతి చూడు. నేను మరోసారి ఫ్యామిలీతో సహా మీ అమ్మగార్ని చూడ్డానికొస్తాను" అన్చెప్పి వంశీ స్కూటర్ స్టార్ట్ చేసుకు వెళ్ళిపోయాడు. ఇంట్లో వున్న దీప్తికి గుమ్మంలో స్కూటర్‌మీద కూర్చున్న వంశీ కనిపించాడు. కానీ వంశీ లోపలున్న దీప్తిని చూడలేదు. జయలత ఇంట్లోకి వెళ్ళి, దీప్తిని పల్కరించి, జానకమ్మకో టాబ్లెట్ వేసి కాసిన్ని నీళ్లు పట్టింది. ఆ తర్వాత స్నేహితురాళ్లిద్దరూ గుమ్మంలో కూర్చుని సంభాషణలోకి దిగారు.

"నిన్ను స్కూటర్ మీద డ్రాప్ చేసిందెవరట? " ఇదే దీప్తి అడిగిన మొదటి ప్రశ్న.

"ఆయన వంశీగారని మా అసిస్టెంట్ మేనేజర్" అంటూ జయలత వంశీ గురించి వివరంగా చెప్పింది.

★ ★ ★

జయలతని ఇంటి దగ్గర డ్రాప్ చేసి వెళ్తుండగా వంశీకి దారిలో విజయ్ కనిపించాడు. తన కారుని ఓ పక్కగా స్టాప్‌చేసి వంశీని "ఏరా ఇంత ఆలస్యంగా ఇంటికెళ్తున్నావు? ఆఫీసులో వర్క్ అంత హెవీగా వుందా? " అంటూ సిగరెట్ వెలిగించాడు.

"వర్క్ ఎప్పుడూ వుండేదేగానీ, ఇవాళ లేట్‌గా వెళ్లడానికి కారణం వేరే వుందిలే" అంటూ వంశీ జయలతకొచ్చిన ఇబ్బంది, తను చేసిన సాయం గురించి వివరించాడు.

"ఆ జయలత ఇంటికొచ్చిన ఫ్రెండెవరు?"

"ఏమో... పేరు, వివరాలు నేనగడలేదు. ఆవిడ విశాఖపట్నంనించి వచ్చిందని మాత్రం తెలుసు"

విజయ్ సిగరెట్ కాలుస్తూనే ఏదో ఆలోచిస్తూ, "జరిగినంతవరకు బాగానే వుంది. నువ్వు చేసిందంతా సంఘసేవ, దీనజనోద్ధరణ కిందకే వస్తుంది కాబట్టి ఫర్వాలేదు. కానీ నువ్వు నీ వైఫ్‌తో సహా జయలతింటికి వస్తానని చెప్పావుగదా... ఆ మాట కాజువల్‌గా అన్నావా? లేకపోతే రేపోమాపో నిజంగానే, నీ వైఫ్‌తో సహా ఆ ఇంటికెళ్ళిపోతావా?" అంటూ రవంత వ్యంగ్యంగానే ప్రశ్నించాడు.

"నిజం చెప్పాలంటే ఇవాళే వెళ్ళాలి. గుమ్మం దగ్గర డ్రాప్ చేసినప్పుడు, ఇంట్లోకెళ్లి పేషెంటుగా వున్న వాళ్ల మదర్ని పరామర్శించడం మావనధర్మం! కానీ జయలత పెళ్లికాని అమ్మాయి. పైగా ఎవరో ఫ్రెండు ఇంట్లో వున్నప్పుడు నేను లోపలకెళ్లడం అంత బాగోదుకదాని ఆగిపోయాను. ఎల్లుండోసారి మా ఆవిణ్ణి కూడా తీసుకెళ్తాను..."

విజయ్ అతన్ని ఆగమన్నట్టుగా చేత్తో సంజ్ఞ చేశాడు. "ఎందుకాగమంటున్నావ్? నేనేమైనా తప్పు మాట్లాడేనా?" అన్నాడు వంశీ చిరాగ్గా.

"మాటలవరకు తప్పేం లేదనుకో! కానీ ఆ మాటలు చేతల్లోకి దిగితే మాత్రం వాతావరణ కాలుష్యం జరిగే ప్రమాదం వుంది. అంటే మీ ఫ్యామిలీ వాతావరణం దెబ్బతినే ఛాన్సుంది. అంతేకాదు, జయలత అనే ఆడ శాల్తీ పేరు కూడా మీ ఆవిడతో ప్రస్తావించకు" చాలా సిన్సియర్‌గా చెప్పినవాళ్లాగా ముఖం పెట్టాడు విజయ్.

"లత విషయం చెప్పకపోతే నేనివాళ ఇంత లేట్‌గా ఇంటికెందుకెళ్లినట్టు?"

"సిటీకేబుల్లో వార్తలు చదివానని చెప్పు"

"ఏడ్చినట్టుంది. మా ఆవిడ ప్రతీరోజూ సిటీ కేబుల్ న్యూస్ చూస్తుంది. ఊర్లోని విశేషాలు తెలియాలంటే లోకల్ టీవీ చూడక తప్పదుకదా! అందుకే చూస్తుంది. అలాంటప్పుడు టీవీలో నేను కనిపించకపోతే నేను చెప్పిన మాట ఎలా నమ్ముతుంది? అయినా భార్యాభర్తల మధ్య దాపరికాలెందుకు? ఆమధ్య రాధా వాళ్లాయన షూటింగ్ దగ్గరకొచ్చిన విషయం చెప్పలేదనే బాధ పడింది..."

వంశీ ఇంకా ఏదో చెప్పబోతుంటే ఆ విషయమంతా తనకు తెలుసుకదాన్నట్టుగా తలాడించి విజయ్ కాలుస్తున్న సిగరెట్‌ని పారేసి కారు బానెట్ మీద కూర్చుని మాట్లాడేడు. "రేయ్ అబ్బాయ్, ఆ రోజు షూటింగ్ దగ్గరకి రాధ, ఆవిడ భర్తా వచ్చిన విషయాన్ని చాలా సింపుల్ మేటర్‌గా తీస్కున్నావు కాబట్టి నువ్వు మీ ఆవిడకి చెప్పలేదు. అదీ ఓకే! వాళ్లకి నీ కాల్ షీట్స్ కావల్సొచ్చి ప్రకాష్ మీ ఇంటికి ఫోన్ చేశాడు కాబట్టి ఆ దంపతులు నీ షూటింగ్ దగ్గరకొచ్చిన విషయం మీ ఆవిడకి తెలిసింది. తెలిశాక చిటపటలాడింది. అదీ ఓకే! కానీ జయలత విషయం నీ అంతట నువ్వు చెప్పకపోతే మీ ఆవిడకి తెలిసే అవకాశమే లేదు. కాబట్టి నువ్వా విషయాన్ని ఎత్తకపోవడమే మంచిది"

వంశీ ఆలోచిస్తూనే "ఏ తప్పూ చెయ్యనప్పుడు ఎందుకనవసరంగా" అంటూ గొణుక్కుంటుంటే విజయ్ అతని గెడ్డం పట్టుకుని బతిమలాడుతున్నట్టుగా చెప్పాడు. "బాబ్బాబు! నువ్విలాంటి దిక్కుమాలిన స్వగతాలతోనే దారినపోయే దరిద్రాన్ని నెత్తిమీదకి తెచ్చుకుంటున్నావు. నువ్వు ఏ తప్పూ చెయ్యలేదు. కరక్టే! కానీ నువ్వు నిజాయితీగా జయలత విషయం చెప్పేవనుకో!

ఎక్కణ్ణించి స్టార్ట్ చేస్తావ్? అనగనగా ఒకానొక జయలత. ఆవిడ అన్‌మేరీడ్. వెనకా ముందు ఎవరూ లేని అమ్మాయంటూ ఆరంభించి ఇవాళావిడని ఇంటి దగ్గర డ్రాప్ చేసేవరకు ఏడెనిమిది రీళ్ల కథ చెప్పాలి, చెప్తావ్ కూడాను. కానీ నువ్వు చెప్పే స్టోరీలో ఎన్ని రీళ్ల స్టోరీ ఆవిడ నమ్ముతుంది? అంచేత నువ్వు ఏదో ఏదో చెప్పి కన్విన్స్ చెయ్యాలని చూసేబదులు జయలత సంగతి ప్రస్తావించకుండా వుండడమే మంచిది. అందువల్ల నీ శీలం చెడిపోయి నీ పాతివ్రత్యం పాడవదు. నేనో మొండి వెధవని కాబట్టి నీ మాట నేనెప్పుడూ వినలేదు. కానీ నువ్వు మంచి వాడివికదా! ఈ ఒక్కసారికీ ఇలా కానిచ్చెయ్". వంశీ ఇంకా ఆలోచనలో వున్నాడు. ఆఖరి మాటలు మరోసారి చెప్పి విజయ్ కారులో వెళ్లిపోయాడు. వంశీ కూడా తన స్కూటర్‌ని స్టార్ట్ చేశాడు.

తనకి మరదలు వరసయిన దీప్తి విశాఖపట్నంనించి వచ్చిందని విజయ్ చెప్పలేదు. దీప్తి తన స్నేహితురాలని జయలత కూడా వంశీకి చెప్పలేదు.

★ ★ ★

వంశీ ఇంటికొచ్చి బెడ్‌రూమ్‌లో బట్టలు మార్చుకుంటుండగా కళ్యాణి కాఫీ కప్పు పట్టుకుని ఆ గదిలోకి వచ్చింది. "కాఫీ టైమ్ దాటిపోయిందిగా! ఇప్పుడు కాఫీ తాగితే భోంచెయ్యబుద్ధవదు" అన్నాడు వంశీ అక్కడనించి హాల్‌లోకి నడుస్తూ.

"చూస్తూ చూస్తూ కాఫీని వేస్ట్ చెయ్యడమెందుకు? ఫిఫ్టీ ఫిఫ్టీ తాగేద్దాం" అంటూ కళ్యాణి సగం కాఫీని సాసర్‌లో పోసుకుని కప్పు అతనికి అందించింది.

ఆ రోజు కళ్యాణి మంచి మూడ్‌లోనే వుంది. "ఆఫీసులో వర్క్ హెవీగా వుండడంవల్ల లేట్ అయింది" అంటూ ఆవిడకి సంజాయిషీలా కాకుండా ఓ ఇన్ఫర్మేషన్ చెప్తున్నట్టుగా చెప్పాడు. కళ్యాణి ఆ మాట వినేసి చిన్నగా నవ్వుకుంటూ వంటగదిలోకి వెళ్లిపోయింది.

మర్నాడు వుదయం విజయ్ ఆఫీస్‌కెళ్లాక రజనీ దీప్తిని తీసుకుని వంశీ ఇంటికి బయలుదేరింది. రజనీ పెళ్లికి దీప్తి రావడం కుదరలేదు. అందుకే విజయ్ ఫ్రెండ్ వంశీని దీప్తి చూడ్డం కుదరలేదు. దీప్తి ఆ వూరు వచ్చిన మూడు నాలుగైదు రోజుల్లో కనీసం రెండు మూడు సార్లయినా వంశీ కళ్యాణీల గురించి రజనీ చెప్పింది. తామే వాళ్లిద్దరి వివాహం జరిపించామని కూడా చెప్పింది. ఆ పెళ్లి జరిగినప్పుడూ దీప్తి విశాఖపట్నంలో లేదు. ఇవన్నీ కాకుండా కళ్యాణి విశాఖపట్నానికి చెందిన అమ్మాయని తెలిశాక ఆమెను కలుసుకుని మాట్లాడాలనే కుతూహలం దీప్తికి ఎక్కువయింది. పైగా కొత్త కొత్త స్నేహితురాళ్లని కూడగట్టుకోవడం ఆవిడకో హాబీ! ఇవన్నీ రజనీకి తెలుసు కాబట్టే దీప్తితో కలిసి ఆ ఇంటికి బయలుదేరుతూ మెట్లు దిగి కిందకొచ్చేసరికి కంట్రాక్టర్ హనుమంతరావు కనిపించాడు. రజనీ ప్రస్తుతం కడుతున్న బిల్డింగ్‌ని అతనే కాంట్రాక్టు తీసుకున్నాడు. వర్క్‌స్పాట్‌లో ఏదో ప్రాబ్లమ్ వచ్చిందనీ, రజనీ వస్తే తప్ప అది పరిష్కారం కాదనీ చెప్పాడు. కాబట్టి వెళ్లక తప్పలేదు. ఈ పనిని వాయిదా వెయ్యడానికి వీల్లేదు. కళ్యాణి ఇంటికి మరో రోజు వెళ్దామంటే ఆ రోజు సాయంత్రం విశాఖపట్నం వెళ్లిపోతోంది. కొన్ని క్షణాలు ఆలోచించాక ఓ అయిడియా ఆలోచించి కళ్యాణి ఇంటికి ఫోన్ చేసి తన చెల్లెల్ని ఆమె దగ్గరకి పంపిస్తున్నానని చెప్పింది. కారు డ్రైవర్‌కి వంశీ ఇల్లు తెలుసుకాబట్టి దీప్తిని తన కారులో పంపించి రజనీ కంట్రాక్టర్ గారి కారులో జూబ్లీహిల్స్‌కెళ్లింది.

ఇంటికొచ్చిన దీప్తిని కళ్యాణి సాదరంగా ఆహ్వానించి కూర్చోబెట్టి కాఫీ ఇచ్చింది. ఇద్దరూ విశాఖపట్నం వాళ్లే కాబట్టి చాలా సేపు వైజాగ్ విశేషాలే చెప్పుకున్నారు. కళ్యాణి వివాహం విశాఖపట్నంలోనే జరి

గినా ఆ సమయంలో తాను వైజాగ్‌లో లేనందుకు బాధపడింది దీప్తి. కళ్యాణి వెళ్లి తన పెళ్లి ఫొటో ఆల్బమ్ తీసుకొచ్చి ఆమెకు అందించింది. "మా పెళ్లి చాలా సింపుల్‌గానే జరిగిపోయింది. సింపుల్ లివింగ్ హైథింకింగ్ వుండాలనేది మా ఆయనగారి స్లోగన్" దీప్తి ఆల్బమ్‌లోని ఫస్ట్ లీఫ్ తిరగేయగానే అక్కడున్న ఫొటోలో కనిపించిన వంశీని చూసి చాలా ఈజీగానే గుర్తుపట్టి "ఓహ్ వీరా మీ శ్రీవారు? వీర్ని నేను చూశాను" అంది నవ్వుతూ.

"చూసే వుంటార్లెండి. ఆయన రెండు సార్లు విశాఖపట్నంలో నాటకం వేశారట. అప్పుడు చూసుంటారు"

"కాదు కాదు..."

"ఆయనీ వూరు సిటీకేబుల్లో న్యూస్ చదువుతుంటారు కాబట్టి"

"భలేవారే! ఇక్కడ టెలికాస్ట్ అయే సిటీకేబుల్ వేరు మన విశాఖపట్నం సిటీకేబుల్ వేరు"

కళ్యాణి పగలబడినవ్వి "ఔనండోయ్. నేనా విషయం మర్చిపోయాను. మరి మావార్ని మీరెక్కడ చూశారు? " అంది.

"మా జయలత ఇంటి దగ్గర"

పకపకమని నవ్వుతున్న కళ్యాణి నవ్వడం ఆపేసింది. "జయలతా? ఎవరు? "

"మా ఫ్రెండ్" అంటూ దీప్తి మిగతా ఫొటోల్ని చూస్తూ నిన్న జయలత వంశీ గురించి చెప్పిన వివరాలన్నీ చెప్పింది. కళ్యాణి మనస్తత్వం దీప్తికి తెలీదు కాబట్టి ఆవిడ నిన్నటి సంఘటనని చాలా యథాలాపంగా చెప్పింది తప్ప కళ్యాణి ముఖంలో వస్తున్న మార్పుల్ని ఆమె గమనించలేదు. ఆవిడ వెళ్లేవరకు కళ్యాణి తన ఎమోషన్స్‌ని నిగ్రహించుకుంది. మరో గంట తర్వాత దీప్తి వెళ్లిపోయింది.

వెళ్లిన మరుక్షణంనించి కళ్యాణికి అంతవరకు కూర్చున్న సోఫా మలమలమండే పెనంలా కనిపించింది. దానిమీద కూర్చోలేకపోయింది. ఆవిడ మెదడులో ఆలోచనా తరంగాలు వువ్వెత్తున లేచాయి. గతంలో రాధ అనే డ్రామా ఆర్టిస్టు ఆవిడ తనని ప్రేమించింది తప్ప తను ఎంత మాత్రమూ ప్రేమించలేదని చెప్పాడు వంశీ. మొదట్లో నమ్మకపోయినా క్రమంగా నమ్మింది. మళ్లీ మొన్న రాధ వంశీ ఏక్ట్ చేస్తున్న సీరియల్ షూటింగ్ దగ్గరకొచ్చి అతన్ని తన సొంత సీరియల్లో నటించమని అడిగింది. ఆ విషయం తనతో చెప్పలేదు. మర్నాడు తనే అడిగితే "అదేమీ పెద్దగా చెప్పుకో దగ్గ విషయంగా భావించలేదు కాబట్టి చెప్పలేదు" అన్నాడు. బహుశా తనకి భయపడో ముందు ముందు గృహకలహాలు రాకుండా జాగ్రత్త పడ్డానికో రాధ తీస్తున్న సీరియల్లో నటించడం మానుకున్నాడని తనకితానే సర్ది చెప్పుకుంది. కానీ ఈ విషయాన్ని కూలంకషంగా అన్ని కోణాల్లోనించి పరిశీలించి చూస్తే తను అనుకుంటున్న కారణాలు కరక్ట్ కావని తెలిపోతోంది. అతను గత కాలపు చరిత్ర గ్రంధాన్ని చించిపారెయ్యలేదు. కేవలం ముఖచిత్రాన్ని మాత్రమే మార్చాడు. అప్పుడు అతని శృంగార గ్రంధానికుండే కవర్ పేజీ బొమ్మ రాధాదేవి అయితే ఇప్పుడున్న బొమ్మ పేరు జయలత. అతని జీవిత నాటకంలోని భాగంగా ఆడే అంతర్నాటకంలోని హీరోయిన్... జయలత.

వంశీ ఆఫీసునించి వచ్చేవరకు కళ్యాణి సహనం వహించింది. తను స్కూటర్ దిగి లోపలికొచ్చినప్పుడు ఆమె హాల్లోనే కూర్చున్నా అతన్ని పలకరించలేదు. అతను తన గదిలోకెళ్లి బట్టలు మార్చుకోకుండానే ఆమె పక్కనే కూర్చుని ఏదో విశేషం చెప్పబోయేడు. కానీ కళ్యాణి అడిగిన ప్రశ్న అతన్నేమీ మాట్లాడనివ్వలేదు.

"నిన్న మీరు ఆఫీసునించి ఎందుకు లేట్‌గా వచ్చారు? "

వంశీ క్షణం పాటు ఖంగుతిన్నాడు. అయినా తమాయించుకుంటూ "చెప్పాను

కదా! ఆఫీస్‌లో హెవీ వర్క్... " అన్నాడు.

"మీకున్న హెవీ వర్క్ ఆఫీస్ ఫైల్స్‌తోనా? లేక మీ ఆఫీసులో వున్న జయలతతోనా? "

కళ్యాణి ఈ మాటల్ని పళ్లు బిగబెట్టి మరీ కసిగా అడిగింది. వంశీ అదిరిపడ్డాడు. తన కంగార్ని తమాయించుకుంటూ ఏదో చెప్పబోతే ఆమె చెప్పనివ్వలేదు. నేను చెప్పేదింకా పూర్తి కాలేదు. జయలతతో మీకు ఎటువంటి సంబంధం లేదని దబాయించాలని చూస్తున్నారేమో! మీరు అలాంటి వృథా ప్రయత్నాలు చెయ్యకండి. జయలత చేత మీరెందుకు పనిగట్టుకుని మరీ నాటకంలో వేషం వేయించారు? దగ్గరుండి మరీ డైలాగులు పలకడం నేర్పించారు? నిన్న సాయంత్రం మీరెందుకు లేట్‌గా వచ్చారని నేనడగలేదు. అయినా మీరే పనిగట్టుకుని ఆఫీసులో హెవీవర్క్ వుందని చెప్పారు. కానీ మీరు జయలతని స్కూటర్ ఎక్కించుకుని ఎందుకు ఆవిడింటికి తీసుకెళ్లారు? "

"నిన్న సాయంత్రం సిటీబస్సులు, ఆటోలు స్ట్రయిక్ చేశాయికదా!"

"ఎందుకండీ అనవసరంగా అబద్ధాలాడతారు? నిన్న ఏ స్ట్రయిక్ జరగలేదు"

"అబద్ధమాడాల్సిన ఖర్మ నాకేం పట్టింది? నిన్న సాయంత్రం ఐదు గంటల నించి ఏడున్నర దాకా స్ట్రయిక్ జరిగింది. కావాలంటే ఎవర్నయినా అడుగు"

"ఎవర్నయినా అడగడానికి నాకు తెలీకపోతే కదా! మీకు జయలతంటే జాలి అనే అనుకుందాం. మీరు చెప్పినట్టు నిన్న సాయంత్రం స్ట్రయిక్ జరిగిందనే అనుకుందాం. మీ ఆఫీసులో మీకు తప్ప మరెవరికీ స్కూటర్లులేవా? తనకి లిఫ్ట్ ఇమ్మని మిమ్మల్నే పర్టిక్యులర్‌గా ఎందుకడిగింది?

"ఆవిడేం అడగలేదు"

"అంటే మీ అంతట మీరే ఆవిణ్ణి స్కూటర్ మీద వూరంతా తిప్పడానికి తీసుకెళ్లేరన్నమాట. వాళ్లమ్మగారి మందులకి డబ్బు తక్కువొస్తే మీరే జాలిపడిపోయి డబ్బు సర్దుబాటు చేశారు. ఔనా? కాదా? ఇప్పుడు చెప్పండి. 'భార్యాభర్తల మధ్య దాగుడుమూతలు, దాపరికాలు వుండకూడదు', 'నేను స్టేజిమీద తప్ప జీవితంలో నటించను, నటుడిగా జీవించాలే తప్ప జీవితంలో నటించకూడదనే సిద్ధాంతాన్ని పాటిస్తాను' అని మన ఫస్ట్‌నైట్ నాడే నాకు లెక్చరిచ్చారు. అలా ఎందుకు చెప్పారంటే మొదటిరోజే నాకు అబద్ధాలనే గంతలు కట్టేస్తే జీవితాంతం నేను గంతలు కట్టిన గుర్రంలాగ పరుగులు తీస్తాననేకదా చెప్పారు? మీరు నిజం తప్ప అబద్ధాలాడనూ ఒకవేళ ఆడినా మరీ అత్యవసర పరిస్థితుల్లో ఇతరులకి అపకారం కలగని రీతిలోనే అబద్ధాలాడతానన్నారు. గుర్తుందా? మరి మీ జయలత గురించి ఇన్నాళ్లూ ఒక్కసారి కూడా నాతో చెప్పలేదేం? ఆవిడ చేత బలవంతాన నాటకం వేయించాననే విషయమైనా చెప్పలేదేం?. నిన్న సాయంత్రం మీ ఫ్రెండుకి లిఫ్ట్ ఇచ్చి సాయం చేశానని కూడా చెప్పలేదేం? చెప్పకపోగా మీ ఫ్రెండ్షిప్పు గురించి దాచడానికి ఆఫీసులో హెవీ వర్కుందని నా దగ్గర అబద్ధాలాడతారా? ఇదేనా మీ నిజాయితీ? " కళ్యాణి ఒక్కో ప్రశ్న అడుగుతుంటే వంశీకి తెలీకుండానే చెమటలు పట్టేయి. ఆవిడ అడిగిన ప్రశ్నల్లో లాయర్లు ప్రదర్శించే లౌక్యం, పోలీసుల దబాయింపూ రెండూ కనిపించాయి. వంశీ ఏమీ చెప్పలేని నిస్సహాయస్థితిలో పడిపోయాడు.

విజయ్ చెప్పిన సలహాల్ని ఎప్పుడూ కాదని ఎదిరించినవాడు నిన్న ఒక్క రోజు అతని సలహాని పాటించి జయలత విషయం భార్యతో చెప్పలేదు. నిజం చెప్పకుండా అబద్ధం ఆడకుండా మౌనం వహించినందుకు ఇప్పుడు భార్యముందు నేరస్థ

డిలా నిలబడాల్సి వచ్చింది. తప్పు చేసినవా
డిలా కాకుండా భార్యని ఎలా నమ్మించాలో
తెలియని వాడిలా తల దించుకుని తన
గదిలోకి వెళ్లిపోయాడు. కళ్యాణి వంట
ఆరంభించిందిగానీ తనకోపాన్నంతా గిన్నెల
మీద తప్పేళాల మీద చూపించడంవల్ల ధడే
ల్ ధడేల్ మనే శబ్దాలు వినిపిస్తూనే
వున్నాయి. ఆ రాత్రి కళ్యాణి వంశీతో
మాట్లాడలేదు. రేపు వెళ్లి ఆ జయలత ఎలా
వుంటుందో చూద్దామనుకుంది.

"నువ్వు ప్రేమాయణం జరిపించడానికి
పెళ్లైపోయిన మా ఆయనే దొరికాడా? " అని
అడగాలనుకుంది, కానీ అంతలోనే మనసు
మార్చుకుంది. తప్పంతా వంశీలో కనిపి
స్తుంటే ఆ జయలతని దులిపేస్తే లాభమే
ముంది? రేపా జయలత కాకపోతే మరో
మధులత.. ఎంతమందితో తను పోరాడు
తుంది? ఇక ఆలోచనలతో కళ్యాణికి నిద్ర
పట్టలేదు.

వంశీ విషయానికొస్తే తను జయలత
ఇంటికివెళ్లిన విషయం ఒక్క విజయ్‌కుమా
ర్‌కే చెప్పాడు. ఆవిడ విషయం కళ్యాణితో
చెప్పొద్దని సలహా ఇచ్చినవాడు
కళ్యాణికెందుకు చెప్తాడు? చెప్పడు. అలాం
టప్పుడు జయలత విషయం కళ్యాణికెలా
తెల్సినట్టు? ఇందాక కళ్యాణి చాలా
మాటలు చెప్పిందిగానీ ఈ విషయాన్ని ఆవి
డకెవరు చెప్పారో మాత్రం చెప్పలేదు. ఒక
వేళ తను అడిగినా "మీ బండారాన్ని బయ
టపెట్టిన వాళ్ల గురించి ఆరా తీస్తున్నారే
తప్పు చేసింది ఛండాలప్పుని అని ఒప్పు
కోరేం? " అంటూ ఎదురు ప్రశ్నిస్తుంది.
అందుకే అడగలేదు. ఓ నిస్సహాయురాలికి
సాయపడ్డం మానవత్వమనిపించుకుంటుం
దిగానీ ఇంతగొడవకి దారి తీస్తుందనుకో
లేదు. కళ్యాణికి ఎవరు చెప్పారన్న
విషయం పక్కనపెడితే ఆవిడ తన మీద
నిఘా వేసిందనే విషయం మాత్రం
స్పష్టంగా అర్థమవుతోంది. మర్నాడు వెళ్లి
విజయ్‌తో ఈ మేటర్ డిస్కస్ చేద్దామనుకు
న్నాడుగానీ వెంటనే ఆ అభిప్రాయాన్ని
మార్చేసుకున్నాడు. వాడి సలహా వల్లే
ఇదంతా వచ్చింది కాబట్టి వాణ్ణి అడక్కుండా
వూరుకోవడమే మంచిది.

"నీ సలహావల్లే ఇలా జరిగింది"అని చెప్తే
వాడు బాధపడతాడు. వాడు తన ప్రాణమి
త్రుడు. ఉద్యోగానికి సెక్యూర్టీ కట్టిందీ వాడే!
తనకి పెళ్లి జరిపించిందీ వాడే. అంచేత
వాడి మనసునొప్పించకూడదని తన బాధని
తనే దిగమింగుకున్నాడు.



లాయర్ మాలతీదేవి భర్త శామ్యూల్
సింగపూర్ నుంచి నెల రోజులు శెలవు
మీద వచ్చాడు. అతను ఎత్తుగా, ఎత్తుకి
తగ్గ పుష్టిగా, ఎర్రగా, రొమాంటిగ్గా, సినిమా
హీరోలా వున్నాడు. అతను జీవితాన్ని
థియరిటికల్‌గా చూడ్డం మానేసి ప్రాక్టిక
ల్‌గా చూడ్డానికి అలవాటు పడిపోయాడు.
మంచి భాష, మంచి గొంతు మాత్రమే
కాదు మంచి కల్చరు, జీవితాన్ని ఔపోసనప
ట్టిన ప్రజ్ఞ, అనుభవం కూడా కలిగినవా
డన్న విషయం అతన్తో ఓ పది నిమిషాల
పాటు మాట్లాడిన వారెవరికైనా తెల్సిపో

తుంది. అతను రావడానికి ముందురోజే వంశీ నటించిన డైలీ సీరియల్ ప్రసారం ఆరంభమయింది. మాలతి అందులో కన్పించిన వంశీని చూపించింది. ఆ రోజు వంశీ సిటీకేబుల్లో న్యూస్ కూడా చదివేడు. అప్పుడు చూపించి వంశీ గురించి, కళ్యాణి గురించీ, వారి విచిత్ర మనస్తత్వాల గురించీ చెప్పింది.

శామ్యూల్ నవ్వి "అలాంటివాళ్లు నీకు ఫ్రెండ్స్‌గా దొరికితే నువ్వు లాయర్‌గానూ ఆలోచించొచ్చు, మానవత్వం వున్న మనిషి గానూ ఆలోచించొచ్చు" అంటూ మర్నాడు వాళ్లని డిన్నర్‌కి పిలవమన్నాడు.

మర్నాడు మాలతి వెళ్లి వంశీని, కళ్యాణిని ఆ రాత్రికి డిన్నర్‌కి రమ్మని ఆహ్వానించింది. అప్పటికి వారిద్దరూ తూర్పుపడమరల్లా వున్నా పిలిచింది తమ శ్రేయోభిలాషి కాబట్టి, అందులోనూ వాళ్లాయనగారు సింగ పూర్‌నించి వచ్చిన సందర్భంగా కాబట్టి డిన్నర్‌కి అంగీకరించక తప్పలేదు.

ఆ రాత్రి శామ్యూల్‌తో పరిచయ కార్యక్ర మాలు అయేక సింగపూర్ విశేషాలు కాస్సేపు చెప్పాడు. అతని వాగ్ధోరణికి వంశీ, కళ్యాణి ఇద్దరూ మంచి శ్రోతలయిపోయారు తప్ప ఏమీ ప్రశ్నించలేకపోయారు. తర్వాత భోజన కార్యక్రమం ఆరంభమయింది. పని మనిషి నాగరత్నం వడ్డించింది. దాదాపు అన్నీ నాన్‌వెజిటేరియన్ వంటకాలే వడ్డిం చారు. అందరితో పాటు మాలతి కూడా నాన్‌వెజ్ తింటుంటే కళ్యాణి కాస్త ఆశ్చర్య పోయి "మీరూ నాన్‌వెజ్ తింటారా? " అని అడిగింది.

ఆ ప్రశ్నకి శామ్యూల్, మాలతి ఒకర్నొ కరు చూసుకుని చిన్నగా నవ్వుకున్నారు. "ఏం తినకూడదా? " అంది మాలతి నవ్వు తూనే.

"అలా అని కాదుగానీ..." కళ్యాణి ఆ వాక్యాన్ని పూర్తి చేయకుండానే ఆగిపో యింది.

శామ్యూల్ చెప్పాడు. "మీ సందేహం నాకు అర్థమైందండి. కానీ నేనో విషయం చెప్తాను. మా సింగపూర్‌లో నాతో పని చేసే నలుగురు దొరలున్నారు. అందులో ఇద్దరు ఆస్ట్రేలియానించి, మరో ఇద్దరు లండన్ నించీ వచ్చారు. సాధారణంగా దొరలు అనగానే వాళ్లు నాన్‌వెజ్జే తింటారని అందరూ అనుకుంటారు. కానీ వాళ్లు నలు గురూ నాన్‌వెజ్ తినరు. ప్యూర్ వెజిటేరి యనే తింటారు. సో వాళ్లనిబట్టి మనకి తెల్సిందేమిటి? ఇవాళ చాలామంది వారి వారి ఆరోగ్యాలు, అభిరుచుల రీత్యా ఆహా రాన్ని తింటున్నారు తప్ప కులాల్నిబట్టి, మతాల్నిబట్టి భోజనాలు లేవండి. జిహ్వా కుండే రుచి ఎవరికైనా ఒక్కటే! పదిమందీ చూస్తుండగా కులానికీ కట్టుబాట్లకీ కట్టుబడి వెజిటేరియన్ తింటూ దొంగచాటుగా నాన్ వెజిటేరియన్ తినేవాళ్లకంటే పబ్లిగ్గా ఎవరి క్కావలసిన తిండి వాళ్లు తినడంలో తప్పేం వుంది? మా కంపెనీలో మరో ఇద్దరు ఇండియన్ ఇంజినీర్లున్నారు. వాళ్లు అగ్రకు లస్థులు. వాళ్ల కులాచారం ప్రకారం వాళ్లు నాన్ వెజిటేరియన్ తినకూడదు. కానీ వాళ్లు సింగపూర్‌లో ప్రతీ రోజూ నాన్‌వెజ్ లేందే భోంచెయ్యలేరు. దానికేం అంటారు? మన ఇష్టాలు, మన అభిరుచులు మన చేతుల్లో వుండాలండీ. ఎవడిక్కావలసిన తిండివాడు తినడం దేశద్రోహం కిందకి రాదు" అన్నాడు.

మాలతి కూడా నవ్వుతూ "నా పెళ్లి విష యంలోనే నా నిర్ణయాన్ని నేనే తీసుకు న్నాను. అలాంటిది నా భోజన విషయంలో మరొకరి ఎప్రూవల్ ఎందుకు? పైగా నేను కులానికీ మతానికీ అతీతంగా మరో మతం వాణ్ణి పెళ్లాడినప్పుడు ఇలాంటి చిన్నచిన్న విషయాల గురించి ఆలోచించడం అవసర మంటారా? " అంది.

కళ్యాణి ఔననిగానీ, కాదనిగానీ చెప్పలేక

పోయింది. భోజనంలోని అన్ని ఐటమ్స్ రుచి చూశాక "అన్ని పదార్థాలు అదిరిపోయేలా వున్నాయి. ఏ హోటల్నించి తెప్పించేరు?" అని అడక్కుండా వుండలేకపోయాడు వంశీ.

"ఇవి హోటల్నించి తెప్పించినవి కాదండి. ఇంట్లో చేసినవే" అన్నాడు శామ్యూల్.

కళ్యాణి నాగరత్నం వైపు నవ్వుతూ చూసి "నీ గురించి ఏంటో అనుకున్నాను. కానీ వంటలు చెయ్యడంలో నువ్వు నిజంగా పద్మశ్రీవే" అంటూ కాంప్లిమెంట్ చేసింది.

నాగరత్నం సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ "థాంక్సమ్మగారూ థాంక్సు" అంది.

శామ్యూల్ పగలబడి నవ్వుతూ నాగరత్నానికి రిటార్ట్ ఇచ్చాడు.

"అక్కడికి వంటకాలన్నీ నిజంగా నువ్వే వండేసినట్టుగా అలా మెలికలు తిరిగిపోతావేంటి తల్లీ! కళ్యాణిగారూ ఈ వంటల్లో సెవెన్టీ పెర్సెంట్ చేసింది మా మాలతే! మిగతా థర్టీ పెర్సెంట్ చేసింది నేనేనండి"

కళ్యాణి అతను చెప్పిన మాటల్ని నమ్మలేక "మీరు ఓ పెద్ద ఇంజినీరై వుండి వంటలు..." సణిగింది.

"ఇంజినీర్లు వంట చేయకూడదనే రూలుందా? మీకు ఇందాకే చెప్పాను, నేను దేన్నయినా ప్రాక్టికల్‌గానే ఆలోచిస్తానని. మీరో విషయం ఆలోచించండి. భోజనమైతే అందరూ చేస్తారు. కానీ అందులో వంట ఎంతమంది చేస్తారు? పైగా భోజనం చెయ్యకపోతే మనం బతకలేం అనుకున్నప్పుడు ఆ భోజనం ఎలా వండాలో నేర్చుకోవడంలో తప్పేం వుంది? అలా అని నేను మగాళ్ళందర్నీ వంట నేర్చుకోమని చెప్పడం లేదు. నాకు వంట చెయ్యడం ఓ హాబీ. నేను సింగపూర్‌లో అప్పుడప్పుడు స్వయంగా వంట చేసుకుని నాకు ఇష్టమైన పదార్థాల్ని వండుకు తింటాను. తీరికున్నప్పుడు మా ఆవిడకి వంట పనిలో సాయం చేస్తుండే వాణ్ణి! ఆ సమయంలో మేం ఇద్దరం లైఫ్‌పార్ట్‌నర్స్‌గానే ఫీలవుతాం తప్ప నేనో ఇంజినీర్ననిగాని, ఆవిడో లాయర్ అని గానీ గుర్తు పెట్టుకోం"

శామ్యూల్ అలా చెప్తూనే తన భోజనాన్ని ముగించాడు. అందరూ హాల్లోకొచ్చి సోఫాల మీద కూర్చున్నారు.

వారి సంభాషణ రకరకాల విషయాల మీదకి వెళ్ళింది. శామ్యూల్ జీవితంలోని ఏ విషయాన్నైనా థియరిటికల్‌గా కాకుండా ప్రాక్టికల్ దృష్టితో చూడమంటున్నాడు. కళ్యాణికి ఆ మాటలు సరిగా అర్థంకాక "థియరీకీ, ప్రాక్టీస్‌కి మధ్యనుండే తేడా ఏంటండి?" అని అడిగింది.

"మరేంలేదండి. మీరు అడిగిందానికి చాలా ఉదాహరణలు చెప్పొచ్చు. ఫరెగ్జాంపుల్, మన సమాజంలో వుండేవాళ్ళంతా మంచివాళ్ళే అయితే చాలా బ్రహ్మాండంగా వుంటుందనేది ఓ మధురమైన ఆలోచన. అంటే అది థియరిటికల్! మనం కోరుకున్నట్టుగా అందరూ మంచివాళ్ళే అయితే ఏ సమస్యావుండదు. కానీ వాస్తవంగా ఆలోచిస్తే అందరూ మంచివాళ్ళే వుంటున్నారా? నిజం చెప్పండి. అందరూ మంచివాళ్ళే వుంటున్నారా? నో! మన చుట్టూవున్న వాళ్ళలో కొంతమందైనా చెడ్డవాళ్ళుంటున్నారు. వాళ్ళు మన బంధువులు కావచ్చు, స్నేహితులు కావచ్చు, ఎట్లీస్ట్ మన ఇరుగు పొరుగు వాళ్ళు కావచ్చు. అయినా వాళ్ళతో కొన్నాళ్ళు గొడవపడి, కొన్నాళ్ళు రాజీపడే బతికేస్తున్నాం. ఔనంటారా? కాదంటారా? ప్రాక్టికల్‌గా ఆలోచించడమంటే ఇదే. మన చుట్టూవున్న వాళ్ళు మంచి మనుషులు కాదని అసహ్యించుకుని ఏ అడవిలోకో పారిపోయి కాపురం పెట్టలేంగా! ఒకవేళ పెట్టినా మనలాగే మరికొంతమంది ఆలోచించుకుని అదే అడవికి పారిపోయొచ్చి కాపురం చెయ్యడం ఆరంభిస్తే మళ్ళీ అక్కడ కూడా మరో సమాజం ఏర్పడుతుంది. మళ్ళీ అక్కడ కూడా మంచీచెడులు ఆరంభమవు

తాయి. ఇలాంటివన్నీ వాస్తవ దృష్టితో ఆలో చిస్తే తెలిసే నిజాలు. అయితే కొన్ని అసాధ్యమైన వూహలు కూడా విని ఆనందించడానికి చాలా బావుంటాయండి. మాటవర్సకి ప్రేమికులు వాస్తవ ప్రపంచంలోనించి నాలు గడుగులు పైకెగిరి "నింగీ నేలా కలిసిన చోట నీవూ నేనూ ఇల్లు కట్టుకుందాం" అనుకుంటుంటారు. అది కవిగారి భావుకత. సముద్రం ఒడ్డున నిలబడి చూస్తే సముద్రం చివరి అంచు, ఆకాశం తొలి అంచు కలిసిపోయినట్టుగా కనిపిస్తుంది. కానీ వాస్తవానికి ఆ రెండూ ఎప్పుడూ ఎక్కడా కలవ్వు. కలవడమే అసాధ్యమైన చోట నా బోటివాడెవడైనా ఓ చిన్న ఇల్లు కట్టుకుందామంటే అది జరిగే పనేనా? ఇక్కడ మనం ఓ ఇల్లు కట్టుకుందామంటేనే మున్సిపల్ కార్పొరేషన్‌వారి పర్మిషన్లు, వుడావారు, హుడా వారు ఇచ్చే పర్మిషన్లు, చెప్పే అభ్యంతరాలతో మన బుర్ర దిమ్మెక్కిపోతుంది. అలాంటిది నింగీ నేలా కలిసిన చోట మనమెలా ఇల్లుకట్టగలం? ఎక్కడ పునాదులు తవ్వుతాం? ఆకాశంలోనా? సముద్రంలోనా? "

అతను మాట్లాడిందానికి అందరూ పగలబడి నవ్వేరు. అతనూ నవ్వుతూనే "మనం కొన్ని కవిగారి భావనల్ని వూహలవరకు సరిపెట్టుకుంటేనే చక్కగా ఎంజాయ్ చెయ్యగలుగుతాం. వుదాహరణకి 'పద్మాక్షి, నీరజాక్షి' అనే వర్ణనలకి అర్థం ఏంటి? పువ్వులవంటి కన్నులు కలిగిన అనేకదా! అంటే పువ్వులంత అందమైన కన్నులు అనే అర్థంలోనే ఆలోచించాలి తప్ప నిజంగా ఓ అందమైన ముఖానికి కళ్ళుండే స్థానంలో రెండు పువ్వుల్ని వూహించుకుంటే ఎంత ఇబ్బందికరంగా వుంటుంది? అంచేత అందమైన కొన్ని వర్ణనలని అంత అందంగా వూహించుకుంటేనే బావుంటుంది తప్ప అలాంటి వాటికి ప్రాక్టికల్ దృక్పథం మంచిదికాదు. మన జీవితాలకు్కూడా థియరీ, ప్రాక్టీస్ కూడా అవసరమేనండి. 'ఎ థియరీ వితవుట్ ప్రాక్టీస్ ఈజ్ యూస్‌లెస్! ఎ ప్రాక్టీస్ వితవుట్ థియరీ ఈజ్ డేంజరస్'.

ఉదాహరణకి మనం ఈత నేర్చుకోవడం ఎలా అనే పుస్తకాల్ని ఎంత చదివేసినా ఒక్కసారైనా నీట్లోకి దిగి ఈదకపోతే తెల్సుకున్న థియరీ అంతా వృధా అయిపోతుంది. అలాగే ఈత గురించి ఫండమెంటల్స్ కూడా తెల్సుకోకుండా ఏట్లోకి గెంతేసి ఈదాలనుకోవడం ప్రమాదాలకి దారితీస్తుంది"అన్నాడు.

శామ్యూల్ మాటల్లో సౌమ్యత వుంది, సత్యం వుంది. ముఖ్యంగా ఆ మాటల్ని ఎదుటివారి హృదయాల వరకు చేరవేయగల చతురత ఆ మాటల్లో దాగివుంది. అందుకే వంశీ, కళ్యాణి నాగస్వరం వింటున్న నాగుల్లా మనసులనే పడగలు విప్పి అవాక్కై వుండిపోయారు. కాస్సేపు మరేదో టాపిక్ వాళ్ల మధ్య అటూ ఇటూ తిరిగేక కళ్యాణి మళ్లీ తన ఆసక్తిని వ్యక్తపరిచింది.

"ఇంతకీ భార్యాభర్తలెలా వుండాలో చెప్పలేదు. మీరు"

శామ్యూల్ వెంటనే జవాబు చెప్పకుండా కళ్యాణిని, వంశీని మార్చిమార్చి చూసి "మీ ఉద్దేశ్యం ఏంటో ముందు చెప్పండి కళ్యాణిగారూ. భార్యాభర్తలు ఎలావుంటే బావుణ్ణనుకుంటున్నారు? " అని అడిగాడు.

"నాకంటూ ప్రత్యేకమైన ఒపీనియన్ ఏమీలేదండి. అక్కడక్కడా విన్నదీ, చదివిందీ..."

"పోనీ, అందులో మీకు నచ్చిందే చెప్పండి"

"చిలకా గోరింకల్లా వుంటే బావుంటుందంటారుకదా"

"ఆ మాట ఎవరన్నారు? కవులన్నారు. ఎందుకంటే అదో అందమైన వూహ! చూడ్డానికి ఆహ్లాదంగా వుండే చిలక, మనోహ

రంగా కూయగలిగే గోరింక... యీ రెండూ కలిస్తే బావుంటుందనే ఓ మధురమైన వూహే యీ కాంబినేషన్! అంటే, బంగారానికి తావి అబ్బినట్టుగా అంటుంటాం కదా, ఇదీ అలాంటిదే. ఎంతో విలువ కలిగిన బంగారానికి సువాసన కూడా అబ్బితే అద్భుతంగా వుంటుంది. కానీ అలా అబ్బుతుందా? ప్రాక్టికల్‌గా ఆలోచించి చూస్తే అది జరిగేపని కాదని తేలిపోతుంది. పైగా మనం మనుషులం కాబట్టి మనుషుల్లాగే బతకాలితప్ప పక్షుల్లా బతకాలనెందుకు కోరుకోవాలి? పక్షులకి మానవులకుండే అనుమానాలు, అపార్థాలు, అపోహలు, ఆవేశాలు... యిలాంటి ఫీలింగ్స్ వుండవు. దేర్‌ఫోర్, వాటితో పోల్చుకోవడం కరక్ట్ కాదేమోనని నాకనిపిస్తోంది"

అతను చెప్పింది అక్షరాలా కరెక్టేనని వంశీ కూడా అంగీకరించాక శామ్యూల్ మరింత వుత్సాహంగా వంశీని అడిగాడు. వంశీ కొన్ని క్షణాలు తడబడినా "సీతారాముల్లా వుండాలని పెద్దలూ అంటారు. పురాణాలూ చెప్తున్నాయి కదండి" అన్నాడు.

శామ్యూల్ కాస్సేపు మౌనంగా వుండిపోయి, ఏదో ఆలోచిస్తూనే మాట్లాడుతూ "రామాయణంలో వర్ణించిన ప్రకారం సీతారాముల జంట చాలా ఆదర్శనీయమైనదే! నేనూ ఒప్పుకుంటాను. కానీ, ఆ దాంపత్యం ఏ కాలానికి ఆదర్శనీయం?

"సర్వకాలాలకీ ఆదర్శమయిందని పెద్దవాళ్ళంటారు. కానీ ప్రాక్టికల్‌గా ఆలోచిస్తే సమకాలీన వ్యవస్థ ప్రభావంతో బతుకుతున్న మనబోటి వాళ్ళకా దంపతులు అంత ఆదర్శనీయం కారేమోననిపిస్తోంది. వివాహమంటే ఏడుజన్మల బంధమని భావిస్తాం. అలాంటి మనదేశంలోనే ఎంతమంది విడాకులు తీసుకుంటున్నారో తెలుసా? కోర్టుకి రాని కేసుల సంగతి వదిలెయ్యండి. కోర్టుకెక్కి విడాకులు తీసుకుంటున్న వాళ్ళల్లో ఎక్కువమంది ఆడవాళ్ళేనని తెల్సినపుడు మనకి ఆశ్చర్యం కలుగుతుంది కదా. ఏ సమస్య వచ్చినా ఆడది సీతాదేవిలా సహనం వహించాలనే సిద్ధాంతానికి కట్టుబడి వుంటే యివాళ దేశంలో యిన్ని మహిళా కోర్టులెందుకు పుట్టుకొస్తాయి. ఏదో ఒకరకమైన అసంతృప్తి, ఆవేదన, అసమానత్వం, అణచివేత, యిలా ఎన్నో కారణాలవల్ల ఆడవాళ్ళు వివాహబంధాన్ని తెంచుకోడానికి కోర్టుకెక్కుతున్నారు. అలాంటి వాళ్ళందరికీ సీతాదేవి గురించి తెలియదా? ఆవిడకుండే సహనం గురించి తెలీదా? తెలుసు. అయినా వాళ్ళకేర్పడిన ఆవేదన, అసంతృప్తి నుంచి బయటపడి బతకాలనుకున్నప్పుడు దిస్ సో కాల్డ్ సీతాదేవి, సావిత్రి, సుమతి, చంద్రమతుల్ని గుర్తు చేస్కోడంలేదు. వాళ్ళ గొప్పతనానికో దణ్ణం పెట్టేసి, తమ జీవితాలగురించి మాత్రమే ఆలోచించుకుంటున్నారు. విడాకుల విషయంలోనే కాదండి, పెళ్ళిళ్ళ విషయంలో కూడా యివాళ చాలామంది ప్రాక్టికల్ థింకింగ్‌తోనే నిర్ణయాలు తీసుకుంటున్నారు. ఎవరిదాకో ఎందుకు మా విషయమే తీస్కోండి. మా యిద్దరివైపూ వున్న ఫ్యామిలీ మెంబర్స్, మా బంధువర్గాల అభిప్రాయాలకి భిన్నంగానే మేం ప్రేమించుకున్నాం. మా వివాహానికి ఎవరూ యిష్టపడలేదు. మాలతి తరపువాళ్ళయితే వ్యక్తిగా నన్ను చాలా యిష్టపడ్డారు. కానీ పెళ్ళి విషయం వచ్చేసరికి "నలుగురూ ఏం అనుకుంటారు? " అనే భయంతోనే అభ్యంతరం చెప్పారు. ఆనాటి శ్రీరాముడు కూడా అతనో చక్రవర్తి అయి వుండి కూడా నలుగురూ ఏం అనుకుంటారనే కారణంతో, సీతాదేవి చేత అగ్నిప్రవేశం చేయించాడు. తర్వాత అడవుల్లో వదిలేశాడు. కానీ యుగాలు మారిపోయాయి. యుగధర్మం, మన ఆలోచనా ధోరణీ మారిపోతోంది

కాబట్టి, మా చుట్టూ వున్న నలుగురికోసం మేం ఆలోచించకుండా మా కోసమే మేం జీవించాలనుకున్నాం, పెళ్ళి చేసుకున్నాం. మా పెళ్ళిని కాదని దూరమైపోయిన బంధువులంతా కేవలం రెండేరెండు సంవత్సరాల్లో మనసులు మార్చుకున్నారు. సమాజంలో మేం జీవిస్తున్న విధానాన్ని చూశారు.

ఒక్కరొక్కరుగా మాకు మళ్ళీ దగ్గరవుతున్నారు. ఇలాంటి వ్యవస్థలో జీవిస్తున్నవాళ్లకి, ఆనాటి సీతారాములు ఎంతవరకు ఆదర్శమవుతారు? వారిలా మనం జీవించడానికి సిద్ధంగా వున్నామా? మీరే చెప్పండి"

శామ్యూల్ ఎంతో చక్కగా విశ్లేషించి చెప్పడం విని చాలా సంతోషపడినా ఫైనల్‌గా తమమీదకే ప్రశ్నని సంధించేసరికి కళ్యాణి, వంశీ కాస్త కంగారుపడ్డారు. అతను చెప్పిన మాటలన్నీ తన అభిప్రాయాన్ని సమర్థిస్తున్నట్టు వున్నాయనుకుంది కళ్యాణి. మరో పావుగంట తర్వాత నాగరత్నం అందరికీ టీ చేసి తీసుకొచ్చింది. "ఇప్పుడేకదా భోంచేశాం..." అంటూ కళ్యాణి సంశయిస్తూనే మాలతి అందించిన టీ కప్పుని అందుకుంది.

"భోంచేసిన అరగంట తర్వాత టీ తాగడం మావారికి అలవాటు. అది కూడా సింగపూర్‌లో అలవాటైంది. ఆయనిక్కడ వుండేటప్పుడు నేనూ ఆయన్తో పాటు తాగేస్తుంటాను' ' అంది మాలతి నవ్వుతూ.

వంశీ టీ తాగుతూనే ఏదో దీర్ఘంగా ఆలోచించడం శామ్యూల్ గమనించాడు. "వంశీగారు ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్టున్నారే" అన్నాడు.

"మరేంలేదండి. రామాయణంలోని వ్యవస్థకి ఈనాటి వ్యవస్థకి ఉన్న తేడాని చాలా చక్కగా విశ్లేషించి చెప్పారు. దాన్నిబట్టి వ్యవస్థని మీరో ప్రత్యేక కోణంలో కూడా చూడగలరని నాకు అర్థమైంది" అటూ వంశీ యింకా ఏదో చెప్పబోతుంటే శామ్యూల్ నవ్వుతూ, "నేను జీవితాన్ని ప్రేక్షకుల దృష్టితో



చూస్తాను తప్ప ప్రత్యేక దృష్టితో చూడను. మీరా విషయం మర్చిపోకూడదు" అన్నాడు.

"పోనీ అలాగే అనుకుందాం. మీ దృష్టిలో భార్యాభర్తలంటే ఎలా వుండాలి? హ్యాపీహోం అంటే ఎలా వుండాలి? ఈ విషయాలమీద మీరు డైరెక్ట్‌గా ఆన్సర్ చెప్తే సంతోషిస్తాను"

మాలతి, శామ్యూల్ ఒకర్నొకరు చూసుకుని పగలబడి నవ్వుకున్నారు. "ఎందుకు నవ్వుతున్నారండి? నేనేమైనా తప్పుగా మాట్లాడేనా? " గిల్టీగా అడిగాడు వంశీ.

"మీరు తప్పన్నారని కాదండి. మీరు మా ఆయనగారు చెప్పలేనంత పెద్దప్రశ్న అడిగేశారు. పండంటి కాపురానికి పన్నెండు సూత్రాలంటూ మా ఆయనగారు రీసెర్చ్ చేసి ఓ నవలా రాయలేదు. ఓ సినిమా తీయలేదు. అలాంటప్పుడు మీ ప్రశ్నకి ఆయన ఎలా జవాబు చెప్పగలరు?" అంటూ మాలతి శామ్యూల్ వైపు చూసి, "ఇన్నాళ్లకి మిమ్మల్ని సందేహాలు తీర్చమనే శిష్యుడు దొరికాడండి. ఇంక మీరేం చెప్తారో చెప్పండి" అంది. శామ్యూల్‌కేం చెప్పాలో అర్థం కానట్టుగా చూసి టేబుల్ మీదున్న సిగరెట్ ప్యాకెట్ తీసి సిగరెట్ వెలిగించాడు. అతను పొగని వంశీ, కళ్యాణీల మొహానికి తగిలేటట్టుగా వదులుతున్నాడు. ఆ ఇద్దరికీ సిగరెట్ పొగపడదు. కళ్యాణి కాస్త ఇబ్బందిగా ముఖంపెట్టి చేత్తో సిగరెట్ పొగని చెదరగొట్టింది. వంశీ మొహమాటస్థుడు కావడంవల్ల ఆవిడ చేసినపని కూడా చెయ్యలేక కాస్త ఊరిపిబిగబెట్టి కూర్చున్నాడు. వాళ్లిద్దర్నీ గమనించాక శామ్యూల్ మరో రెండు దమ్ములాగి సిగరెట్‌ని అక్కడున్న యాష్‌ట్రేలో పడేశాడు.

"సారీ... నేనొదిలిన సిగరెట్ స్మోక్ మీ ఇద్దర్నీ ఇబ్బంది పెట్టిందనుకుంటాను" అన్నాడు శామ్యూల్ సోఫాలో వెనక్కివాలి రిలాక్స్‌డ్‌గా కూర్చుని. కళ్యాణి ఏమీ అనలే



దుగానీ, వంశీ మాత్రం కంగారుపడుతూ "అబ్బెబ్బే అదేంలేదండి" అన్నాడు.

"భలేవారేనండి. ఎందుకంత కంగారుపడతారు? మీరు నేనొదిలిన పొగవల్ల ఇబ్బందిపడ్డారు. కాదని మీరు చెప్పినా నేనొప్పుకోను. ఎందుకంటే నేను మీ ఇద్దర్నీ ఇబ్బంది పెట్టాలనే ఆ పొగ వదిలేను"

శామ్యూల్ మాటలు వంశీ, కళ్యాణిలకే కాదు, మాలతి క్కూడా అర్థంకాక "ఏవిటండీ, మీరు వాళ్లనెందుకు ఇబ్బంది పెడతారు? " అంది.

"చెప్తాను. నేనొదిలిన పొగ వాళ్ల ముఖాలకి తగుల్తుంటే వాళ్ళకి చిరాకు కలుగుతుంది. అఫ్‌కోర్స్ మరొకరు నా ముఖంమీదకి పొగ వదిలినా నాకూ చిరాకు కలుగుతుందికదా! నేను మీకంత చిరాకు కలిగించినా మీరు లేచి వెళ్ళలేకపోయారు. ఎంచేత? అలా వెళ్ళిపోతే నన్ను ఇన్సల్ట్ చేసినట్టవుతుందని. ఏమ్ ఐ కరెక్ట్! మీరు జవాబు చెప్పకపోయినా నాకు తెలుసు. నేచెప్పింది కరెక్ట్! నాకూ మీకూ ఉన్న పరిచయం కేవలం ఓ గంటన్నర తప్పితే రెండు గంటలు. ఈ తక్కువ పరిచయానికే మీరు సహనం వహించి గౌరవం పాటించారు. అలాంటిది జీవితాంతం కాపురం చెయ్యాల్సిన దంపతుల మధ్య ఎంత సహనం అవసరం అవుతుంది? ఓ ఫ్రెండు కాస్త మర్యాదగా లేకుండా ముఖంమీదకి పొగవదిలి ఇబ్బంది పెట్టినా, అతన్తో ఫ్రెండ్షిప్పు కంటిన్యూ అవ్వాలనే సదుద్దేశ్యంతో ఈ చిన్న లోపాన్ని భరించారు. మరి... ప్రాక్టికల్‌గా ఆలోచిస్తే భార్యకి భర్త, భర్తకి భార్య మంచి స్నేహితులే అవుతారు. అందుకే మనవాళ్లు జీవననేస్తం అనే మాట ఒకదాన్ని ఉపయోగిస్తారు. జీవితాన్ని పంచుకునే నేస్తం అని నేనర్థం చెప్పినా తప్పు కాదనుకుంటాను. మరి... స్నేహితులన్నాక ఒకరిలో వున్న లోపాల్ని మరొకరు అర్థం చేస్కోవాలి, క్రమంగా దిద్దుకోవాలి. ఆ దిద్దుబాటు జరిగేవరకు సహనం వహించాలి. బహుశా భార్యాభర్తలు సుఖంగా బతకడానికిదో మంచి పద్ధతని నా అభిప్రాయం. ఈ విషయం చెప్పడానికే కావాలని మీ ముఖంమీదకి పొగవదిలేను. నాకు గతంలో రోజుకి ఇరవై ముప్పై సిగరెట్లు కాల్చే అలవాటు ఉండేది. కాని మాలతికి సిగరెట్ వాసన అంటేనే పడదు. సిగరెట్లు పూర్తిగా మానేస్తే ఆవిడ సంతోషపడుతుంది. కాని చాన్నాళ్లుగా ఉండే అలవాటుని సడన్‌గా వదిలేస్తే నేను బాధపడతాను. ఎలా? అంచేత మేమిద్దరం ఓ ఒప్పందానికొచ్చాం. ఉదయం టిఫిన్ అయ్యాక, మధ్యాహ్నం, రాత్రి భోజనం అయ్యాక ఒక్కో సిగరెట్ అంటే రోజుకి మూడు సిగరెట్లు చొప్పున కాల్చడానికి నిర్ణయించుకున్నాం. మనకి కాస్త విల్‌పవర్ వుండాలేగానీ మన అలవాట్లు మార్చుకోవడం పెద్దపనేం కాదులెండి. ఓ పదిరోజులు ప్రయత్నించాక నేను మూడు సిగరెట్లకి అలవాటు పడిపోయాను. ఈ పద్ధతికి మా ఆవిడా అలవాటుపడిపోయింది. భార్యాభర్తలన్నాక ఆమాత్రం ఎడ్జస్ట్‌మెంట్స్ వుండాలికదా. ఒకరి పద్ధతుల్ని మరొకరు విమర్శిస్తూ కూర్చుంటే వాటికే ఈ జీవితకాలం సరిపోతుంది. దానికి బదులు ఒకర్నొకరు అర్థం చేస్కోడానికి ప్రయత్నిస్తే మంచిదికదాని నా పెర్సనల్ ఒపీనియన్!

జీవితానికి టెక్నికల్ థింకింగ్, ఎడ్జస్టబుల్ మెంటాలిటీ చాలా అవసరమని నేను చెప్పగలను..."

శామ్యూల్ మరి కాస్సేపు మాట్లాడాక, మాలతి కళ్యాణికి ఓ చీర, జాకెట్ పెట్టి పంపించింది. అక్కడనించి బయలుదేరి వంశీ, కళ్యాణి ఇంటికొచ్చేవరకు, ఇంటికొచ్చాక కూడా ఏమీ మాట్లాడుకోలేదు. వాళ్ళు మౌనం వహించినా వాళ్ల మనసులు మాత్రం శామ్యూల్ చెప్పిన విషయాల గురించే ఆలోచిస్తున్నాయి.

"ఆయనేం చదివి, ఏంచూసి తెల్సుకున్నాడోగానీ జీవితం గురించి కాచివడపోసినట్టుగా చెప్పాడు" అని వంశీ అనుకున్నాడు.

కానీ కళ్యాణి ఆలోచనలు మరోదారిలో నడిచాయి.

"ఆయన చాలా బాగా చెప్పిన మాట నిజమేగానీ, చెప్పిన మాటలన్నీ నన్ను ఇన్‌డైరక్ట్‌గా మందలించడానికే చెప్పినట్టున్నాయేంటి? మాలతీదేవి గతంలో నాకు నెగిటివ్ థింకింగ్ వుండకూడదు, పాజిటివ్ థింకింగ్‌ని అలవర్చుకోవాలీ అని చెప్పింది. ఆవిడ భర్తేమో జీవితాన్ని ప్రాక్టికల్ దృక్పథంతో చూడాలీ, భార్యాభర్తల మధ్య ఎడ్జస్టబుల్ మెంటాలిటీ వుండాలీ అని చెప్పాడు. వాళ్లిద్దరూ చెప్పింది నా గురించేనా? లేక జనరల్‌గా చెప్పిందా? గతంలో నేను మాలతితో చెప్పిన విషయాల్ని, తన భర్తతో చెప్పడంవల్లే అతనిలా చెప్పాడా? లేక మధ్యలో వంశీ ఎప్పుడైనా మా ఫ్యామిలీ మేటర్స్ గురించి, నా గురించి కాస్త నెగిటివ్‌గా చెప్తే ఇప్పుడీవిధంగా నా బ్రెయిన్ వాష్ చెయ్యడానికి చెప్పాడా?"

ఇలా ఆలోచిస్తూనే క్రమంగా నిద్రలోకి జారిపోయింది.



విజయ్‌కుమార్ ఎంత కాదనుకున్నా శృంగారపురుషుడు. అతను అప్పుడప్పుడు పరాయిస్త్రీలతోను, కిరాయి స్త్రీలతోనూ రొమాన్స్ జరపడం అతని సర్కిల్లో అందరికీ తెలిసిన విషయమే. అతని మనసులోని కోరికలకి, అతనికి ఆయాచితంగా లభించిన ఆస్తి మరింత బలాన్ని అవకాశాల్ని సమకూర్చింది. తను చేస్తున్న పని తప్పా? ఒప్పా? అని తననితాను ఏనాడూ ప్రశ్నించుకోలేదు. ఇతరులు ప్రశ్నించడానికి వీలుగా, అతనెప్పుడూ ఏ అవకాశమూ ఇవ్వలేదు. అందుక్కారణం అతను నడిపించే శృంగార కార్యక్రమాల్ని చాలా గోప్యంగా జరిపించడమే! అతనికుండే ఆర్థికబలం, మానసిక బలహీనతల్ని గురించి పూర్తిగా తెలిసినవాడూ, ఆ దారిలో నడవొద్దని మందలించివాడూ ఒక్క వంశీకృష్ణే! అతని మందలింపుల్ని ఎప్పటికప్పుడు ఖండిస్తున్నా, వాటి ప్రభావంనించి మాత్రం విజయ్ తప్పుకోలేకపోయాడు. అదో కారణం కాగా కొత్తగా వచ్చిన ఫ్యాక్టరీ బాధ్యతలు మరో కారణం అవడంవల్ల ఈమధ్య విజయ్ తన దూకుడుని చాలావరకు తగ్గించుకున్నాడు. కానీ ఆ జీవితాన్ని వదిలెయ్యలేదు. అతనికి రెండు మూడురోజుల్నించి అప్పుడప్పుడు కడుపునెప్పొచ్చి ఓ పదినిమిషాల పాటు తీవ్రంగా బాధపెట్టి అంతలోనే సర్దుకుపోతోంది. విజయ్ స్వతహాగా మొండివాడు. చిన్నాచితకా జలుబూ జ్వరాలకి లొంగిపోయి డాక్టర్ల దగ్గరకి పరుగెత్తే మనిషి కాదు. మరీ అతని మొండితనాన్ని అధిగమించి అతన్ని పేషెంట్‌గా మార్చేస్తే తప్ప మందులు కూడా వేస్కోడు. అందుకే రెండురోజులుగా కడుపునెప్పి వచ్చి కాసేపు బాధపెట్టినా, వాంతి అయ్యే ఫీలింగ్ కలిగినా ఓ పదినిమిషాల్లో మళ్ళీ నార్మల్ కండీషన్‌కొచ్చేస్తుండడంవల్ల ఏ డాక్టర్ దగ్గరకీ వెళ్లలేదు. భార్య రజనీకీ చెప్పలేదు. ఫ్రెండ్ వంశీకీ చెప్పలేదు. వంశీ గత

మూడు నాలుగురోజులుగా కలవలేదు. ఫోన్ కూడా చెయ్యలేదు.

వంశీకి ఆఫీస్‌లో వర్క్‌లోడ్ ఎక్కువైపో యింది. లంచ్ కూడా తన టేబుల్ దగ్గరే ముగించి మళ్ళీ ఆఫీసుపనిలో నిమగ్నమైపో తున్నాడు. పైగా టైపిస్ట్ కృష్ణమోహన్ లాంగ్‌లీవ్‌లో వున్నాడు. స్టెనో కమ్ టైపిస్ట్ జయలత వాళ్లమ్మగార్ని డాక్టర్ చెకప్‌కి తీసుకువెళ్ళాలని హాఫ్‌డే సెలవు పెట్టింది. టైప్ చెయ్యవలసిన పేపర్స్ చాలా వున్నాయి. హాల్లో వున్న టైప్‌మిషన్ దగ్గర తనే కూర్చుని పేపర్స్ టైప్ చేస్తుంటే రాంబాబు వగైరా కొలీగ్స్ వచ్చి "ఏంటి బాసూ మీరు టైపు చేస్తున్నారు. ఇదేం బాగాలేదే" అన్నారు జోవియల్‌గా.

"నాకు టైపింగ్ కూడా వచ్చు నా అవస రమే నాచేత టైపింగ్ చేయిస్తోంది" టైప్ చేస్తూనే సమాధానం చెప్పాడు.

వాళ్లు అంతటితో వూరుకోకుండా "మాక్కూడా టీవీ సీరియల్స్‌లో వేషాలి ప్పిస్తే నీ పేరు చెప్పి వేస్కుంటాం, నాలుగు డబ్బులు చేస్కుంటాం" అన్నారు.

వంశీకి విసుగు, చిరాకు కలిగి, "చూడండి ఆఫీస్ అవర్స్‌లో ఆ టాపిక్కు మాట్లాడ్డమే తప్పు. మీ పని మీరు చేస్కోండి. నా పని నన్ను చేస్కోనివ్వండి. లేదా మీ పని మీరు చేసినా చెయ్యకపోయినా నాపని నన్ను చేస్కోనివ్వండి" అంటూ సీరియస్‌గానే చెప్పాడు.

వాళ్లు కాస్త ఆశ్చర్యంగా ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. రాంబాబు తమా షాగా భుజాలు ఎగరేసి, "మన బాస్‌కివాళ మూడ్ ఏమీ బాగులేదురా! ఇవ్వాళ్టికి మనం కూడా బుద్ధిగా ఉద్యోగం చేస్కుందాం పదండి" అంటూ మిగతావార్ని కూడా తీసు కుని వెళ్ళిపోయాడు.

వంశీకి హాల్లో అందరి మధ్యా కూర్చుని టైపుచెయ్యడం ఇబ్బందిగానే వుంది. అందుకే ప్యూన్ రంగారావుని పిలిచి టైపు మిషన్ని తన కేబిన్‌లో పెట్టించి అక్కడే కూర్చుని టైప్ చేసుకోసాగాడు.

ఆరోజు విజయ్ కారు డ్రైవ్ చేసుకుంటూ పది గంటల ప్రాంతంలో ఆఫీసుకి బయ లుదేరాడు. దారిలో ఓ బస్‌స్టాప్ దగ్గర శ్రీలత అనే అందమైన అమ్మాయి కనిపిం చింది. కారుని ఓ పక్కకి టర్న్‌చేసి ఆపాడు. కారులో కూర్చునే దూరంగా నిల బడిన శ్రీలతని ఒకటికి రెండుసార్లు నిశి తంగా చూసి ఆవిడ శ్రీలతేనని కన్ఫర్మ్ చేసుకున్నాడు. కాకపోతే సదరు కాల్‌గర్ల్ శ్రీలత చెన్నై వెళ్లిపోయి సెటిలైపోయిందని విన్నాడు. కానీ ఇప్పుడిక్కడ హఠాత్తుగా కని పించింది. శ్రీలత ఒకవిధంగానే కాదు ఏ విధంగా చూసినా కాల్‌గర్లే. కాకపోతే ఆవిడ తిరిగేదంతా పెద్ద పెద్ద సర్కిల్స్‌లో నేనని గతంలో విన్నాడు. ఆవిడకున్న అందం భగవంతుడిచ్చిన వరమే. తన అందాన్ని ఎలా కేష్ చేసుకోవాలో బాగా తెలుసు. తనకి ఆదాయాన్ని తెచ్చిపెట్టే అందాన్ని ఏవిధంగా చెక్కుచెదరకుండా కాపాడుకోవాలో అంతకంటే బాగా తెలుసు. ఆ విషయాన్ని ఇప్పుడావిణ్ణి చూశాక నిర్ధా రించుకున్నాడు. ఆవిడతో విజయ్‌కి కొద్ది పాటి పరిచయం వుంది. పెళ్లికాకముందు ఆవిడ అందానికి ఆశపడ్డా, ఆ అందాన్ని అద్దెకు తెచ్చుకోగల ఆర్థిక శక్తి అప్పట్లో వుండకపోవడంవల్ల తన కోరికను పీకనొక్కి చంపేశాడు. కానీ ఆ కోరిక పూర్తిగా చావ లేదని, ఇంకా కొనవూపిరితో బతికేవుందను కున్నాడు. లేకపోతే దూరంనించి శ్రీలతని చూడగానే ఎలా గుర్తుపట్టి కారు ఆపు తాడు? ప్రస్తుతం ఆవిడ ఈ రూట్‌లో వుందో, లేక రూట్ మార్చేసిందో అర్థం కావడంలేదు. స్వగతాలు పలుక్కోవడం మానేసి డైరెక్ట్‌గా వెళ్లి పలకరించి ముఖస్థం గానే తేల్చుకుందామని కారుదిగి ఆవిడ దగ్గ రకెళ్లి పలకరించాడు. తన పేరు చెప్పి ముఖానికున్న కళ్లద్దాలు తీశాడు.

"నేను గుర్తున్నానా? నా పేరు విజయ్ కుమార్, ఆర్టిస్ట్" అని పరిచయం చేసుకున్నాడు.

అతన్ని గుర్తుపట్టడానికి ఆవిడ రెండుక్షణాలు కూడా టైమ్ తీస్కోలేదు. "యా... యా... మీరు డ్రామా ఆర్టిస్టకదూ! ఓసారి రవీంద్రభారతిలో వేసిన మీ నాటకానికొచ్చి మిమ్మల్ని కంగ్రాచ్యులేట్ చేశాను కూడా" అంది ఎంతో ఆత్మీయుడితో మాట్లాడినంత చనువుగా.

ఆ సమయంలో ఇద్దరు వృద్ధదంపతులు మినహా మరెవరూ బస్‌స్టాప్‌లో లేరు. వాళ్లు కూడా ఏదో మాట్లాడుకుంటున్నారు తప్ప వీళ్ల గురించి పట్టించుకోవడంలేదు. విజయ్ తన గతం గురించి డిటైల్స్‌లో కెళ్లకుండా వర్తమానంలో తను ఏవిటో, తన హోదా ఏంటో మాత్రం చెప్పాడు.

"వెరీగుడ్ కంగ్రాచ్యులేషన్స్. మీరీసూట్‌లో కారులోనించి దిగేసరికే మీ పొజిషన్ మారిపోయుంటుందనుకున్నాను" అంది నవ్వుతూ. ఆ తర్వాత ఆవిడే మాట్లాడుతూ, "కొన్ని పెర్సనల్ రీజన్స్ వల్ల చెన్నై వెళ్లిపోయానండి. ఇప్పుడు కూడా ఓ స్నేహితురాల్ని చూడ్డానికి ఈ ఊరొచ్చాను. టాక్సీ కోసం వెయిట్ చేస్తూ నీడగా వుంటుందిక దాని ఈ బస్‌స్టాప్‌లో నిలబడ్డాను" అంది.

ఆవిడతో ఎలాంటి టాపిక్ రైజ్ చెయ్యడమా అని ఆలోచిస్తున్నాడు. ఎందుకంటే ఆవిడ కట్టిన చీరదగ్గర్నించి పట్టుకున్న హాండ్‌బ్యాగ్‌వరకు చాలా ఖరీదైనవిలాగే కనిపిస్తున్నాయి. స్వతహాగా ఆవిడ అందంలో హుందాతనం కూడా కనిపిస్తుంది. పాతరూట్ వదిలేశారా అని అడిగితే? వదలకపోతే ఏ సమస్యా లేదు. కానీ వదిలేసి వేరే జీవితం సాగిస్తే మాత్రం ఆవిడ గొడవ చెయ్యొచ్చు కేక వెయ్యొచ్చు నలుగుర్నీ పిలవొచ్చు కానీ ఆవిడ మాట్లాడుతున్న విధానం, చూస్తున్న చూపులు మాత్రం ఎంకరేజింగ్‌గానే వున్నాయి. అందుకే తెగించి "బహుశా మీరు మీ పాత రూట్ వదిలేశారనుకుంటాను" అన్నాడు మెల్లగా.

ఆవిడ ఎటువంటి రియాక్షనూ ఇవ్వకుండా "ఎందుకొదిలెయ్యాలి?" అంది ముక్తసరిగా.

అంతే మరో నిమిషం తర్వాత ఇద్దరూ కారు ఎక్కారు. కారు స్టార్ట్ చేస్తున్నప్పుడే అతని కడుపులో నెప్పి స్టార్టయింది. హోటల్ కెళ్లేలోగా తగ్గిపోతుందిలే అని మొండికెత్తి కారు స్టార్ట్ చేశాడు. త్రీస్టార్ హోటల్స్ రెండింటికి వెళ్ళి అడిగినా రూమ్ దొరకలేదు. కడుపులో నెప్పి అతను అనుకున్న విధంగా తగ్గుముఖం పట్టలేదు. క్రమంగా అది పెరుగుతూ అతని సహనానికి పరీక్ష పెడుతున్నా తమాయించుకుంటున్నాడేగానీ శ్రీలత తన బాధని గమనించకుండా జాగ్రత్త పడుతున్నాడు. ఎదురుగా హోటల్ అజంతా కనిపించగానే కారుని ఆ కాంపౌండ్‌లోకి పోనిచ్చాడు. తన స్టేటస్‌కి తగిన హోటల్ కోసం వెదకడానికి కడుపునెప్పి అనుమతించడంలేదు. అజంతా హోటల్‌ని స్టార్ హోటల్ లిస్టులో వెయ్యకూడదుగానీ అది కూడా సదుపాయంగానే వుంటుందని ఎప్పుడో ఎవరో చెప్పినట్టు గుర్తు! అందుకే ఆ హోటల్లో డబుల్‌రూమ్ తీసుకున్నాడు. అయితే అది చాలా సదుపాయాలున్న హోటలనే విషయం ఓ ఏడాది క్రితం నాటిమాట. గత ఆరేడు నెలల్లో ఇద్దరు ప్రముఖ స్మగ్లర్లు ఇదే హోటల్లో పోలీసులకి దొరకడంవల్ల పోలీసుల నిఘా ఆ హోటల్‌మీద పడింది. దాంతో జెంటిల్మేన్‌లనిపించుకున్న వాళ్లెవరూ ఆ హోటల్లో దిగడం మానేశారు. దాంతో ఆ హోటల్ పేకాటలాడుకునే గాంబ్లర్స్‌తోనూ, పగటిపూట వ్యభిచారం చేసేవాళ్లతోనూ బిజీగా వుంటోంది. పోలీసులకి కేసులు దొరకనప్పుడు పగలూ రైడ్ చేస్తున్నారు, రాత్రీ రైడ్ చేస్తున్నారు. వాళ్లకి కనీసం ఓ ఇద్దరైనా

శ్రోతల్ని, కొంతమందైనా గేంబ్లర్స్ని దొరుకుతున్నారు. ఈ విషయం విజయ్‌కి తెలీదు. ఆ వూరు వదిలేసి రెండేళ్లయింది కాబట్టి శ్రీలతకీ తెలీదు. రూమ్‌లో కెళ్లగానే విజయ్ మంచంమీద పడిపోయి, బాధతో మెలికలు తిరిగిపోయేడు. శ్రీలతకి కంగారు పుట్టింది. " డాక్టర్ దగ్గరకెళ్దాం పదండి" అంది చాలా సిన్సియర్‌గానే. డాక్టర్ దగ్గర కెళ్లక తప్పదని విజయ్‌కీ తెలుసు. కానీ అక్కడికి ఆవిడలాంటి మనిషితో వెళ్లకూడదు. ఆవిడెవరో చాలామందికి తెలుసు. ఆవిడతో తను డాక్టర్ దగ్గరకెళ్లడం ఏ ప్రముఖమైనవ్యక్తి చూసినా, ఆ తర్వాత తన కష్టాలు తనే కొనితెచ్చుకున్నట్టవుతుంది. అందుకే ఆవిడకి వంశీ ఆఫీస్ ఫోన్ నెంబర్ చెప్పి ఫోన్ డయల్ చెయ్యమన్నాడు. ఈ పరిస్థితిలో తనకి హెల్ప్ చెయ్యడానికి సరైన వ్యక్తి వంశీ ఒక్కడే! ఆ హోటల్లోని గదులకి డైరక్ట్ డయల్ సిస్టమ్ వున్న ఫోనులున్నాయి కాబట్టి శ్రీలత మంచం మీద కూర్చుని ఫోన్ డయల్ చేస్తోంది. విజయ్‌కి వాంతి వచ్చే ఫీలింగ్ కలుగుతోం దిగాని అవడంలేదు.

వంశీ ఆఫీసు హాల్లోని ఫోన్ మోగింది. దూరంగా కూర్చున్న ప్యూన్ రంగారావు బద్ధకంగా లేచివెళ్ళి ఫోన్ అందుకున్నాడు.

"హలో... యస్... ఔనండి" అన్నాడు తన సొంత ధోరణిలో అవతల్నించి శ్రీలత మాట్లాడుతూ, "వంశీకృష్ణగారు కావాలండి" అంది.

"మీరెవరండి? "

"నేను ఎవరైతేనేంలెండి. హోటల్ అజంతానించి" అని శ్రీలత అంటుఁడగానే మంచంమీదున్న విజయ్ ఆవిడ చేతిలోని ఫోన్ అందుకున్నాడు. అక్కడ ఆఫీసులో రంగారావు ఫోన్‌ని టేబిల్‌మీద పెట్టి వంశీ వుండే ఛాంబర్‌లోకి వెళ్ళాడు. వంశీ వచ్చి ఫోన్ అందుకుని "యస్ వంశీ స్పీకింగ్" అన్నాడు. విజయ్ గబగబ తన ఇబ్బంది సంగతి చెప్పి వంశీని అర్జంట్‌గా అజంతా హోటల్ రూమ్‌నెం త్రీ జీరో ఫైవ్ కొచ్చెయ్యమన్నాడు. వంశీ టెన్షన్ ఫీలవుతూనే వున్నఫళంగా ఆఫీసునించి బయటకి నడిచాడు. "ఏంటి సార్ ఏంటయింది? ఎవరా లేడీసు? " అని రంగారావు అడుగుతున్నా వినిపించుకోకుండా వంశీ వెళ్లి స్కూటర్‌స్టాండ్‌లో వున్న తన స్కూటర్ స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయాడు.

ప్యూన్ రంగారావు మాట్లాడినప్పుడు అవతల్నించి ఫోన్‌లో మాట్లాడింది శ్రీలత! వంశీ ఫోన్ అందుకున్నప్పుడు మాట్లాడింది విజయ్‌కుమార్! అవతలవైపు విజయ్ వున్నట్టుగా రంగారావుకి తెలీదు.

విజయ్ మంచంమీద పడుకుని కడుపునెప్పితో సతమతమవుతున్నాడు. అతన్తో వచ్చిన శ్రీలత "నేరకపోయి ఇతన్తో వచ్చాను" అని ఒక్కక్షణం కూడా అనుకోలేదు. మనసున్న మనిషిగా బాధపడింది, జాలిపడింది. అతని పక్కనే కూర్చుని "కాస్సేపు ఓర్చుకోండి. మీ ఫ్రెండ్‌కి ఫోన్ చేశారుగా! ఆయనొచ్చేస్తారు" అంటూ ధైర్యం చెప్తూ అతన్ని కంట్రోల్ చెయ్యడానికి ప్రయత్నిస్తోంది. అతనికి వాంతి రాబోతుంటే బాత్‌రూమ్‌లోకి తీసుకువెళ్లమన్నట్టుగా సైగ చేశాడు. ఆవిడ అతన్ని లేవదీసి తీసుకెళ్తుండగానే అతను భళ్లుమంటూ డోక్కున్నాడు. అదంతా ఆవిడ చీరమీదే పడిపోయింది. అంత బాధలోనూ అతను "సారీ అండీ సారీ... కొత్త చీర కొనిస్తాను" అన్నాడు. "మరేం ఫర్వాలేదండి. నీళ్లతో కడిగేస్తే క్లీన్ అయిపోతుంది. డోంట్ వర్రీ" అంది. అతన్ని మంచంమీదే కూర్చోబెట్టి గ్లాసుతో నీళ్లు తెచ్చి అతని నోరంతా తుడిచింది.

వంశీ ఆ హోటల్ కాంపౌండ్‌లోకి వచ్చి స్కూటర్ పార్కింగ్ దగ్గర స్కూటర్‌పెట్టి తాళంవేసి తాళాన్ని చేత్తోనే పట్టుకుని హడావిడిగా మెట్లెక్కి థర్డ్‌ఫ్లోర్‌కెళ్లాడు. రూమ్‌నెంబర్ త్రీ జీరో ఫైవ్ తలుపులు తోసుకుని

లోపలకెళ్లేసరికి మెలికలు తిరిగిపోతున్న విజయ్‌ని శ్రీలత చాలా కష్టంమీద కంట్రోల్ చేస్తోంది. వంశీ కంగారుపడి చేతిలో వున్న స్కూటర్ తాళాన్ని టీపాయ్ మీద పెట్టి విజయ్‌ని గట్టిగా ఒడిసిపట్టుకున్నాడు. విజయ్ తన జేబులోనించి డబ్బు తీసి శ్రీలతకివ్వబోతే "నాకేం అక్కర్లేదండి. ముందు మీరు డాక్టర్ దగ్గరకెళ్లి ట్రీట్‌మెంట్ చేయించుకోండి" అంది బాధపడుతూ.

"దీంతో ఓ చీరయినా కొనుక్కోండి" అంటూ డబ్బుని మంచంమీద పెట్టేశాడు. "అక్కర్లేదండి. నేనీచీర శుభ్రం చేసుకుని వెళ్ళిపోతాను. మీరు త్వరగా డాక్టర్ దగ్గర కెళ్లండి" అంది. విజయ్ ఆ డబ్బు తీస్కోకుండానే వంశీతోపాటు బైటకి నడిచాడు. శ్రీలత నిట్టూర్చి బాత్‌రూమ్‌వైపు నడిచింది. మెట్లు దింపి విజయ్‌ని వంశీ కాంపౌండ్‌లోకి తీసుకొచ్చాడు "నువ్వీస్థితిలో కారు డ్రైవ్ చెయ్యలేవు. నాకు కారు డ్రైవింగ్ రాదు. అంచేత నిన్ను ఆటో ఎక్కించి సమతా హాస్పటల్‌కి పంపిస్తాను. ఆ హాస్పటల్ ఇక్కడకి దగ్గర్లోనే వుంది" అన్నాడు.

"మరి నువ్వో"

"నాకు స్కూటరుందిగా, నేనూ నీ ఆటో వెంబడే వచ్చేస్తాను" అంటూ గేటు దగ్గరున్న ఓ ఆటోని పిలిచాడు. "సమతా నర్సింగ్ హోం తెలుసా?" అన్నాడు. తెలుసని డ్రైవర్ చెప్పగానే విజయ్‌ని ఆటోలో కూర్చోబెట్టి జేబులోనించి పదిహేను రూపాయలు తీసి డ్రైవర్‌కిచ్చాడు. ఆటో ముందుకు వెళ్ళిపోయింది. "వీడికెన్నిసార్లు చెప్పినా ఆరోగ్యాన్నీ చూస్కోడు. అలవాట్లూ మార్చుకోడు. అని బైటకే గొణుక్కుంటూ హడావిడిగా స్కూటర్ పార్కింగ్ దగ్గరికి నడవడంలో అక్కడ ఆగివున్న పోలీస్ జీప్‌ని అతను గమనించలేదు. తన స్కూటర్ దగ్గరకెళ్లి తాళం కోసం జేబులు తడుముకున్నాడు. ఏ జేబులోనూ కనిపించలేదు. ఏమైపోయింది? ఎక్కడ పడిపోయింది? అని ఆలోచనలో పడ్డాడు. విజయ్‌ని లేవదీసేటప్పుడు యాంత్రింగానే తాళం చెవిని టీపాయ్‌మీద పెట్టిన విషయం గుర్తొచ్చి తన మతిమరుపుకి తానే నెత్తికొట్టుకుంటూ మళ్ళీ హడావిడిగా మెట్లవైపు నడిచాడు. అప్పుడు పోలీస్‌జీపుని చూశాడుగాని అతని మనసంతా విజయ్‌కు మార్చి ఎలా సరిదిద్దడమా అనే ఆలోచన నిండడంవల్ల ఆ పోలీస్ జీప్ అక్కడ కెందుకొచ్చిందీ అనే విషయమే ఆలోచించలేదు. ఆ హోటల్‌మీద పోలీసుల నిఘా వుంది కాబట్టి వాళ్లు రొటీన్‌గా చేస్తున్న రైడ్‌నే ఆరోజూ చెయ్యడానికొచ్చేరు. వంశీ అన్యమనస్కంగా ఆలోచిస్తూ తలుపు తోశాడు. తలుపుకి గడియ వేయకపోవడంవల్ల తలుపు తెరుచుకుంది. లోపలికెళ్ళాడు.

లోపల శ్రీలత లంగా, జాకెట్‌తో మంచంమీద కూర్చుంది. వాంతి పడిన చీరని బాత్‌రూమ్‌లో తడిపి కుర్చీమీద ఆరబెట్టింది. వంశీని చూసి ఆమె మంచంమీద నుంచి లేచి నిలబడింది.

సెకెండ్ ఫ్లోర్ అంతా సెర్చ్ చేసిన పోలీసులు థర్డ్‌ఫ్లోర్‌లోకి ప్రవేశించారు.

అర్ధనగ్నంగా వున్న శ్రీలతని చూడకుండా టీపాయ్‌మీదున్న స్కూటర్ తాళాన్ని తీస్తూ, "సారీ అండీ స్కూటర్ తాళం మర్చిపోయాను" అన్నాడు వంశీ. తలుపుమీద ఎవరో స్టిక్‌తో కొట్టిన సౌండ్‌విని ఇద్దరూ గుమ్మంవైపు చూశారు. ఓ ఇన్‌స్పెక్టర్, ముగ్గురు కానిస్టేబుల్లు ప్రవేశించారు. వాళ్లని చూడగానే వంశీ గడగడ వణికిపోతూ, "నాకేం తెలీదు సార్! ఈవిడెవరో నాకు తెలీదు సార్, నేను తాళంకోసం వచ్చేనండి" అంటూ తడబడుతూ చెప్పాడు. లంగా, జాకెట్‌తో వున్న శ్రీలత గబగబ చీరతీసి కట్టుకోడానికి బాత్‌రూమ్‌లోకి వెళ్లింది. పోలీసుల దృష్టి వారిద్దరిమీదా లేదు. మంచంమీదున్న అయిదువేల రూపా

యల నోట్ల కట్టమీదుంది. వంశీ ఏదేదో చెప్తున్నాడు. అలాంటి మాటలు పోలీసులు వినీవినీ చెవులు తుప్పు పట్టేశాయి కాబట్టి ఆ మాటలేం వినిపించుకోలేదు. "మాష్టారూ ఇవి మాకు మామూలే. ముందు మీరొచ్చి జీపెక్కండి" అన్నాడో కానిస్టేబుల్. శ్రీలత బాత్‌రూమ్ నించొచ్చి తన హాండ్‌బ్యాగ్ అందుకుని "పదండి" అంది. ఆవిడ పోలీసుల్ని చూసి భయపడలేదు, కంగారు పడలేదు. "ఇలాంటి రైడింగులు మీకంటే నాకే బాగా తెలుసు" అన్నంత ధీమాగా వాళ్ల వెంట నడిచింది. ఇన్‌స్పెక్టరు ఆవిడలోని ధీమాని కూడా గమనించకుండా మంచంమీదున్న అయిదువేల కట్టని తీసి జేబులో పెట్టుకుని బైటకి నడిచాడు. ఆరోజు చేసిన రైడింగ్‌లో దొరికింది కేవలం వంశీకృష్ణ, శ్రీలత! ఆవిడ మెట్లు దిగుతూ ఓ కానిస్టేబుల్‌ని హుందాగా అడిగింది. "యస్పీ జగన్మోహన్‌రావుగారిప్పుడు ఇక్కడే వున్నారా? "

"వున్నారండి. సి.బి.ఐ. డిపార్ట్‌మెంట్లో" అన్నాడు కానిస్టేబుల్.

జీపులో వంశీని, శ్రీలతని ఎక్కించారు. జీపు కాంపౌండ్ దాటింది. వారిద్దర్నీ జీప్ ఎక్కించడాన్ని స్పష్టంగా ఓ వ్యక్తి చూశాడు. అతను రామస్వామి అనే ఓ రిక్షాపుల్లర్. అతనూ వంశీ వుండే వీధిలోనే వుంటున్నాడు. వంశీని అతను తమ వీధిలో చూశాడు. సిటీకేబుల్లో న్యూస్ చదువుతుండగా చూశాడు. నిన్న రాత్రి వచ్చిన టీ.వీ. సీరియల్లోనూ చూసినట్టే గుర్తు. గేటు పక్కన నిలబెట్టిన తన రిక్షా ఎక్కి తొక్కుతూ ముందుకు వెళ్ళాడు. రామస్వామి సరాసరి వంశీ ఇంటికి వెళ్లి కళ్యాణితో తను చూసిన విషయాన్ని చెప్పి "మీరు ఎవర్నయినా పంపించి బాబుగార్ని విడిపించి తీసుకొస్తారుకదాని చెప్పాను తప్ప నాకు మరో దురుద్దేశమేదీ లేదండి" అన్నాడు. అతనా విషయం చెప్తే కళ్యాణి మొదట నమ్మలేదు. "వంశీ ఎంతయినా ఇంతకి తెగిస్తాడా? అదీ పట్టపగలు... కాదు, వీడు చూసింది అతన్ని కాదు" అనే సంశయాన్నే వ్యక్తం చేస్తూ "నువ్వు ఎవర్ని చూసి ఎవరనుకుంటున్నావో? " అంది.

"భలేవారమ్మా, నేనాయన్ని టీవీలో వార్తలు చదవడం చాలాసార్లు చూశాను. ఈ వీధిలో కూడా చాలాసార్లు చూస్తూనే వున్నానుగదండీ" కళ్యాణికి సంశయం తొలగిపోయింది. రామస్వామి వెళ్ళిపోయాడు. ఇప్పుడేం చెయ్యాలి? వంశీకృష్ణ చెప్పే మాటలకీ, చేసే చేతలకీ సంబంధం లేదని ఇన్నాళ్ళూ అనుమానించింది. కానీ ఇప్పుడు నిజమని తేలిపోయింది. అతన్ని సాధించాలన్నా, శిక్షించాలన్నా ఆ పని చెయ్యాల్సింది పోలీసులు కాదు తను! అతన్ని ముందు విడిపించాలి. గబగబా వెళ్ళి బీరువాలో వున్న డబ్బు తీసి తన హాండ్‌బేగ్‌లో పెట్టుకుని బైటకొచ్చి తలుపుకి తాళం వేసింది. ఈ విషయం లాయర్ మాలతీదేవికి చెప్తే? విడిపించడానికి సహాయపడొచ్చు కానీ ఆవిడ దృష్టిలో తను మరీ లోకువైపోతుందేమో! పైగా ఆవిడ భర్త కూడా ఇప్పుడు ఇంట్లోనే వున్నాడు... వాళ్ళకి తెలీకుండానే వంశీని విడిపించాలి. నిర్ణయం తీసుకున్న వెంటనే రిక్షావాడు చెప్పిన పోలీస్‌స్టేషన్‌కి ఆటోలో బయలుదేరింది.

పోలీస్‌స్టేషన్‌లో వంశీ యస్సైగారికి తను ఎవరో, ఏంటో వివరంగా చెప్పాడు. అప్పుడో హెడ్‌కానిస్టేబుల్, యస్సై అతన్ని పరీక్షగా చూశారు. అతని ముఖాన్ని ఎక్కడో చూసినట్టే వుందనిపించింది. "కరెక్టే సార్, రెండు మూడుసార్లు న్యూస్ చదవడం నేను చూశాను. ఎంచేతంటే నేను కంపల్సరీగా సిటీ న్యూస్ చూస్తుంటాను. అందులో సగానికి సగం మన గురించేకదా చూపిస్తారు. నేనెక్కడైనా కనిపిస్తానేమోనని కొన్నిసార్లు చూస్తుంటాను. మనల్ని జనం ఎలా ఎండగడుతున్నారో తెల్సుకోడానికి కొన్నిసార్లు చూస్తుంటాను. ఓసారెప్పుడో

మన డిపార్ట్‌మెంట్‌మీద ఛెడామడా చెరిగేసింది ఇతనేననుకుంటాను" అన్నాడు హెడ్ కానిస్టేబుల్.

వంశీకి పరిస్థితి మరింత టైట్ అయిపోతుందనే భయం వేసింది "సార్... ఇందులో మా న్యూస్‌రీడర్ల పాత్రేం వుండదండి. నగరంలోని న్యూస్‌కలక్ట్ చేసేది ఒకరు, దాన్ని కెమేరాతో షూట్ చేసేదొకరు, వాటిని వార్తల రూపంలో రాసేది ఒకరు. వాళ్లు రాసిందాన్ని చదవడం ఒక్కటే మా డ్యూటీ సార్! పైగా నేను మా ఫ్రెండ్‌ని కల్సుకోడానికా హోటల్ కొచ్చాను. నేనివాళ మా కంపెనీ డ్యూటీలో వుండగా మా ఫ్రెండ్‌నించి ఫోన్ వచ్చింది. వెళ్లాను. కానీ ఆయనకి ఒంట్లో సుస్తీ చెయ్యడంవల్ల ఎవరో డాక్టర్ని కలవడానికెళ్లాడు. ఈలోగా మీరొచ్చేశారు"

హెడ్‌గారు వంశీని హెడ్డునుంచి పాదాల వరకు మరోసారి చూసి "ఎవరా ఫ్రెండు? " అని అడిగాడు. వంశీకి విజయ్ పేరు చెప్పడం ఇష్టంలేదు. విజయ్‌ని వాళ్లు చూడలేదు కాబట్టి ధైర్యంగానే అబద్ధం చెప్పేశాడు.

"అతను మన ఆంధ్రావాడు కాదండి. రాజీవ్‌మీనన్ అని... కేరళనుంచొచ్చాడు". యస్సై తన జేబులోకి తోసేసిన అయిదు వేల కట్టని తడిమి చూస్కుంటూ, "అతన్ని పంపించెయ్యవయ్యా" అన్నాడు. వంశీ ఆ మాట వినగానే యస్సైకి విష్‌చేసి బైటకి వెళ్ళిపోయాడు.

"అదేంట్సార్, అతన్ని ఉత్తినే వదిలేశారు? టీవీలో న్యూస్ రీడర్నంటున్నాడు. టీవీ సీరియల్స్‌లో ఏక్టర్నంటున్నాడు. అంటే సైడ్ ఇన్‌కం వున్నోడే కదా, ఓ నొక్కు నొక్కితే నాలుగు డబ్బులు రాలేవికదా" అన్నాడు హెడ్ ఓ మంచి అవకాశాన్ని పోగొట్టుకున్నవాడిలా ఫీలైపోతూ.

"అంతకంటే ఎక్కువే రాలిందిలేవయ్యా" అన్నాడు యస్సై చిన్నగా నవ్వుతూ.

"మీకు ఏకంగా మీల్స్ పేకెట్ దొరికిపోయిందిలెండి. నాక్కూడా కాసిన్ని పచ్చడి మెతుకులు విదిలిస్తే...

"ఆ విషయం ఇవాళ సెపరేట్‌గా చెప్పావేంటి? " యస్సైగారు హెడ్‌ని కాస్త చిరాగ్గా చూసి టాయ్‌లెట్ వైపు వెళ్ళబోతుంటే, హెడ్‌కేదో డౌట్ వచ్చి "అధ్సరేగానండీ... ఆ లాడ్జీలో దొరికింది పెద్ద హేండ్‌లా కనిపించింది కదా, దాన్నెందుకు వదిలేశారండి? " అన్నాడు.

"అది నాతో చెప్పినవన్నీ చాలా పెద్దపెద్ద తెల్ల ఏనుగుల పేర్లే చెప్పింది. తీరా దాన్నిక్కడకి తీసుకొచ్చినా, ఏ పెద్దోడో ఫోన్ కొడతాడు, మనం యస్సార్... యస్సార్... అంటూ వదిలెయ్యాలి. ఆ గొడవంతా ఎందుకని చెప్పి, దాన్ని వదిలేశాను"

యస్సై చెప్పినమాటలు హెడ్‌కి సంతోషం కలిగించలేదు. బయట వరండాలోకెళ్ళి కూర్చుని ఓ సిగరెట్ వెలిగించాడు. స్టేషన్ ముందాగిన ఆటోలోనుంచి కళ్యాణి దిగి లోపలకెళ్ళబోతుంటే, ఆవిణ్ణి గుమ్మంలోనే ఆపి హెడ్ అడిగాడు,

"ఏంటండీ మేటరు? "

కళ్యాణి, తను ఎవరో చెప్పకుండా అజంతా లాడ్జిలో దొరికిన యిద్దర్నీ చూడాలని చెప్పింది. "వాళ్ళిద్దర్నీ వదిలేశాం గదా" అన్నాడు హెడ్ చాలా యధాలాపంగా.

"నేను అడుగుతున్నది వాళ్ళగురించి కాదండి" అంటూ వంశీ పోలికలు, వివరాలు చెప్పింది. "మీరు అడుగుతున్న మనిషి, నేను చెప్తున్న మనిషి ఒక్కరేనండి. పాపం సిటీకేబుల్లో న్యూసూ గట్రా చదువుతున్నాట్ట. ఏవో టీవీ సీరియల్స్‌లో కూడా ఏక్ట్ చేస్తున్నాట్ట. మొదటితప్పుగా ట్రీట్మెంట్ చేసి వదిలేశాం" కళ్యాణి మనసులో మిగిలిన రవంత సందేహం కూడా తీరిపోయింది. పోలీసులు అరెస్ట్ చేసింది వంశీకృష్ణనే. కళ్యాణి తన మనసులో వున్న రెండో

సందేహాన్ని కూడా అడిగేసింది.

"ఆ అమ్మాయినైనా చూడొచ్చా?"

"ఎక్కడుందని చూస్తారండి? ఆవిణ్ణి మధ్యదారిలోనే దింపేశాం గదా"

"ఏం?"

"కొన్ని కేసుల్ని మేం అలాగే మిడిల్ డ్రాప్ చేసేస్తుంటాం. అందుకు లక్షా తొంభై కారణాలుంటాయి. అలాంటివి మీరు అడక్కూడదు. మేం చెప్పకూడదు"

జయలతకి పోలీసుల్లో అంత పలుకుబడి వుందా అనుకుంటూ ఆశ్చర్యపోయింది కళ్యాణి. కొన్ని క్షణాలు అక్కడే నిలబడి ఆలోచించి, "ఆయనెక్కడకెళ్ళారు?" అంది.

"బహుశా ఆఫీసుకే వెళ్ళుంటారు. ఆయన గురించి యిన్ని డిటైల్స్ అడుగుతున్నారు? ఇంతకీ మీకాయన ఏం అవుతారు?"

కళ్యాణి అప్పటికే ఆడరూపం దాల్చిన అగ్నిపర్వతంలా మండిపోతోంది.

"ఆ అమ్మాయి పేరు జయలతా?" ఆమె ఆసక్తితో కూడిన ఆవేశంతో ప్రశ్నించింది.

"జయలతో, సుమలతో, మధులతో... పేరు సరీగా వినబళ్ళేదు గానీ మొత్తంమీద లతే"

ఆ అమ్మాయిపేరు జయలతే అని కన్ఫర్మ్ చేసుకుని వెళ్ళబోతుంటే "ఇంతకీ నేను అడిగిందానికి జవాబు చెప్పారుకాదు" అన్నాడు హెడ్.

"ఏంటి?"

"ఆ వంశీ మీకేమవుతాడు?"

"బంధువు..." సమాధానం చెప్పడానికి ఒక్కక్షణం కూడా ఆలోచించలేదు. ఆవిడ వచ్చిన ఆటోలోనే వంశీ ఆఫీస్‌కి బయలుదేరింది.

వంశీ పోలీస్‌స్టేషన్‌నుంచి ఓ ఆటో ఎక్కి అజంతా హోటల్ దగ్గరకెళ్ళాడు. అక్కడున్న తన స్కూటర్ తీసుకుని సమతా నర్సింగ్‌హోమ్‌కెళ్ళాడుగానీ, అక్కడ విజయ్ లేడు. అతను అక్కడికి రాలేదా అని డాక్టర్లని ఎంక్వయిరీ చేస్తే, "ఆయనకి కావలసిన మెడిసన్స్ యిచ్చి పంపించేశాం. ఆ మందులు ఓ వారంరోజులపాటు వాడితే, అతను నార్మల్ కండీషన్‌కొచ్చేస్తాడు. అతను ఇన్‌పేషెంట్‌గా వుండాల్సిన అవసరమేంలేదు" అన్నాడు డాక్టరు. హమ్మయ్య గండం గడిచిందని సంతోషపడుతూ స్కూటర్‌మీద ఆఫీస్‌కి బయలుదేరాడు.



హాఫ్‌డే శలవు పెట్టిన జయలత ఒంటిగంట దాటాక ఆఫీస్‌కొచ్చి వంశీ కేబిన్‌లో వున్న తన టైప్ మిషన్ని ఫ్యూన్‌చేత హాల్లోకి తెప్పించి, తన టైప్ రైటింగ్ ఆరంభించింది. బయటనుంచి వచ్చిన వంశీ, హాల్లోనుంచి తన కేబిన్‌లోకి వెళ్ళబోతుంటే జయలత అతనికి విష్‌చేసింది. కానీ అతను గమనించకుండా తన కేబిన్‌లోకి వెళ్ళిపోయాడు. అతను కూడా విడిగా బయటకెళ్ళాడని ఫ్యూన్ రంగారావు ఇందాక చెప్పాడు. ఇప్పుడు వంశీ మూడ్ కూడా అదోలా వుంది. అందుకే జయలత అతని కేబిన్‌లో కెళ్లి, "ఏంటిసార్, ఏదో టెన్షన్ పడుతూ వెళ్ళారట. ఎవరికైనా ఏదైనా ప్రమాదం జరిగిందా?" అని అడిగింది.

"మా ఫ్రెండ్‌కో చిన్న ఏక్సిడెంట్ జరిగింది" అతను తన పని చేసుకుంటూనే

ముక్తసరిగా జవాబు చెప్పేడు.

"ఎవరా ఫ్రెండు? "

"నాకు తెల్సినవాడు నీకు తెలీనివాడు"

"పోనీ ఇప్పుడు బాగానే వున్నాడుకదా? "

వంశీ ఆమెవైపు చిరాగ్గా చూసి, "వున్నాడుగానీ, నువ్వెళ్లి నీ పని చూస్కో" అన్నాడు కసురుకుంటున్నట్టుగా. అతనింకా ఆ ఏక్సిడెంట్ టెన్షన్‌నించి బైటపడలేదని ఆమెకి ఆమే నచ్చజెప్పుకుని అక్కడనించి తన సీట్ దగ్గరకి వెళ్ళిపోయింది.

ప్యూన్ రంగారావు వొచ్చి, "సార్, మీరు వచ్చేముందే మీ ఫ్రెండ్ విజయ్‌గారు పది నిమిషాల గేప్‌లో రెండుసార్లు మీకోసం ఫోన్ చేశారండి" అన్నాడు.

"ఎక్కణ్నించి చేశాడు"

"ఇంటిదగ్గర్నించేనట, మీరు రాగానే ఫోన్ చెయ్యమన్నారు"

"సరే వెళ్లు"

రంగారావు వెళ్లిపోయేడు. విజయ్ ఇంటినుంచే ఫోన్ చేశాడు. డాక్టర్లతనికి మందులిచ్చారు కాబట్టి, ఏకంగా సాయంత్రం అతనింటికే వెళ్లి పరామర్శించొచ్చనుకున్నాడు.

తను పోలీసులకి అనూహ్యమైన పరిస్థితులవల్ల దొరికిపోవడం, రీసెంట్‌గా వచ్చిన ఫేస్‌వేల్యూ తనని కాపాడ్డం... ఇదంతా చిత్రంగా వుందనుకుంటూనే ఆఫీస్‌వర్క్‌లో తల దూర్చేశాడు.

ఆసుపత్రినుంచి ఇంటికి చేరుకున్న విజయ్ మంచంమీద పడుకుని తీవ్రంగా ఆలోచించింది వంశీ గురించే! తనని ఆటోలో ఆసుపత్రికి పంపించి, దాన్ని ఫాలో అవుతూ స్కూటర్ మీద వచ్చేస్తానని చెప్పిన వంశీరాలేదు. తనకి డాక్టర్ల చెకప్, మెడిసన్స్ రాసి పంపించే కార్యక్రమం అంతా ఓ నలభై నిమిషాల్లో ముగిసిపోయింది. అంతవరక్కూడా వంశీ రాలేదంటే కారణం ఏమై వుంటుంది? దార్లో ఏదైనా ఏక్సిడెంట్ జరిగిందా? ఏమో... అనుకుంటూనే ఎందుకైనా మంచిదని ఆఫీసుకి రెండుసార్లు ఫోన్ చేశాడు. అతనింకా ఆఫీసుకి రాలేదని తెలిసింది. అజంతా లాడ్జి వుండే ఏరియా పోలీస్ స్టేషన్‌కి ఫోన్‌చేసి, ఆ దరిదాపుల్లో ఏదైనా ఏక్సిడెంట్ జరిగిందేమో కనుక్కోవాలనుకున్నాడు. కానీ, రజనీ దగ్గరే వుండడంవల్ల ఆ పని చేయలేకపోయాడు. తీగలాగితే డొంకంతా కదులుతుంది, దాచిపెట్టిన విషయాలు బయటపడే ప్రమాదం వుందని గూడా గమనించి మౌనం వహించాడు. అతను వేసుకున్న మాత్రలకి నిద్రపట్టించే గుణం వుండడంవల్ల ఆలోచిస్తూనే నిద్రలోకి జారుకున్నాడు.

కళ్యాణికి వంశీ పనిచేస్తున్న ఆఫీస్ అడ్రస్ కరక్టుగా తెలీదు. ఒకటిరెండుసార్లు వంశీ ద్వారా ఆ అడ్రస్ విన్నా ఇంతవరకు ఎప్పుడూ వెళ్లలేదు. పైగా ఆవిడకి హైదరాబాద్‌సిటీతో అంత బాగా పరిచయంలేదు. బయలుదేరిన చాలా సేపటికి అతికష్టంమీద ఆ ఆఫీసుకి చేరుకుంది. ఆటోని బయట వెయిట్ చెయ్యమని చెప్పి లోపలికి నడిచింది. జరిగిన సంఘటన, తెలుసుకున్నాననుకుంటున్న నిజాలు, ఆవిడకున్న సంస్కారానికి, సహనానికి నిప్పుపెట్టడంవల్ల అసలే అనుమానాలతో దహించుకుపోతున్న ఆమె మనసు అగ్నిగుండంలా తయారయింది. మండుతున్న 'మేని'తో, మండుతున్న మనసుతో ఆమె ఓ సెగలు కక్కుతున్న జ్వాలాముఖిలా మహోగ్రంగా కనిపిస్తోంది. ఆవిడ రావడం చూసిన రంగారావు ఎంతో ఆశ్చర్యపోయి "రండి మేడమ్ రండి" అన్నాడు. హాల్లో వున్న పదిహేనుమందీ జయలతతో సహా అందరూ ఆమెను ఆశ్చర్యంగా చూశారు.

"ఆయన లేరా? " సీరియస్‌గా అడిగింది కళ్యాణి. మరుక్షణం రంగారావు కేబిన్‌లోకి పరుగెత్తి, ఆవిడొచ్చిన విషయం వంశీకి చెప్పేడు. ఆ మాట వినగానే వంశీ గతుక్కుమన్నాడు. ఏవిటో... అనూహ్యమైన సంఘటనలన్నీ ఒకదాని తర్వాత మరొకటిగా

ఇవాళే జరిగిపోతున్నాయనుకుంటూనే హాల్లో కొచ్చేడు

హాల్లో నిలబడిన కళ్యాణి టైప్ చేస్తున్న జయలతనే తీక్షణంగా చూస్తోంది.

"ఏంటి కళ్యాణీ ఇలా వచ్చావు? ఎనీథింగ్ సీరియస్?" వంశీ కాస్త ఆత్రం గానే అడిగాడు.

"సీరియస్ కాబట్టే వచ్చాను"

వంశీకి అంత సీరియస్ సంఘటన ఏమై వుంటుందో అర్థంకాక "నా కేబిన్‌లో కూర్చుని మాట్లాడుకుందాం రా" అన్నాడు.

"అక్కర్లేదు, జయలతంటే ఈవిడగారే కదా! అంచేత మీరు నాకు చేసిన ద్రోహం సంగతి ఇక్కడే, ఇప్పుడే తేలిపోవాలి" అంది. వంశీ తృళ్లిపడ్డాడు. ఆవిడ మాటల్లో తనపేరు వినబడేసరికి జయలత కంగారు పడి లేచి నిలబడింది. అందరూ వాళ్లవైపే రెప్పార్పకుండా చూస్తున్నారు.

"ద్రోహం చేశానా?" వంశీ పెదవులు యాంత్రికంగానే ఆ మాటలు పలికాయి.

"దాన్ని ద్రోహమనికాదు, అంతకంటే పెద్ద పేరుతోనే పిలవాలి"

వంశీకి ఏంచెప్పాలో తెలియక, "అలాంటి దేమైనావుంటే ఇంటిదగ్గర మాట్లాడు కుందాం" అన్నాడు.

"ఏం, ఇక్కడ మాట్లాడకూడదా?"

"ఇది ఇల్లుకాదు, ఆఫీసు"

"మీరు చేస్తున్న ద్రోహానికిది హెడ్డాఫీసు! దీనికెన్ని బ్రాంచీలున్నాయో నాకు తెలీదు గానీ, ఇవాళ మీరూ, ఈ జయలతా కలిసి ఓపెన్‌చేసిన కొత్త బ్రాంచ్ ఆఫీస్ పేరు హోటల్ అజంతా"

వంశీకి హోటల్ అజంతా పేరు వినగానే మనసు జలదరించింది. అయినా తనని తాను తమాయించుకుంటూ "డోంటాక్ నాన్సెన్స్" అని అరిచాడు. దాంతో కళ్యాణి మరీ రెచ్చిపోయింది.

"ఏది నాన్సెన్సండీ? మీరూ, జయలతా ఆ లాడ్జికెళ్లడం నాన్సెన్సా? అక్కడ మీరిద్దరూ పోలీసులకి దొరికిపోవడం నాన్సెన్సా? మీరు పోలీసుల్ని కాళ్లావేళ్లాపడి బయటికి రావడం నాన్సెన్సా? ఈవిడకున్న అపార మైన అనుభవంతో, పోలీసుజీపులోనించి దిగిపోవడం నాన్సెన్సా?"

"డోంటాక్ రబ్బిష్! నువ్వు చెప్పిందాట్లో సగం నిజం, సగం అబద్ధం వున్నాయి. అవేంటో తెల్సుకోకుండా మాట్లాడకు"

"అందులోవున్న సగం నిజాన్ని నేను పోలీసుల ద్వారానే తెలుసుకున్నాను. మిగతా సగం అబద్ధాన్ని మీరే వీళ్లందరికీ వినిపించండి"

"మా ఫ్రెండొకాయన అజంతా హోటల్లో దిగాడు. ఒంట్లో బాగోలేదని ఫోన్ చేశాడు. ఆ ఫోన్‌ని మా ప్యూన్ రంగారావే అందుకు న్నాడు. కావాలంటే అడుగు"

కళ్యాణి రంగారావుని సీరియస్‌గా అడి గింది. "చూడు రంగారావ్! నేను మీ మేనే జర్ వంశీగారి భార్యని మాత్రమేకాదు, ఓ రిటైర్డ్ పోలీస్ ఆఫీసర్‌గారి కూతుర్ని కూడాను. ఆ విషయాన్ని గుర్తుపెట్టుకుని మరీ నిజం చెప్పు"

రంగారావుకీ ఘర్షణ, దాని వెనకనున్న కథ ఏంటో తెలీదు. అయినా తనని సాక్ష్యం వేశారు కాబట్టి, అతను మనసులో భయప డుతూనే నిజం చెప్పాడు.

"ఇందులో అబద్ధం నేనెందుకు చెప్తా నండి. ఉదయం పదిన్నర తర్వాత ఫోన్ వచ్చిందండి. నేనే ఎత్తానండి. అవతల్నించి ఓ లేడీ మాట్లాడిందండి"

"ఆవిడకెంత వయసుంటుంది?"

"నేనావిణ్ణి చూళ్లేదుకదండి"

"చూడకపోయినా, వాయిస్ విన్నావు గదా!"

"వాయిస్‌ని బట్టి ఏజ్ ఎలా చెప్పగల మండి? ఫర్గెగ్జాంపుల్ లతామంగేష్కర్‌కి వయసు డబ్బై దాటేసినా, పాట వింటే పాతి కేళ్ళ పిల్లలా వుంటాదిగదండి"

"నువ్వు అధిక ప్రసంగాలు చెయ్యకు.

నేను అడుగుతున్నది ఫోన్లో వినబడిన మాటల సంగతి. సరే, దాని వయసెంతన్న సంగతి పక్కన పెట్టి, ఆవిడేం చెప్పిందో చెప్పు"

"నేను అజంతా హోటల్నించి మాట్లాడుతున్నాను, వంశీకృష్ణగారున్నారా అని అడిగేరండి"

వంశీ జోక్యం చేసుకుని, "ఎందుకయ్యా అబద్ధాలు చెప్తావు. నాకు ఫోన్ చేసింది మా ఫ్రెండ్, నేను మాట్లాడిందీ మా ఫ్రెండుతోనే" అన్నాడు.

రంగారావు కాస్త అఫెండ్ అయి, "నేనెందుకబద్ధం ఆడతానండి? ఇందాక మీ ఫ్రెండ్ విజయ్‌గారు మీకోసం రెండుసార్లు యింటినుంచి ఫోన్ చేశారు. అప్పుడు మీరు లేకపోయినా, రాగానే మీకు కరక్ట్‌గా చెప్పేనా? లేదా? అలాంటప్పుడు లాడ్జీ నుంచొచ్చిన ఫోన్ విషయంలో ఎందుకు అబద్ధమాడతానండి? "

అక్కడున్నవాళ్ళంతా, ఆ రుజువుల్నీ, సాక్షాల్నీ శ్రద్ధగా వింటున్నారు తప్ప అందులోని నిజనిజాల్ని బేరీజు వేస్కోలేకపోతున్నారు. జయలత స్థాణువులా నిలబడిపోయింది.

"ఆ ఫోన్ వచ్చేసరికి, ఈ జయలత ఎక్కడుంది? ఇతన్తోపాటే వెళ్ళిందా? "

"జయలతగారు ఉదయం శలవు పెట్టేరు గదండి"

"ఐసీ, అంటే ముందుగా యీవిడే ఆ లాడ్జీకెళ్ళిపోయి, అక్కణ్ణుంచి ఫోన్ చేసిందన్నమాట. ఔన్లే... అంత అనుభవం లేకపోతే, పోలీస్‌జీప్‌లోనుంచి అంత యీజీగా ఎలా దిగిపోగలుగుతుంది"

కళ్యాణి క్షణక్షణానికి రెచ్చిపోతోంది. అందుక్కారణం రంగారావు చెప్పినమాటలు, పోలీసులు చెప్పినమాటలు. జయలత ఆరోజు ఉదయం శలవు పెట్టడం, విజయ్ తన యింటినుంచి వంశీకి ఫోన్‌చెయ్యడం. ఇవే ఆవిడ చేసిన ఆర్గ్యుమెంట్‌కి బలాన్నిచ్చాయి. వంశీ అంత ఆత్రంగా వెళ్ళి ఆదుకోవాల్సిన ఫ్రెండ్ అంటూ వుంటే, అది కేవలం విజయ్‌కుమారే. కానీ అతను యింటి దగ్గరే వుండి వంశీకోసం ఫోన్ చేశాడంటే అర్ధం... వంశీ విజయ్‌ని కలవనట్టే కదా! ఈ లాజిక్కులు తీసి మాట్లాడుతున్న కళ్యాణిని ఫెడీఫెడీమంటూ లెంపలు వాయించేద్దామనుకున్నాడు గానీ... ఆ పని చెయ్యడానికి అతని సంస్కారం అంగీకరించలేదు. కళ్యాణి చేసిన అభియోగాలు విని జయలత భోరుమని ఏడుస్తూ కుర్చీలో కూలబడిపోయింది.

"ఏడవవలసింది నేను గానీ, నువ్వుకాదు తల్లీ. ఈయనగారు తన కేరక్టరు గురించి ప్రతీరోజూ గొప్పలు చెప్పుకుంటుంటే, నేను కొంతవరకు నమ్మాను. కొంత నమ్మలేదు. కానీ యిప్పుడు జరిగింది తెలిశాక ఇతనెలాంటివాడో పూర్తిగా అర్ధమైపోయింది. ఇతని మాటలు మోసం, యితని చేతలు మోసం, యితని వ్యక్తిత్వం మోసం"

నిలువెల్లా ఆవేశంతో నిండిపోయిన కళ్యాణి అంతకంటే ఏం మాట్లాడాలో అర్ధం కాక వచ్చినంత వేగంగా బైటకెళ్ళిపోయింది.

వంశీ ఆవేశంనుంచి దుఃఖంలోకి జారిపోయి ఏడుస్తున్న జయలతకి ఏంచెప్పి ఓదార్చాలో తెలీక తన చాంబర్‌లోకి వెళ్ళిపోయాడు.

జయలత అక్కడ కూర్చుని పనిచెయ్యలేక తన హేండ్‌బాగ్ తీసుకుని టైప్ మిషన్ని అలాగే వదిలేసి ఎవరి పర్మిషనూ తీస్కోకుండా ఎవరికీ చెప్పకుండా గబగబా బైటకి వెళ్ళిపోయింది. ఆ హాల్లో వున్న రాంబాబు, రంగారావు వగైరాలంతా వంశీ దగ్గరకొచ్చి "ఏంటి బాసూ, ఏమైంది? " అని ప్రశ్నించారు. ఏంజరిగిందని చెప్పాలి? ఒక్కోసారి కల్పనకంటే వాస్తవమే ఆశ్చర్యంగా వుంటుందని ఎవరో చెప్తే విన్నాడు. ఇవాళ జరిగిన సంఘటనలు ఆ మాటనే నిజం చేశాయి.

వారు ప్రశ్నిస్తున్నారు, సలహాలిస్తున్నారు, సానుభూతి ప్రదర్శిస్తున్నారు. అతని ఆవేశాన్ని మరీ రెచ్చగొట్టిన సలహా ఏంటంటే, "జయలతతో నీకా కాంటాక్ట్ వున్నప్పుడు ఆ దిక్కుమాలిన అజంతా హోటల్ కెందుకెళ్ళావు? నాకు చెప్తే నేను సేఫ్‌గా వుండే మరో ప్లేస్ చెప్పేవాణ్ణిగా"

ఆ సలహా యిచ్చిన సన్యాసిరావుని కొట్టబోయి, తమాయించుకొని సారీ చెప్పి, కాగితం తీసి పదిరోజులకి లీవ్ లెటర్ రాసి ప్యూన్ రంగారావు చేతిలో పెట్టి వంశీ ఆఫీస్‌నుంచి వెళ్ళిపోయాడు. ఆత్మాభిమానం గల మనిషి అవమానాన్ని, పరాజయాన్నయినా భరించగలడు గానీ, సానుభూతిని భరించలేడు. తనకి సలహా యిచ్చిన సన్యాసిరావు మీద విపరీతమైన కోపం వచ్చినా ఆ కోపం వచ్చినంత వేగంగానే తగ్గిపోయింది. కట్టుకున్న భార్యే తనని అర్థం చేస్కోకుండా, అందర్లోను అవమానించినప్పుడు సన్యాసిరావు అలాంటి సలహా యివ్వడంలో తప్పేముందీ అని తనకితాను జవాబు చెప్పుకున్నాడు. వంశీ కూడా వెళ్ళిపోయాక అక్కడున్న రాంబాబుకి, రంగారావుకీ ఓ అయిడియా వచ్చింది. ఈ గొడవని ఆర్పడానికిగానీ, తీర్చడానికిగానీ తమకి సాధ్యంకాదు. కానీ, వంశీకి ప్రాణస్నేహితుడు, ఫ్యామిలీ ఫ్రెండూ అయిన విజయ్‌కుమార్ ఒక్కడే ఈ సమస్యని ఏదో విధంగా ఓ దారికి తీసుకురాగలడనిపించింది. రాంబాబు విజయ్‌కుమార్ ఆఫీస్‌కి ఫోన్ చేసి అతని యింటి ఫోన్ నెంబరు తెల్సుకుని, ఆ నెంబర్‌కి డయల్ చేశాడు. ఆ సమయంలో విజయ్ నిద్రపోతుండడంవల్ల రజని ఫోన్ లిఫ్ట్ చేసింది. "ఆయనేదో మాత్ర వేసుకుని పడుకున్నారు. వంశీగారి ఆఫీస్‌నుంచీ అంటే ఆయన మాట్లాడతారా? " అంది రజని.

రాంబాబు మొహమాటపడుతూనే, "వంశీగారి గురించే మేం చెప్పాలనుకుంటున్నామండీ" అన్నాడు.

"ఫర్వాలేదు చెప్పండి"

రాంబాబు మౌత్‌పీస్ మూసి రంగారావుతో "చెప్పచ్చా" అని అడిగాడు.

"చెప్పండి, యిందులో భయమేం వుంది? పైగా వంశీగారికీ సంబంధం చూసిందీ, పెళ్ళిచేసిందీ వాళ్ళిద్దరేకదా" అన్నాడు రంగారావు. రాంబాబు జరిగిన విషయం చెప్పాడు. అంతా విన్న రజని మనసు చాలా బాధపడింది. అలాగే ఆవేశపడింది. ఆవిడ ఫోన్ పెట్టేసి విజయ్‌ని నిద్రలేపుదామా వద్దా అనుకుంటూనే లేపడం మానేసింది. వంశీ గురించి తను ఏ మంచి అభిప్రాయాన్ని ఏర్పరచుకున్నా, అదంతా విజయ్ చెప్పిన మాటల్ని బట్టే జరిగింది. వంశీ గురించి యిన్నాళ్ళూ మంచి రిపోర్ట్ విందిగానీ, ఏ ఒక్క బాడ్ రిపోర్టూ వినలేదు. కానీ, మొట్టమొదటిసారి విన్నదే భరించలేనంత దుర్వార్త. అతన్ని అర్జంట్‌గా లేపి ఈ విషయం చెప్పినా క్షణాలమీద తీసుకోవలసిన చర్యంటూ ఏమీ కనబడ్డంలేదు కాబట్టి విజయ్‌ని నిద్ర లేపకుండా వూరుకుంది.

వంశీ ఆఫీస్‌నుంచి స్కూటర్‌మీద బయలుదేరినా యింటికి మాత్రం వెళ్ళలేదు. వెళ్ళి కళ్యాణితో యింకా గొడవపడ్డం యిష్టం లేదు. ఎండ ఫెళ్ళుమంటున్నా, రోడ్లు మాత్రం పెద్ద రద్దీగాలేవు. గమ్యం ఏవిటో తెలీకుండా అన్యమనస్కంగానే రోడ్లమీద డ్రైవ్ చేస్తున్నాడు. టర్నింగ్‌లు తిరుగుతున్నాడు.

ఓ గంట తర్వాత విజయ్‌కుమార్ నిద్రలేచాడు. స్నానంచేసి కాఫీ తాగి ఏదో మేగజైన్ తిరగేస్తుండగా రజనీ అతనిపక్కన కూర్చుని మెల్లగా వంశీ ఆఫీస్‌నుంచి వచ్చిన ఫోన్ గురించి వివరంగానే చెప్పింది. విషయం వినగానే విజయ్ మనసులో శబ్దం చెయ్యని పిడుగుపడింది. నరాల్లో టెన్షన్... ముఖకవళికలు మారుతున్నా రజ

నీకి వ్యక్తం కానివ్వకుండా చాలా జాగ్రత్తపడుతున్నాడు. తప్పుచేసిన తను క్షేమంగా బయటపడ్డం ఏమిటి? తనని రక్షించడానికి వచ్చిన వంశీ నిందలపాలై నేరస్థుళ్ళా భార్య ముందు, ఆఫీస్ స్టాఫ్‌ముందు నిలబడ్డం ఏమిటి? ఇవాళ జరిగిన సంఘటనకి, దాని ఫలితాలకీ తను ఎంతవరకు బాధ్యుడు? ఎంతవరకు అనే ప్రశ్నేలేదు. నూటికి నూరొంతులు తనే బాధ్యుడు. తనకెప్పట్నుంచో వున్న పర స్త్రీ వ్యసనం, యివాళ్టి అనారోగ్యం వంశీ సంసారంలో అలజడి సృష్టించడానికి కారణమయ్యాయి. వంశీ వ్యక్తిత్వంమీద కళంకం తేవడానికే ఉపయోగపడ్డాయి. మనసులోని ఆవేదన తట్టుకోలేక తనని తానే అసహ్యించుకుంటూ తల బాదుకున్నాడు. అతను మానసికంగా బాధపడుతున్నాడని రజనీ గ్రహించినా ఆ బాధకి మరోలా అర్థం చెప్పుకుంది.

"అతను మీ చిన్ననాటి స్నేహితుడే కావచ్చు మన ఫ్యామిలీ ఫ్రెండ్ కావచ్చు. కానీ ఆయన మనసులోని నీచత్వాన్ని మీక్కూడా తెలీకుండా, యిన్నాళ్ళూ దాచాడంటే ఆయన చాలా తెలివైనవాడు, లౌక్యుడిలా కనిపిస్తున్నాడు. ఆయనకిలాంటి వెర్రి మొర్రి వేషాలున్నాయని మీకింతవరకు చెప్పలేదు. చెప్పుంటే మీరు నాకు చెప్పుండేవారుగా. పువ్వుల్తో కూడిన దారానిక్కూడా ఎంతోకొంత సువాసన వస్తుందంటారు. కానీ యిన్నేళ్ళు మీతో స్నేహం చేసినా, మీ మంచితనం అతనికి కొంచెం కూడా అబ్బలేదేంటండి? అతను చాలా మంచివాడన్న నమ్మకంతో అతని పెళ్ళిని మీరు జరిపిస్తానంటే నేనూ కాదనలేకపోయాను. అతని ఉద్యోగానికి మీరు సెక్యూరిటీ ఉంటానన్నప్పుడూ నేనడ్డు చెప్పలేదు. చేసిందంతా అపాత్రతాదానమైపోయింది. ఇవాళ కళ్యాణి ఆవేశం పట్టలేక ఆఫీస్‌కువెళ్ళి అడిగిందంటే అందులో ఆవిడ తప్పేం వుందండి? ఏ భార్య అయినా యిలాంటి సందర్భాల్లో అలాగే ఆవేశపడుతుంది. మీరేమీ అనుకోనంటే నేనోమాట చెప్తాను"

ఆవిడ మాటల్ని బట్టి ఆవిడ వంశీని ఎంత దారుణంగా అపార్థం చేసుకున్నదీ అర్థమవుతున్నా, ఆవిడకేర్పడిన అభిప్రాయాన్ని సరిచేయలేకపోయాడు. "ఏంటది? " అని మాత్రం మెల్లగా గొణగగలిగాడు.

"అలాంటివాళ్ళతో స్నేహాల్ని తగ్గించుకోవడం మంచిదేమో" రజనీ అలా చెప్పినందుకు అతను ఆశ్చర్యపోలేదు. వంశీగురించి ఆవిడ విన్నదంతా నిజమే అయితే ఆవిడే కాదు, మరే ఆడదైనా అలాంటి సలహాయే ఇస్తుంది. కానీ తప్పు తనది, నింద వంశీదీ అని మనసులో బాధపడుతూనే మెల్లగా వెళ్ళి బట్టలు మార్చుకుని బైటకి బయల్దేరాడు.

గమ్యం ఏంటో తెలియకుండా రోడ్లమీద స్కూటర్ నడుపుతున్న వంశీకి ఎంత తిరిగినా, ఎక్కడ తిరిగినా తనకి కావలసిన మనశ్శాంతి లభించలేదు. తనతోపాటు తన మనసు కూడా తిరుగుతున్నప్పుడు మనశ్శాంతి ఎందుకు లభిస్తుందని తనమీద తనే చిరాకుపడుతూ రాత్రి ఏడుగంటలప్పుడు యింటికి చేరుకున్నాడు. ఇంటికి తాళం వేసుంది. కళ్యాణి బహుశా మాలతి యింటికి వెళ్ళుంటుందనుకుంటూ తన దగ్గరున్న డూప్లికేట్ తాళంతో తలుపుతెరచి స్విచ్ వేశాడు. హాల్లో పరుచుకున్న వెలుతుర్లో టీపాయ్‌మీద ఓ ఫుల్‌స్కేప్ సైజ్ కాగితం, దానిమీదో పేపర్ వెయిట్ కనిపించాయి. గబగబా వెళ్ళి ఆ కాగితం తీసి చూశాడు. అది కళ్యాణి దస్తూరీ.

"శ్రీయుత వంశీగారికి...

నేను మా వూరు వెళ్ళిపోతున్నాను. కారణం ఏవిటో ప్రత్యేకంగా చెప్పక్కర్లేదు. సహనానిక్కూడా ఓ హద్దుంది. నేను గుణవంతుడయిన భర్తని కోరుకున్నాను తప్ప పెద్ద పెద్ద ఉద్యోగాలు చేసేవాడో, అమి

తంగా డబ్బున్నవాడో కావాలని కోరుకో లేదు. మీ గురించి మీ స్నేహితుడు విజయ్, అతని భార్య రజని, తాతారావు గారు గొప్పగా చెప్తే నిజమని నమ్మాను. మీరో నాటకాలరాయుడనిగానీ మీకు నైతిక విలువలు లేవనిగానీ నాకు తెలీదు ఆ విష యాన్ని మీవాళ్ళు దాచిపెట్టారో, మావాళ్ళు అడగలేదో నాకు తెలీదుగానీ మొత్తంమీద మీ అందరి దాపరికాలకీ బలైపోయింది నా జీవితమే. నాకో గొప్ప భర్త దొరక్కపో యినా మా చిన్నాన్నలాంటి భ్రష్టుడు మాత్రం భర్తగా రాకూడనుకున్నాను. కానీ నేను ఏనాడు ఏ పాపం చేశానోగానీ మా చిన్నాన్నని మించినవాడే నా భర్తగా దొరి కాడు. మా చిన్నాన్నకి దుర్వ్యసనాలు చాలా వున్నా, అబద్ధాలు చెప్పి భార్యని మోసం చెయ్యలేదు. ఇష్టంలేని భార్యని జుట్టు పట్టుకుని బైటకి గెంటేశాడే తప్ప ఆవిడమీద ప్రేమున్నట్టు నటించి, తియ్యటి విషాన్ని ఆవిడచేత తాగించలేదు. కానీ మీరో తియ్యటి విషం, మెత్తని కత్తి అని సంపూర్ణంగా తెలుసుకోవడానికి పధ్నాలుగు నెలలు పట్టింది. అయినా నేను మిమ్మల్ని గానీ, మరొకర్నిగానీ తప్పుపట్టడంలేదు. నా ఖర్మకి నేనే తల వంచి వెళ్ళిపోతున్నాను. దయచేసి నాకోసం రావడంగానీ, ఫోన్‌లు చేయడంగానీ చెయ్యకండి. ఇంతవరకు నేను చేసిందో రైలుప్రయాణం, అందులో ముందుగా నేను దిగాల్సిన స్టేషన్ వచ్చే సింది. నేను దిగిపోతున్నాను. శలవ్...

కళ్యాణి..."

ఉత్తరం చదివిన వంశీకి ఏడుపు రాలేదు. కళ్ళు చెమర్చకపోయినా ఆ క్షణంలో అత నికి మిగిలినవి పొడికళ్ళు, తడి మనసు. మెల్లగా లేచి వెళ్ళి మంచంమీద పడుకు న్నాడు. మనసులోని ఆలోచనలు మరీ స్పీడ్‌గా కాకుండా ఒంటికాలి పరుగు తీస్తు న్నాయి.

ఆ పరుగుని ఆపుచేస్తూ విజయ్ ఆ గదిలోకి ప్రవేశించాడు. ఎప్పుడూ నవ్వుతుం డేవ్యక్తి కళ్ళలో నీటితెరలు కదులుతు న్నాయి. కళ్యాణి రాసిన వుత్తరం చదివాక, సుళ్ళు తిరుగుతున్న కన్నీళ్ళు ధారాప్రవా హంగా బైటకొచ్చేశాయి.

"నేను మారిపోయేన్రా వంశీ! మారిపో యాను" అన్నాడు గద్గదస్వరంతో.

వంశీ మౌనంగా చూస్తూ శుష్కమంద హాసం చేశాడు. ఆ మందహాసంలో "ఇప్పుడు కావల్సింది అది కాదుగా" అనే అర్థం స్పష్టంగా కనిపించింది.

"ఆ లాడ్జిలో వున్నది నేనేనని చెప్పేసినా బావుండేది. మనకి ఫ్యామిలీ ఫ్రెండ్షిప్పు పోయినా, మన ఫ్రెండ్షిప్పు మనకుండేది. మీ ఆవిడా నువ్వూ సుఖంగా జీవించేవారు. నాకోసం, మన స్నేహంకోసం నువ్వు నీ జీవితాన్నే నాశనం చేసుకున్నావు. నిజాలు చెప్పడంవల్ల ప్రమాదాలు కలుగుతాయని ఎన్నోసార్లు చెప్పానుగానీ, కొన్ని త్యాగాలు చెయ్యడంవల్ల కూడా ప్రమాదాలు జరుగు తాయని చెప్పకపోవడం నాదే పొరపాటు" అంటూ తల బాదుకుంటూ ఏడ్చాడు.

"ఇప్పుడేం చెయ్యాలి?" అని విజయ్ కాస్సేపు పోయాక అడిగాడు.

వంశీ దగ్గర జవాబులేదు. "పోనీ, నేనే వైజాగ్ వెళ్ళి..." అనబోతుండగా వంశీ వద్ద న్నట్లుగా తలాడించాడు. "నువ్వు వెళ్ళినా, నిన్ను నేనే పంపించాననుకుంటుంది. నువ్వే నిజాలు చెప్పినా, అవన్నీ నేను చెప్పించే అబద్ధాలనుకుంటుంది. వద్దు" అన్నాడు వంశీ మెల్లగా.

మరో అరగంట తర్వాత "భోజనాలకి వెళ్దాం పదరా" అన్నాడు విజయ్. "నాకి ప్పుడేం తినాలని లేదురా" అన్నాడు వంశీ నిర్లిప్తంగా. అతన్ని తనతో రమ్మని బల వంతం చెయ్యకుండా విజయ్ తనకారులో వెళ్ళి బిర్యానీ, అరటిపళ్ళు తీసుకొచ్చి యిచ్చాడు. "తర్వాత తింటాన్లేరా" అన్నాడు వంశీ. "మర్చిపోకుండా తిను. నువ్వేం బాధ

పడకు. ప్రతీ సమస్యకీ ఓ పరిష్కారం వుంటుంది. నేను దాన్ని గురించి ఆలోచిస్తా న"ని చెప్పి విజయ్ వెళ్ళిపోయాడు.

★ ★ ★

మర్నాడు ఉదయం ఎనిమిదిన్నరకి విశాఖా ఎక్స్‌ప్రెస్ దిగి విశాఖపట్నం చేరుకుంది కళ్యాణి. తన ముఖంలో ఏమాత్రం సీరియస్‌నెస్ కనిపించినా తన తల్లికంటే ముందు తన తండ్రి ఏదో జరిగిందని వూహించేస్తాడు. కొన్ని గంటల్లో జరిగిందేవిటో కనిపెట్టేయగల మనిషి. ఎంతయినా ఒకప్పుడు పోలీస్ ఇన్‌స్పెక్టర్‌గా పనిచేసినవాడు కదా. అనుమానం వచ్చిన దగ్గర్నుంచీ అసలు నిజం తెల్సుకునే వరకూ ఆగడు. అంచేత కొన్ని రోజులవరకు ఏమీ జరగనట్లే నటించాలి అని మనసులోనే నిర్ణయించుకుని ఆటో ఎక్కి యింటికి వెళ్ళింది. కూతురు సడన్‌గా పెట్టె పట్టుకుని హైదరాబాద్‌నుంచి రావడం రామారావుకి, సుభద్రకి ఆనందంకంటే ఆశ్చర్యమే కలిగించింది.

"మీరేం ఆశ్చర్యపోకండి. ఆయనకి సడన్‌గా కేంప్‌కెళ్ళాల్సిన పనిబడింది. పదిరోజుల పాటు ఆయన బెంగుళూర్లో వుండాలి. నన్నూ రమ్మన్నారు. కానీ ఆ పదిరోజులూ ఎక్కడో బెంగుళూర్లో వుండే బదులు, యిక్కడ కొద్దామనిపించి వచ్చేశాను. ఆయనే దగ్గరుండి నన్ను ట్రైన్ ఎక్కించారు" అంది ఎంతో సంతోషం నటిస్తూ. వాళ్ళు నమ్మారు. అయినా రామారావు మాజీ ఇన్‌స్పెక్టర్‌గా కాకుండా, ఆడపిల్ల తండ్రిగా అడిగాడు "వచ్చేముందు ఫోన్ చేస్తే నేను స్టేషన్‌కైనా వచ్చుండేవాణ్ణిగా"

"ఏది నాన్నా, ఎక్కడ టైముంది? పైగా మొన్నట్నించీ మా ఫోన్ డెడ్ అయింది" కళ్యాణి ఆరోజు సిట్యుయేషన్ని చాలా సులభంగానే మేనేజ్ చేసింది.

★ ★ ★

వంశీ ఆరోజు కూడా యింటిదగ్గరే వున్నాడు. స్నానం చెయ్యడం, విజయ్ పంపించే టిఫిన్, భోజనం తినడం, టీవీ ప్రోగ్రామ్స్‌ని ఛానల్స్ మార్చిమార్చి చూడ్డం యిదేపనిగా పెట్టుకున్నాడు. ఆ బొమ్మల్ని కళ్ళు చూస్తున్నాయి తప్ప, అతని మనసు వేరే ఆలోచనల్లో నిమగ్నమవడంవల్ల మాటలు వినబడ్డంలేదు. కథ బోధపడ్డం లేదు. అతను ఏక్ట్ చేస్తున్న టీవీ సీరియల్ షూటింగ్ జరుగుతున్నా, అతని పాత్ర షూటింగ్ మరో పదిహేను రోజులవరకు రాదని చెప్పడంవల్ల అతనికి ఇల్లు వదిలి బయటకెళ్ళే పనేలేదు.

ఆరోజు మధ్యాహ్నం ఒంటిగంట సమయంలో లాయర్ మాలతి, శామ్యూల్ అతని దగ్గరకొచ్చారు. వాళ్ళిద్దరూ సడన్‌గా వచ్చేసరికి వంశీ కాస్త కంగారుపడ్డాడు. అయినా వాళ్ళు వచ్చి అడిగినా, ఎదురుపడి అడిగినా, చెప్పడానికో అబద్ధాన్ని రెడీ చేసుంచాడు కాబట్టి క్షణాలమీద సర్దుకున్నాడు.

"ఏంటండీ మీరు ఇంట్లో వున్నారు? ఆఫీస్‌కెళ్ళలేదా?" అంది మాలతి. వారిద్దర్నీ కూర్చోబెట్టాడు. "నాకు మన టీవీ ప్రొడ్యూసర్స్ చెప్పిన ప్రకారం యివాళ, రేపు షూటింగ్ వుండాలి. అందుకని శలవు పెట్టి యింట్లో వున్నాను. అఫ్‌కోర్స్ షూటింగ్ వుండకపోడానిక్కూడా స్కోప్ వుందనుకోండి. ఈమధ్య ఆఫీస్‌లో చాలా హెవీగా వర్క్‌చెయ్యడంవల్ల కాస్త రెస్ట్ తీస్కోవాలని కూడా అనిపించిందనుకోండి... అద్సరే, మీరేంటి యింత సడన్‌గా..."

శామ్యూల్ నవ్వుతూ "టీవీ సీరియల్స్ చూసి చూసి బోర్ కొట్టేస్తున్నాయండి. ఏదో కథని ముందుకు తోసుకువెళ్ళాలి కాబట్టి ఏవేవో సీన్లు పెట్టేస్తున్నారు తప్ప ఒక్క ఎపిసోడూ ఇంట్రెస్టింగ్‌గా వుండడంలేదు. అందుకే యిద్దరం కలిసి మేట్నీ షోకెళ్దామని బయలుదేరాం. మీ యింటివైపు చూస్తే మీరు కనిపించారు. వచ్చాం"

అన్నాడు మాలతి అక్కడనుంచే ఇల్లంతా కలియచూసి, "కళ్యాణిగారు కనబడ్డంలే దేంటి? " అంది.

"వాళ్ళ బంధువుల అమ్మాయికి సడన్‌గా పెళ్ళి కుదిరిందట. అర్జంటుగా రమ్మని ఫోన్ వస్తే హడావిడిగా వైజాగ్ వెళ్ళింది. మీకు చెప్పడానిక్కూడా టైమ్ లేకపోయింది. మీతో చెప్పమని నాకు చెప్పిందనుకోండి. నేనే సాయంత్రం వచ్చి మీకు చెప్దామనుకుంటున్నాను" వంశీ సిద్ధంగా వున్న సమాధానాన్ని అక్షరం తప్పులేకుండా చెప్పేశాడు.

"ఓకే... ఓకే... మీరూ మాతో సినిమాకి రాకూడదూ? " శామ్యూల్ ఆహ్వానించాడు.

"రావచ్చు... కానీ ఈలోగా నాకు షూటింగ్ దగ్గరనుంచి కారొస్తే వెళ్ళాలిగా"

"ఔనౌను. మీరు శలవు పెట్టిందే అందుకుకదా. డ్యూటీ ఫస్ట్ అన్నారు. మేం వెళ్ళొస్తాం" శామ్యూల్ ఆమాట చెప్పి షేక్ హ్యాండ్ యిచ్చి మాలతిని తీసుకుని వెళ్ళిపోయాడు. వాళ్ళు వెళ్ళేవరకు వంశీ గుండెలు గుబగుబలాడుతూనే వున్నాయి. మాలతి న్యాయశాస్త్రాన్ని చదివితే, శామ్యూల్ మానవ జీవితశాస్త్రాన్నే చదివేశాడు. వాళ్ళ ముందు అబద్ధమాడ్డమంటే ఆషామాషీ కాదు. అయినా తను బాగానే అబద్ధమాడేసి నమ్మించగలిగాడు. కళ్యాణి దేవాలయానికో, మార్కెట్‌కో వెళ్ళిందని చెప్తే, వాళ్ళు మళ్ళీ రావచ్చు లేదా ఆవిణ్ణి తీసుకుని రండి అని యిద్దర్నీ పిలవొచ్చు అందుకే ఓ వారం పదిరోజులకి సరిపడేవిధంగా అబద్ధం ఆడేశాడు. అప్పటికి శామ్యూల్ సింగపూర్ వెళ్ళిపోవచ్చు తర్వాత ఏం జరుగుతుందో అప్పుడే ఆలోచించుకోవచ్చనే కాస్త పెద్ద అబద్ధాన్నే రెడీ చేసుకున్నాడు. సులభంగానే సక్సెస్సయ్యాడు. రాత్రి మంచం మీద పడుకుని ఆలోచనలో పడ్డాడు.

కళ్యాణి పుట్టింటికెళ్ళిపోయిన ఇన్ని గంటలవరకు ఆవిడ తల్లిదండ్రులనించి ఫోన్ రాలేదంటే... వాళ్ళతో ఇక్కడ జరిగిన విషయాలేవీ చెప్పలేదనుకోవాలా? చెప్పినా, "వాడే నిన్ను వెదుక్కుంటూ విశాఖపట్నమొస్తాడు. అప్పుడే వాడికి చెయ్యాల్సిన శాస్తి చేద్దాం" అనుకుని వూరుకున్నారా? ఏమో... అట్నుంచి ఏ రకమయిన చర్య వుంటుందో వూహకందడంలేదు. ఎలాంటి చర్య వచ్చినా, తనలో ప్రతిఘటించే శక్తి లేదు. పరిస్థితులన్నీ తనకి వ్యతిరేకంగానే వున్నాయి. అన్ని ఆధారాలు తనని నేరస్థుడిగానే నిరూపించాయి. నిరూపించుకోవాలంటే కళ్యాణి తీసుకున్న ఆధారాలే ఒక్కోదాన్నీ ఖండించుకుంటూ వెళ్లాలి. వెళ్తే అవి తిన్నగా వెళ్ళి విజయ్ దగ్గర ఆగుతాయి. అతన్ని నేరస్థుడిగా నిలబెడతాయి. అది తనకెంత మాత్రం ఇష్టంలేదు. అందుకే ఏం జరిగితే అదే జరుగుతుంది. కొన్ని సమస్యల్ని కాలము పరిష్కరిస్తుందనే మాట మీద ఆధారపడివుండిపోయాడు.

మర్నాడు ఉదయం ఎనిమిది గంటలవరకు వైజాగ్‌నించి ఫోన్ రాలేదు. వంశీ పెరట్లో వున్న నూతి దగ్గరికి స్నానానికి వెళ్లబోతుండగా వెకిలి నవ్వు నవ్వుకుంటూ తాతారావు వచ్చాడు. వంశీ అతన్ని చూస్తూనే గతుక్కుమన్నాడు. తాతారావు ఓ వారం రోజులపాటు రాకపోతే బావుణ్ణనే అనుకుంటున్నాడుగానీ వచ్చేశాడు. అతనిక్కూడా నిన్న మాలతికి చెప్పిన అబద్ధాన్నే చెప్పాడుకానీ తాతారావు ఒకంతట నమ్మలేదు. నమ్మించడానికి ఓ పదినిమిషాలు పట్టింది. "కళ్యాణి వెళ్ళేముందు ఒక్కమాట, ఒక్క పదినిమిషాల ముందు చెప్పినా నేనూ వైజాగ్ వెళ్ళేవాణ్ణి. హాయిగా ఆ పెళ్ళి భోజనాలూ వగైరాలు చేసుండేవాణ్ణికదా! అద్సరే గానీ కళ్యాణి వెళ్లాక క్షేమంగా చేరుకున్నానంటూ నీకో ఫోన్ కూడా కొట్టలేదా? " అన్నాడు. వంశీ చటుక్కుమని అబద్ధమాడేశాడు. "ఎలా చేస్తుందండి? వాళ్ళింట్లో ఫోన్ డెడ్ అయిపోయిందనో పాడైపోయిందనో చెప్పింది. గతవారం రోజులనించి

వైజాగ్‌నించేం ఫోన్ రాలేదు"

తాతారావు నవ్వినట్టే నవ్వి ఠక్కున ఆగి, "వారంరోజుల్నించి అక్కడి ఫోన్ డెడ్ అయితే, కళ్యాణిని అర్జంట్‌గా పెళ్లికి రమ్మని వాళ్ల నాన్న ఎలా ఫోన్ చేశాడం టావ్?" అని అడిగాడు. వంశీ ముఖం కళ తగ్గింది. అయినా వెంటనే సర్దుకుని "మీరు భలేవారండి. వాళ్ళు ఫోన్ చెయ్యా లంటే ఇంట్లో ఫోన్‌నించే చెయ్యాలా? ప్రస్తుతం ఒక్కోవీధికి పదేసి యస్‌టిడి బూత్స్ వున్నాయికదా" అన్నాడు.

"ఔనౌను. నా కంటూ ఓ ఫోన్ లేకపోవ డంవల్ల నైతేనేమీ డబ్బులిచ్చి ఫోన్‌కాల్స్ చేసే అలవాటు లేకపోవడంవల్లనైతేనేమి నాకా ఐడియా తట్టలేదు సుమా" అంటూ సోఫాలో కూర్చున్నాడు. అతను వుండడం వల్ల తన బుర్ర తినేయడం తప్ప మరో లాభమేం వుండదు. ఇప్పుడు తన మానసి కస్థితి అతని వికారచేష్టల్ని భరించేస్థితిలో లేదు. "నేను స్నానానికి పెరట్లోకెళ్తున్నాను" అన్నాడు, అతన్ని పొమ్మనే ఉద్దేశంతో.

"వెళ్లవయ్యా, నేనేం వద్దనలేదే"

"అది కాదండి. మీరు వెళ్తే తలుపేసుకుం దామని..."

"నేను వెళ్తేకదా తలుపు వేస్కోడానికి. నేనిక్కడే కూర్చుంటాను"

"అది కాదండి నేనొచ్చేసరికి కాస్త లేట్ అవుతుంది. మీ ఒక్కరికీ ఇక్కడ బోర్ కొడుతుందని... ఈలోగా మీరు మాలతిగా రింటికెళ్ళి వాలిపోతే మీకీరోజు టిఫిన్ ఖర్చు తగ్గుతుందిగా" తన చిరాకుని అణచు కుంటూ అన్నాడు.

అయినా అతను కదల్లేదు. "మాలతీవా ళ్ళాయన సింగపూర్‌నించి వచ్చాడని తెల్సింది. అంచేత అక్కడకి పదిగంటల ప్రాంతంలో వెళ్తే ఆ మాటా ఈ మాటా చెప్పుకుంటూ పన్నెండుగంటలదాకా కాల క్షేపం చేసేస్తే వచ్చినట్టు వాళ్లే భోజనానికుం డిపొమ్మంటారుకదా! ఆ అయిడియాతోనే వచ్చాను. నువ్వెళ్లి స్నానం చేసిరా" అన్నాడు తాతారావు వెకిలిగా. అతన్ని పంపడం తనకి సాధ్యమయ్యే పనికాదని తేల్చేసుకుని వంశీ పెరట్లోకెళ్ళాడు. తాతారావు టీవీ ఆన్ చేసి ఓ రెండు మూడు నిమిషాలు చూశాక ఫోన్‌వైపు చూశాడు. ఉత్తినే వస్తున్న ఫోన్‌ని చూస్తూ వూరుకో బుద్ధికాలేదు. హైదరాబాద్‌నించి మరో వూరికి యస్‌టిడి కాల్ చేసి మాట్లాడాలనే సరదా అతనికుంది. కానీ ఫోన్ ఫ్రీగా ఎక్కడా దొరకలేదు. ఇప్పుడు ఇక్కడ దొరికింది. కానీ పగటిపూట యస్‌టిడి కాల్ చేస్తే బిల్లు గూబ అదిరిపో తుందని తెలుసు. వంశీకి తెలిస్తే గొడవ పెడతాడు. అతనికి వినబడకుండా మాట్లా డేస్తే? అయిడియా బాగానే వుంది. కానీ ఎవరికి చెయ్యడం? విశాఖపట్నం కాల్ చేసి కళ్యాణి తండ్రి రామారావుతో మాట్లాడితే మాట్లాడొచ్చు. కానీ ఆ ఫోన్ డెడ్ అయిం దని వంశీ చెప్పాడే. డెడ్ అయితే మాత్రం ఇన్నిరోజులు డెడ్ అయిపోతుందా? అలా అయిపోతే రామారావు వూరుకోడే! వాడు అసలే చాలా కరాఖండీ అయిన మనిషి. ఈ నాలుగురోజుల్లోను ఫోన్ రిపేర్ అయి పోయుండొచ్చు. ఓసారి ట్రై చేస్తే ఏంపో యింది? అనుకుంటూనే ఫోన్ డయల్ చేశాడు. అవతల ఫోన్ రింగ్ అయింది. ఫోన్ దగ్గరే కూర్చుని పేపర్ చదువుతున్న రామారావు ఫోన్ ఎత్తాడు. అప్పుడు హాల్లో రామారావు ఒక్కడే వున్నాడు. కళ్యాణి లోప లుంది.

"ఎవరు?"

తాతారావు బిగ్గరగా మాట్లాడితే పెరట్లో వున్న వంశీకి వినబడుతుందని స్వరం తగ్గించి మాట్లాడాడు. "నేనురా తాతారా వుని. హైదరాబాద్‌నించి మాట్లాడుతు న్నాను... అహ్హహ్హ... చెప్పానుగా. నేను సొంత డబ్బుల్తో నాకు కావల్సిన సామాన్లే కొనను. అలాంటిది హైదరాబాద్ టూ

వైజాగ్ యస్‌టిడి కాల్ ఎందుకు చేస్తాను? మీ అల్లుడిగారింటినించే మాట్లాడుతున్నాను"

"ఆ ఫోన్ బాగుపడిపోయిందన్నమాట"

"ఇది బాగానే వుందే! మీ ఫోన్ డెడ్ అయిందని వంశీ చెప్తేనూ...' మీ అల్లుడిప్పుడే స్నానానికెళ్ళాడు... అతను కాంప్‌నించి రావడం ఏంటి? అలాగని అతనేం చెప్పలేదే... మన కళ్యాణి ఏదో పెళ్లికి వైజాగ్ వెళ్లిందన్నాడు. చెప్పింది వినరా... నీ ఫోన్ డెడ్ అయిందని చెప్పి స్నానానికి... హలో... హలో... హలో" లైన్ కట్ అయింది. హలో హలో అంటూ బిగ్గరగా అరవబోయి, వంశీకి వినిపిస్తుందనే భయంతో నోరు నొక్కేసుకున్నాడు. మళ్ళీ డయల్ చేసేవాడేగాని, అప్పటికే వంశీ వచ్చెయ్యడంవల్ల గప్‌చిప్‌గా ఫోన్ పెట్టేశాడు. విశాఖపట్నం ఫోన్ చేసిన విషయం వంశీకి చెప్పలేదు.

★ ★ ★

తాతారావు చేసిన ఫోన్ అందుకున్న రామారావు మధ్యలో లైన్ కట్ అవడంతో ఫోన్ పెట్టేశాడు. వంశీకి తనే ఫోన్ చేద్దామా అనుకున్నాడు. కానీ అంతలోనే అతన్లో రిటైరై విశ్రాంతి తీసుకుంటున్న పోలీస్ ఇన్‌స్పెక్టర్ బద్ధకంగా ఒళ్లు విరుచుకుంటూ లేచి నిలబడ్డాడు. తన ఇంట్లోని ఫోన్ డెడ్ అయిందని కళ్యాణి చెప్పింది. కానీ అది డెడ్ అవలేదని తాతారావు చెప్పిన మాటల్ని బట్టి తెలుస్తోంది. ఇక్కడి ఫోన్ డెడ్ అయిందని వంశీ తాతారావుకి చెప్పాడు... కాంప్‌కెళ్లి పది రోజులువరకు వంశీ రాడని కళ్యాణి చెప్పింది... కానీ అతనింట్లోనే వున్నాడు... అంటే ఇక్కడ కళ్యాణి, అక్కడ వంశీ అబద్ధాలు చెప్పినట్టుగానే అనిపిస్తోంది. ఇద్దరూ కూడబలుక్కునే అబద్ధమాడేరా? వచ్చిందగ్గర్నించి కళ్యాణి వ్యవహారం కాస్త తేడాగానే కనిపిస్తోంది. తన ముందు, సుభద్ర ముందు కళ్యాణి ఏమీ జరగనట్టుగానే కనిపిస్తున్నా ఒంటరిగా వున్నప్పుడు మాత్రం కాస్త డల్‌గా, మూడీగా కనిపిస్తోంది. ఏదో జరిగేవుండాలి.

కళ్యాణిని పిలిచాడు. ఆమెతోపాటే సుభద్రా వచ్చింది. కళ్యాణిని వచ్చి తన ఎదుట కూర్చోమన్నాడు. "అక్కడేం జరిగింది? " సూటిగా అడిగాడు.

"ఏం జరగలేదు డాడీ"

"ఏమీ జరగలేదన్నది పచ్చి అబద్ధం. ఏదో జరిగిందన్నది నిజం. నేను వయసు రీత్యా పోలీస్ ఇన్‌స్పెక్టర్‌గా రిటైరైపోవచ్చు కానీ నాలోని పోలీస్ ఇంకా రిటైర్ కాలేదని నీకూ తెలుసు. ఉదయం ఏడుగంటలకి వంశీకి ఫోన్ చెయ్యమ్మా అంటే మీ ఫోన్ డెడ్ అయిందన్నావు. హైదరాబాద్‌లో ఇంత వేగంగా వైర్లు వెయ్యరన్నావు. కానీ వంశీ ఇక్కడున్న మన ఫోనూ డెడ్ అయిందని చెప్పాడట. కమాన్ టెల్ మీ... ఏమైంది? " అతను హుందాగా అడిగాడు. సుభద్ర ఏదో అడగబోతుంటే "అడిగింది నిన్ను కాదు" అంటూ వారించాడు. కళ్యాణికి దుఃఖం ముంచుకొచ్చింది. ఏడుస్తూనే జరిగిందంతా వివరంగా చెప్పింది. అంతా విన్నాక సుభద్ర గయ్యిమంటూ లేచి "ఇంత దారుణం జరిగాక ఇంకా మనం చేతులు ముడుచుక్కూర్చుంటామా? ఆస్తీపాస్తీ వెనకాముందు ఎవరూ లేకపోయినా మనకున్న ఒక్కగానొక్క కూతుర్నిచ్చి పెళ్లిచేస్తే అతనిప్పుడు ఇంతకి బరితెగించి పట్టపగలు... హవ్వ... వెంటనే మనిద్దరం వెళ్లి..." అంటూ ఆవేశపడుతుంటే రామారావు ఆవిణ్ణి ఆపుచేశాడు.

"మన కళ్యాణికి మొదట్నించి తొందరపాటెక్కువ. అది దానికున్న మైనస్ పాయింట్. నేను చేసిన ఎంక్వయిరీ ప్రకారం వంశీ కారెక్టర్ చాలా మంచిది. అదే ఆయనకున్న ప్లస్ పాయింట్! బట్ నా కేలుక్కులేషన్స్‌కి విరుద్ధంగా వున్నాయి

కళ్యాణి చెప్పిన ఇన్సిడెంట్స్. న్యూస్ తెలియగానే దండయాత్రకి బయలుదేరిపోడానికి ఇదేం గూండాకేసు కాదు. ఈ వివరాల్లోని నిజానిజాలు తెల్సుకోవాలంటే నేనే వెళ్ళి తెల్సుకోవాలి. అది కూడా నువ్వు లేకుండా"

"ఏం నేనొస్తే ఏంటట? నేను కన్నతల్లి నండీ"

"అందుకే రావద్దంటున్నాను. నీకు నోరెక్కువ ఆలోచన తక్కువ. పోలీసు పద్ధతుల్లో ప్రొసీడ్ అవడానికిదేమీ క్రిమినల్ కేసు కాదు. ఓ ఫ్యామిలీకేసు. అదీ మనమ్మాయికి సంబంధించింది. అంచేత పెద్దమనిషి తరహాలో ప్రశాంతంగా, నిదానంగా డీల్ చెయ్యాలి. నేనే వెళ్తాను. ఈలోగా మీరిద్దరూ వంశీకి..."

"తప్పకుండా ఫోన్ చేస్తాం"

"నోర్ముయ్. ఇది ఫోన్‌మీద డీల్ చేసే కేసయితే ఆ ఫోనేదో నేనే చేసేవాణ్ణిగా. మీరు అలాంటి పనులేం చెయ్యకండి" అంటూ రామారావు భార్యని, కూతుర్ని హెచ్చరించాడు.

★ ★ ★

వంశీ పనిచేసే ఆఫీసులో స్టాఫ్‌మెంబర్స్ ముందు కళ్యాణి చేసిన అవమానాన్ని భరించలేక ఏడుస్తూ ఇంటికెళ్ళిపోయిన జయలత ఆ మర్నాటినించి సిక్‌లీవ్‌కి అప్లయ్ చేసింది. ఇంట్లో కూర్చుని మర్నాడు ఏడవకుండా తన వర్తమానాన్ని, తన భవిష్యత్తుని దృష్టిలో పెట్టుకుని ఆలోచించింది. తను పెళ్ళి చేసుకోవాలి. పెళ్ళి అనే వ్యవస్థ ఆడదానిక్కావలసిన కనీసపు భద్రత. మెడలోని తాళిబొట్టు ఓ గౌరవాన్ని సమకూరుస్తుంది. పెళ్ళికానితనం, ప్లస్ పేదరికం... ఎదుటివారికి చులకనభావం ఏర్పరుస్తుంది. కుమారి జయలత, ఫలానావాడితో తిరిగిందంటే ఆ నిందని చాలా సులభంగా నమ్ముతారు. ఎందుకంటే అందుక్కారణం. బాగా ముదిరిపోయిన పేదరికం. ఇప్పుడే నవనవలాడుతున్న యవ్వనం. తన వీధిలో వున్న ప్రొవిజినల్ స్టోర్స్ ప్రొప్రయిటర్ కన్నారావుకి వయసు నలభై ఏడు. భార్య పోయి రెండేళ్ళయింది. ఇద్దరు పిల్లలు. అతని దగ్గరకి కిరాణాసామాన్లు కొంటాని కొచ్చే జయలతని పెళ్ళాడాలనుకున్నాడు. ఆవిడ తల్లికి కబురు చేశాడు. "ఆయనకేమైనా బుద్ధుందా లేదా? " అంటూ కసిరి, ఆమధ్యవర్తిని పంపించేసింది. కానీ ఆఫీసులో, అవమానం జరిగిన మూడోరోజు, జయలత తల్లి దగ్గర కూర్చుని, "ప్రొప్రయిటర్ కన్నారావు పెళ్ళి విషయం అడిగినప్పుడు బుద్ధి లేదా అంటూ తిరస్కరించావు. కానీ బాగా ఆలోచించాక మనకే బుద్ధిలేదని తేలిపోయింది. నేనతన్ని పెళ్ళి చేసుకుంటాను, ముహూర్తాలతో పనిలేకుండా. రేపో, ఎల్లుండో ఆయనో అరగంట తీరిక చేసుకుని నాకు తాళికట్టెయ్యొచ్చు. నాకిప్పుడిప్పుడే వచ్చిన బుద్ధి మారిపోకముందే ఆ పని జరిపించు" అంది దృఢనిశ్చయంతో.

★ ★ ★

వంశీ కొలీగ్స్ వంశీకి ఫోన్ చెయ్యడానిక్కూడా భయపడుతున్నారు. నాలుగోరోజు తెగించి రాంబాబు ఫోన్ చేస్తే వంశీ చాలా నిర్లిప్తంగా మాట్లాడి, "నా ఏకాంతమే నాకు మనశ్శాంతిని కలగచేస్తోంది. మీ పరామర్శలతో నాకున్న ఈ ప్రశాంతతని కూడా భంగం చెయ్యకుండా వుంటే అదే మీరు నాకిచ్చిన పెద్ద వరమవుతుంద"ని చెప్పి ఫోన్ పెట్టేశాడు.

రాంబాబు ఆ మాటలు చెప్పి బాధపడ్డాడు.

"ఇవాళ సాయంత్రం అందరం కలిసి వెళ్దాం" అన్నాడు ప్యూన్ రంగారావు.

"అలాంటి బుద్ధి తక్కువ పనులు చెయ్యొద్దు" అంటూ రాంబాబు సీరియస్‌గా హెచ్చరించాడు. అప్పటికే వాళ్ళందరికి వంశీ భార్య కళ్యాణి పుట్టింటికెళ్ళిపోయిందని

తెలుసు. ఓ అరగంటక్రితం జయలత కిరాణాకొట్టు కన్నారావుని పెళ్లి చేసుకుంటోందని తెలిసింది. "వంశీ అసలే సున్నితమనస్కుడు. ఆ సున్నితమైన మనసుమీద జరిగిన అవమానం సూదుల్తో గుచ్చింది" అని రాంబాబు ఆలోచించి అప్పటికప్పుడు సెలవుపెట్టేసి "వంశీ ఇంటికి వెళ్తున్నాను" అన్చెప్పి మరీ బయలుదేరాడు.



ఉదయం పదకొండు గంటల సమయంలో వంశీ తన బెడ్‌రూమ్‌లో మంచం మీద వాలి తిరుగుతున్న సీలింగ్‌ఫ్యాన్ వైపు చూస్తూ ఆలోచనలో పడ్డాడు. కళ్యాణి వెళ్లిపోయి అయిదోరోజు. ఇంతవరకు ఫోన్ రాలేదంటే ఆవిడ తన తల్లిదండ్రులకీ విషయం చెప్పలేదని కన్ఫర్మ్ అయినట్టే! తను ఫోన్ చేసినా ఫోన్ ద్వారా ఆవిణ్ణి కన్విన్స్ చెయ్యలేననే నమ్మకంతోనే ఇంతవరకు ఫోన్ చెయ్యడానికి సాహసించలేదు. ఇవాళో రేపో సడన్‌గా బయలుదేరి విశాఖపట్నం వెళ్లి నచ్చజెప్పడానికి ప్రయత్నిస్తే ఎలా వుంటుంది? బావుంటుందా? బావుండదా? అందువల్ల కొంతవరకైనా లాభం కలుగుతుందా? లేక ఇంకా నష్టం కలుగుతుందా? ఇవే ప్రశ్నల గురించి ఆలోచిస్తుండగా రాంబాబు ఓ ఫుల్ బాటిల్ మందు పట్టుకొచ్చాడు.

"నాకు చెప్పకుండా ఎందుకొచ్చావు?" అంటూ విసుక్కున్నాడు వంశీ.

"విషాదం జరిగిన ఇంటికి రావడానికి ఎవరి పర్మిషనూ అక్కర్లేదు బాసూ" అంటూ అతనే డ్రాయింగ్ రూమ్‌లోనించి ఓ కుర్చీ తెచ్చి బెడ్‌రూమ్‌లో వేశాడు. వంటగదిలోకెళ్లి రెండు గాజుగ్లాసులు, ఫ్రిజ్‌లోనించి వాటర్‌బోటిల్ తీసుకొచ్చి కూర్చున్నాడు. రెండుగ్లాసుల్లోనూ విస్కీ వేసి గ్లాసులనిండా నీళ్లుపోసి ఓ గ్లాసు పట్టుకుని "నువ్వు కూడా గ్లాస్ అందుకుని ఛీర్స్ కొట్టు బాసూ" అన్నాడు. వంశీకి చిర్రెత్తుకొచ్చింది. ఈ మందు పంపకమంతా అతను బాత్‌రూమ్ కెళ్లొచ్చేలోగా జరిగిపోయింది.

"ఏమిటీ నాన్‌సెన్స్... అంతా ఇక్కడ పెట్టారు? నాకిలాంటి అలవాట్లు లేవని మీకు తెల్సుగదా" అన్నాడు కోపంగా. అయినా రాంబాబు తన ధోరణిలోనే మాట్లాడాడు.

"మామూలప్పుడు తలనెప్పి మాత్ర వేసుకుంటామా? వేస్కోం. తలనెప్పి వచ్చినప్పుడే వేసుకుంటాం. మీ మనసు ఎంత బాధపడుతోందో నాకు తెలుసు. ఎందుకంటే ఆరోజు ఆఫీసులో జరిగిన సంఘటనా చూశాను. ఇవాళ ఫోన్ చేసినప్పుడు మీరు చెప్పిన మాటలూ విన్నాను. మనశ్శాంతి లేనప్పుడు దాన్ని పొందడానికి ఈ మందు తప్ప మరోమందు లేదు" అంటూ తనో గుక్కెడుతాగి, తనతోపాటు తెచ్చిన పకోడీ పొట్లాన్ని, జీడిపప్పు పొట్లాన్ని విప్పిపెట్టాడు. "తాగు బాసూ" అంటూ మళ్ళీ రిక్వెస్ట్ చేశాడు.

వంశీకి అతన్తో మాట్లాడబుద్ధి కాలేదు. మెడ పట్టుకుని బైటకి గెంటేద్దామా అనుకున్నాడు. కానీ సభ్యతా సంస్కారాలు అతని చేత ఆ పని చేయించలేకపోయాయి. అతను మాత్రం తన గ్లాసులోని మందుని

కొద్దికొద్దిగా తాగుతూనే జయలత రేపో ఎల్లుండో కిరాణాషాప్ ప్రొప్రయిటర్ని పెళ్లాడబోతున్న విషయం చెప్పాడు. వంశీ చలించిపోయి "ఎందుకంత తొందరపడింది? " అన్నాడు అప్రయత్నంగానే.

"ఎందుకూ అంటే ఏం చెప్పమంటారండి? సమాధానం మీకు తెలీదా? నాకు తెలీదా? మొన్న జరిగిన ఇన్సిడెంట్‌తో ఆవిడ భయం ఆవిడకేర్పడింది. తనకి సూట్ అయ్యే భర్తని ఎంచుకునే ఛాన్స్ ఆవిడకి లేదు. బికాజ్ ఆవిడ ఫ్యామిలీ పొజిషన్ ఏంటో మనందరికీ తెలుసు" అంటూ వంశీని చూశాడు. అతను మంచానికి ఆనుకుని కూర్చుని చెమ్మగిల్లిన కళ్లని తుడుచుకుంటున్నాడు.

రాంబాబుకి హృదయం ద్రవించింది. "నాకు తెల్సుబాసూ... మీరు చాలా బాధపడతారని తెలుసు. మిమ్మల్ని మంచి మంచి మాటల్తో ఓదార్చే శక్తి నాకు లేదు. కానీ మీరు మీ బాధనించి డైవర్ట్ కావాలి. అందుకు తగిన మందు ఇదొక్కటే. మీరో రెండు పెగ్గులు పుచ్చుకుని పడుకుంటే మనసు దానంతటదే తేలికవుతుంది. అందుకే ఓ ఫుల్‌బాటిల్ తెచ్చాను" అన్నాడు. అతను మరో రౌండ్ కూడా ఆరంభించాడు.

వంశీ అతని మాటలు వినడంలేదు. శూన్యంలోకే చూస్తున్నాడు. రాంబాబు అతన్ని నిశ్శబ్ద ప్రపంచంలోనే వుంచాలనే వుద్దేశ్యంతో మరేం మాట్లాడలేదు. హాల్లో వున్న ఫోన్ మోగుతున్నా వంశీ దీర్ఘాలోచనలో వుండడంవల్ల డిస్టర్బ్ కాలేదు. రాంబాబు గబగబ వెళ్ళి ఫోన్ అందుకున్నాడు. అది అతనింటినించి అతని కొచ్చిన ఫోన్! వాళ్ళ తమ్ముడికి మళ్ళీ ఫిట్స్ వచ్చాయి, అతనికోసం ఆఫీస్‌కి ఫోన్‌చేస్తే ఇక్కడ దొరకొచ్చని ఆఫీసువాళ్లు ఈ నెంబరిచ్చారట. అతని భార్య ఆ విషయం చెప్పింది. వెంటనే వస్తున్నానని చెప్పి ఫోన్ పెట్టేసి వంశీ దగ్గరకెళ్ళాడు. తన తమ్ముడి విషయం చెప్పి "నేను వెళ్లొస్తాను బాసూ మీరింకా సిప్ చెయ్యనేలేదు. రెండు పెగ్గులు వేస్కుని ప్రశాంతంగా పడుకోండి" అన్చెప్పి తన గ్లాసులోని మిగతా విస్కీని తాగబోయి ఆగిపోయేడు. డాక్టర్ దగ్గరకెళ్ళాలి కాబట్టి బాగోదనుకుంటూ గ్లాసుని టీపాయ్‌మీద పెట్టేసి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళడంగాని, వెళ్ళేటప్పుడు చెప్పిన మాటలుగాని వంశీ గమనించలేదు. వినలేదు. కళ్ళు తెరచి ధ్యానంలో వుండిపోయిన రుషిలాగే వుండిపోయాడు. తనవల్ల జయలత అవమానించబడింది. ఆ అవమానభారం భరించలేక, రెండో పెళ్ళి వాణ్ణి, వయసులో మరీ పెద్దవాణ్ణి పెళ్ళాడ్డానికి సిద్ధపడింది. అతను ఆలోచిస్తున్నదదే! తన ప్రమేయంలేకుండా తను ఎంతోమందిని బాధపెట్టిన వాడవుతున్నాడు. ఓ అయిదు నిమిషాల తర్వాత జయలత ఆ యిల్లు వెదుక్కుంటూ వచ్చింది. ఆఫీసునించి ఆవిడ ఏడ్చుకుంటూ వెళ్ళిపోయాక వంశీ ఏమయ్యాడు? కళ్యాణి ఏమైందనే విషయం ఆమెకు తెలియదు. తెల్సిందల్లా వంశీ కూడా శెలవులో వున్నాడనే! కళ్యాణి దగ్గర కొచ్చి తన పెళ్ళి విషయం చెప్పి "ఇకమీదనైనా మీ అపార్థాలని తొలగించుకోండి" అని నచ్చజెప్పడానికే ఆ యింటి కొచ్చింది. వీధి తలుపులు తెరిచేవున్నాయి. హాల్లో ఎవరూ కనబడలేదు. జయలత గుమ్మందగ్గరే నిలబడి, కాస్త మెల్లగా "మేడమ్ మేడమ్" అని పిల్చింది. ఎటువంటి జవాబు రాలేదు. మెల్లగా లోపలకెళ్ళింది. అప్పుడూ ఎవరూ కనబడలేదు. బెడ్‌రూమ్‌లో ఎవరో వున్నట్టనిపిస్తే "మేడమ్" అని పిలుస్తూ ఆ రూమ్ దగ్గర కెళ్ళింది. వంశీ డిస్టర్బ్ అయి చూశాడు. లేచి నిలబడ్డాడు. ఎదురుగా జయలత! అతనెంతో ఆశ్చర్యపోయాడు. తను ఎవరి గురించైతే ఆలోచిస్తున్నాడో

అదే వ్యక్తి తన కళ్ళముందు కనిపించేసరికి కాస్త కంగారుపడి "రా జయా రా కూర్చో" అన్నాడు.

"మేడమ్‌గారితో మాట్లాడాలండి" ఎటువంటి భావమూ వ్యక్తం చెయ్యకుండా అంది.

"అది... అది... ముందు కూర్చో జయా" అన్నాడు.

జయ వచ్చి కుర్చీలో కూర్చుంది. "ఎల్లుండి నా పెళ్ళి" అని చెప్పడానికి ఆవిడొచ్చింది.

"నావల్ల, నా భార్యవల్ల నువ్వు తొందరపాటు నిర్ణయం తీస్కున్నావేమో" అంటూ తన ఆవేదనని తెలియజేయాలనే తపనతో అతనన్నాడు. అందుచేత అది బెడ్‌రూమని, టీపాయ్‌మీద విస్కీ బాటిల్ వగైరాలున్నాయన్న విషయం వారి దృష్టికి రాలేదు. "మేడమ్‌గారు లేరాండి? నేను కేవలం ఆవిడతో మాట్లాడాలనేవచ్చాను. ఎల్లుండి నా పెళ్ళి" అంది నేలవైపు చూస్తూ.

బయటనించి "వంశీ వంశీ" అనే పిలుపు వినిపించింది. అది తాతారావు గొంతు. వంశీ కాస్త కంగారుపడి, ఆ గదినించి కదలబోయేలోగా, గుమ్మందగ్గర తాతారావు పక్కనున్న వ్యక్తిని చూసి అతను పిడుగుపడినట్టుగా అదిరిపడ్డాడు!

ఆ వ్యక్తి... కళ్యాణి తండ్రి రామారావుగారు!

"న... నమస్కారం మావయ్యగారూ"

రామారావు కళ్ళు నిప్పుకణిల్లా మెరుస్తున్నాయి. వంశీ ఏదోమాట్లాడబోతుంటే నువ్వేం చెప్పొద్దన్నట్టుగా చెయ్యి చూపించి జయలతని అడిగాడు.

"జయలతంటే నువ్వేనా?"

ఔనని తల వూపింది. "మా కళ్యాణి నీ రాసలీలగురించి, నీ గర్ల్‌ఫ్రెండ్ గురించి చెప్తే, అది చాలా తొందరపడిందనుకున్నాను, పొరపాటు పడిందనుకున్నాను. నిజానిజాలు తెల్సుకోడానికి నేను నీ యింటికి రాకుండా ఓ లాడ్జీలో దిగి, తాతారావుని వెంటబెట్టుకొచ్చేసరికి నీ బెడ్‌రూమ్‌లో పట్టపగలు, మందుకొడుతూ నీ గర్ల్‌ఫ్రెండ్‌తో"

"మీరు పొరబడుతున్నారండి"

"ఏవిధంగా పొరబడ్డాను? ఏదో యింటికొచ్చేసి, అదే నీ యిల్లని పొరబడ్డానా? ఎవర్నో చూసి అతను వంశీకృష్ణే అని పొరబడ్డానా? ఓ ఆఫీస్ రూమ్‌ని చూసి, అదో బెడ్‌రూమని పొరబడ్డానా? నీళ్ళసీసాని చూసి అది విస్కీసీసా అని పొరబడ్డానా? మీరు తాగలేదని పొరబడ్డానా? ఈవిడ నీ గర్ల్‌ఫ్రెండ్ కాదని పొరబడ్డానా? వీధి తలుపులు బార్లా తెరిచిపెట్టి మరీ ఇంతకి సిద్ధపడ్డారంటే, అది నీ బరితెగింపు అనుకోవాలా? లేక..."

"ఆగండిసార్. మీరు నిజానిజాలు తెల్సుకోకుండా మాట్లాడకండి. ఈ అమ్మాయి మీ అమ్మాయి చేత అనుమానించబడి అవమానించబడిన జయలతే! కానీ, యీవిడెందుకొచ్చిందో తెలుసా?" వంశీ మర్యాదస్థాయిని క్రమంగా వదిలేస్తూ ఆవేశంలోకి వెళ్తూ అన్నాడు.

కానీ రామారావు అతన్ని మాట్లాడనివ్వకుండా తన అపార్థాన్నే ఆవేశంగా మార్చుకుంటూ, మునుపటికంటే బిగ్గరగా అరిచాడు. "ఇంత స్పష్టంగా ఆధారాలుకనిపించాక కూడా నువ్వు దబాయించడానికి ప్రయత్నిస్తున్నావంటే నువ్వు గుండెలు తీసిన బంటువనిపించుకుంటావ్! రాటుదేలిపోయిన జులాయ్‌గాడివనిపించుకుంటావ్"

అంతవరకు అయోమయంగా చూస్తూ నిలబడిన తాతారావు జోక్యం చేస్కుంటూ "పాపం అతనేదో చెప్పాలనుకుంటున్నాడు. కాస్త వినొచ్చుగా" అన్నాడు.

రామారావు ఇప్పుడు తనకోపాన్ని తాతారావుమీద చూపించాడు "ఇంకా ఏంట్రా వినేది స్కాండ్రల్? ఈయనగారు బుద్ధి

మంతుడు, నీతిమంతుడూ అని నువ్వూ, ఆ విజయ్‌గాడు చెప్పింది వినబట్టేగదా యింత వరకూ వచ్చింది? ఇలాంటి వాణ్ణి వదిలేసొచ్చిందంటే అందులో నాకూతురు చేసిన తప్పేంలేదు" బిగ్గరగా అరుచుకుంటూనే వీధిలో కొచ్చాడు. వచ్చాక కూడా కేకలు వేశాడు.

ఆ కేకలకి ఓ పదిమందిదాకా పోగుబడి "ఏం జరిగిందండీ" అని వంశీని అడిగారు. వంశీకి ఆ పరిస్థితే కడుదుర్భరంగా వుంది. తాతారావు కంట్రోల్ చేస్తున్నా రామారావు శాంతించడంలేదు.

అడుగుతున్నది వంశీనయితే, వాళ్ళు అడిగిందానికి రామారావు రంకెలువేస్తూ జవాబు చెప్పాడు. "నేను కానిస్టేబుల్ దగ్గర్నించి ఇనస్పెక్టర్‌దాకా ఎదిగినవాణ్ణి! ముఖాన్ని చూసి, వాడు దొంగో దొరో చెప్పెయ్యగల కెపాసిటీ వుండి గూడా వీడి విషయంలో దారుణంగా దెబ్బతినేశాను. నా అంతట నేను తినెయ్యలేదు. ఇదిగో, ఈ తాతారావుగాడు, విజయ్‌గాడు నా కళ్ళకి గంతలు కట్టేసి, నా చేతికే కత్తిచ్చి నా కూతురు గొంతు కోయించేశారు"

అతను మరీ రెచ్చిపోతుంటే, తాతారావు కూడా కాస్త ఆవేశపడి "రేయ్ రామారావ్, నువ్వు తొందరపడి నోరుజారకు! పద వెళ్దాం" అంటూ అతన్ని లాక్కెళ్తూ, చుట్టూ వున్న జనాన్ని కూడా "వెళ్ళండయ్యా వెళ్ళండి. మీ యింట్లో మాత్రం గొడవలుండవా? వెళ్లండెళ్ళండి" అని కసురుకున్నాడు.

జనం సణుక్కుంటూ వెళ్లిపోయారు. తాతారావు రామారావుని తీస్కుని వెళ్ళిపోయాడు. వంశీ మెల్లగా లోనికి నడిచాడు. బెడ్‌రూమ్‌లో భోరుమని ఏడుస్తూ జయలత కనిపిస్తుందనుకున్నాడు కానీ ఆవిడ డ్రాయింగ్ రూమ్ సోఫాలో కూర్చుంది, వచ్చినప్పుడు ఎలా వుందో, యిప్పుడూ అలాగే వుంది తప్ప ఏడవడంలేదు.

"సారీ జయా..." అంతకంటే అతనికి మాటలురాలేదు. ఆమె లేచి నిలబడింది.

"ఫర్వాలేదండి. ఆవేళ మీ ఆవిడగారు అకారణంగా నన్ను అనుమానించింది, అవమానించింది. మిమ్మల్నీ, నన్నూ నేరస్థుల్ని చేసింది. ఏ పరిస్థితుల్లో మీరు నేరస్థులుగా నిలబడాల్సొచ్చిందో, అందుకు నేనెలా కారణమయ్యేనో నేనూహించలేకపోయాను. కానీ, యిప్పుడున్న పరిస్థితులు, ఆధారాలు మరోసారి మనిద్దర్నీ నేరస్థుల్ని చేస్తున్నాయి. ఆఫీసులో జరిగిన అవమానం సంగతి తెల్సి కూడా, ఆ కిరాణాకొట్టు షావుకారు నన్ను పెళ్ళిచేస్కోడానికి సిద్ధపడ్డాడు. ఇప్పుడు జరిగిన యీ అవమానం సంగతి తెల్సినా అతను తన నిర్ణయాన్ని మార్చుకోడు. ఎందుకంటే రెండు కాళ్ళూ చచ్చుబడిపోయిన కన్నారావుని పెళ్ళాడ్డానికెవరూ ముందుకురావడంలేదు"

వంశీ హృదయంమీద చెర్నాకోలాతో కొట్టినట్టు చలించాడు.

"మీ ఆవిడగారుంటే నా పెళ్ళి విషయం చెప్పడానికొచ్చాను. కానీ ఆవిడ లేరు. రేపు మీరూ మీ ఆవిడా కలిసి సుఖంగా జీవిస్తారనే నేను ఆశిస్తున్నాను. అప్పుడైనా ఆవిడకి నా పెళ్ళి విషయం తెలిస్తే చాలు, నమస్కారం" ఆమె రెండు చేతుల్తో నమస్కరించి వెళ్లిపోయింది. వంశీ సోఫాలో కూలబడిపోయాడు.

సాయంత్రం ఆరుగంటల సమయంలో విజయ్‌ని తీసుకుని తాతారావు వచ్చాడు. అప్పటికే విజయ్‌తో తాతారావు జరిగిందంతా చెప్పాడు. విజయ్ వచ్చాక జయలత జరిగిన అవమానాల్ని తట్టుకోలేక తన పెళ్ళి విషయంలో ఎలాంటి నిర్ణయం తీసుకుందో వివరించాడు. దాంతో మానసికమైన అలజడి విజయ్‌లో బయల్దేరింది. ప్చ్... తనొక్కడు చేసిన తప్పుపనికి ఎన్ని విష పరిణామాలేర్పడుతున్నాయి. ఎంతమంది జీవి

తాలు ముళ్ళదార్లో పడిపోతున్నాయి? అను కుంటూ మౌనంగానే బాధపడుతూ వుండి పోయాడు.

తాతారావుకి జరిగిన విషయంలో సగమే అర్థమైంది. "ఏం జరిగిందో పూర్తిగా చెప్పండ్రా! తలా ఓ ముక్క చెప్తుంటే వాటిని అతుక్కోలేక, అర్థంచేస్కోలేక చస్తున్నాను. మా రామారావుగాణ్ణడిగితే వాడి కూతురు జీవితాన్ని మన ముగ్గురమే నాశనం చేసేశామని తిట్టుకుంటూ గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో వెళ్ళిపోయాడు. ఈ అపార్థాలు, అనుమానాల కథ ఎక్కడ స్టార్టయిందో తెలిస్తే దాన్ని ఎలా ముగించాలో ఆలోచించొచ్చు" అన్నాడు నిజమైన ఆసక్తి కనబరుస్తూ.

"మీరు ఆలోచించడానికిదేం వడ్డీలు, అప్పుల సమస్యకాదండి" విజయ్ మెల్లగా గొణిగాడు.

"భలేవాడివేనయ్యా! ఇలాంటి విషయాలు నేనెందుకాలోచిస్తాను? ప్రతీ జబ్బుకీ ఒక్కో స్పెషలిస్టు వున్నట్టు ప్రతీ సమస్యకీ ఒక్కో మేధావి వుంటాడు. అందులోనూ మన చేతిలో ఇద్దరు మేధావులున్నారు"

"ఎవరు? "

"ఒకరు లాయర్ మాలతీదేవి, రెండు ఆవిడ భర్త శామ్యూల్"

వంశీకి ఆ ఇద్దరు మనుషులూ తెలిసినవారే. వారి సాయం తీస్కోవడం ఈ సమయంలో మంచిదేనేమోననిపించింది!

వంశీ ద్వారా వాళ్ళిద్దరి గురించీ విన్న విజయ్‌కి కూడా ఈ సలహా బాగుందనిపించింది. ఉదయం జరిగిన సంఘటన విన్నాక, వంశీకి చెప్పకుండా తనే విశాఖపట్నం వెళ్ళి ఈ కేసుని పరిష్కరించాలనుకున్నాడు. కానీ కళ్యాణి సంసారం నాశనం చేసిన వాళ్ళలో తనని కూడా ఒకరిగా లెక్కగట్టేరు కాబట్టి ఈ పరిస్థితుల్లో తను ఒక్కడూ వెళ్ళి ఏమీ చెయ్యలేడనే నిర్ణయానికొచ్చేశాడు.

తాతారావు వారిద్దర్నీ తీసుకుని మాలతి యింటికెళ్ళేసరికి ఇంటికి తాళంవేసుంది. పక్కింటి వాళ్ళనడిగితే "తిరపతెళ్ళారండి. మూడు నాలుగు రోజుల్లో వచ్చేస్తామని చెప్పారు" అన్నారు. ముగ్గుర్లోనూ తాత్కాలికమైన నిరాశ కలిగింది! వాళ్ళొచ్చేవరకు నిరీక్షించక తప్పదనే నిర్ణయించుకున్నారు.

నిరీక్షణలో ప్రతీ నిమిషం ఓ గంటలాగ, ప్రతీ గంటా ఒక దినంలాగ గడుస్తుంది. మూడోరోజు వుదయం పదకొండుగంటలప్పుడు వంశీకి ఆఫీస్ నించి ఫోన్ వచ్చింది. "జయలతకి నిన్న రాత్రి పెళ్లైపోయింది బాసూ" అని రాంబాబు ఫోన్ చేశాడు. వంశీ మౌనంగా విని ఫోన్ పెట్టేశాడు. కళ్యాణిమీద నిజంగా మొట్టమొదటిసారి అమితమైన కోపం వచ్చింది అప్పుడే! ఎవరో రగిలించిన జ్వాలకి వేరెవరో బలైపోయేరు. తన బాధని పంచుకునే మనిషి విజయ్ కాబట్టి అతనికి ఫోన్ చేసి ఈ విషయం చెప్పేడు. అవతల్నించి నిట్టూర్పు తప్ప మరేమీ వినిపించలేదు. ఒంటిగంట సమయంలో వంశీ మళ్ళీ ఫోన్ చేశాడు.

తనకు కళ్యాణినించి విడాకుల నోటీసు అందిందని చెప్పడానికి. ఓ అరగంటలో విజయ్ తాతారావుని తన కారులో తీసుకుని వంశీదగ్గరకొచ్చేడు. ముగ్గురూ డిస్కషన్‌లోపడ్డారు. "ఈ నిర్ణయంలో కళ్యాణి పాత్ర ఫిఫ్టీపెర్సంటు, ఆవిడ తండ్రి పాత్ర థర్టీ పెర్సంటు, తల్లిది ట్వంటీపెర్సంటు వుంటుందయ్యా! ఎవరి పెర్సంటేజి ఎంతున్నా, ఫలితం అనుభవించేది కళ్యాణే కదా" అంటూ తాతారావు పాము చావకుండా, కఱ్ఱ విరక్కుండా స్టేట్మెంటిచ్చాడు.

ఆ సాయంత్రం లాయర్ మాలతి భర్తతోసహా తిరుపతినించి తిరిగివచ్చారు. తాతారావు వంశీని, విజయ్‌నీ ఆ యింటికి తీసుకెళ్ళాడు. స్నేహితులిద్దరూ తమ జీవన సిద్ధాంతాలు సాధించిన దుష్ఫలితాల్ని దాపరికం లేకుండా వివరించారు. వంశీకి తన అభిప్రాయాలమీద యింకా నమ్మకం సన్న

గిల్లకపోయినా, వాటివల్ల అన్నీ నష్టాలే పొందిన తీరు విపులీకరించాడు. రాధ అనే లేడీ ఆర్టిస్ట్ మీద కళ్యాణి కొచ్చిన అనుమానం దగ్గర్నించి, జయలత రెండు కాళ్ళూ చచ్చుబడిన నడివయస్కుణ్ణి పెళ్ళాడ్డం వరకు ఏఒక్క విషయాన్నీ దాపరికం లేకుండా తెలియజేశారు.

అంతా వివరంగా విన్నాక మాలతిగానీ, శామ్యూల్ గానీ కాస్సేపు ఏమీ మాట్లాడలేదు. ఓ పావుగంట తర్వాత శామ్యూల్ మాలతిని తీసుకుని ఓ గదిలోకి వెళ్ళి కాస్సేపు చర్చించుకుని బయటకొచ్చేరు. "మిస్టర్ విజయ్! రేపు నేనూ, మాలతీ, కళ్యాణిని కలవడానికి విశాఖపట్నం వెళ్తున్నాం. మీరు మీ మిస్సెస్‌కి తెలీకుండా మాతోపాటు రాగలరా? " అడిగాడు శామ్యూల్.

"డెఫినెట్‌గా వస్తానండి. రావడమే కాదు, ఇక్కడ మీతో చెప్పింది అక్కడ వాళ్ళతోనూ చెప్తాను. ఆ తర్వాత ఎలాంటి పరిణామాలెదురయినా, నేను ధైర్యంగా ఫేస్ చేస్తాను" అన్నాడు విజయ్ తన దృఢనిశ్చయాన్ని తెలియజేస్తూ.

"విజయ్ మనతోపాటు రాకపోతే కథ ఎలా నడుస్తుంది? " అన్నాడు తాతారావు.

"సారీ బాబాయ్! మీరు, వంశీగారు రావడంలేదు. అక్కడ నడిచే కథకి మేం ముగ్గురం చాలు" అంది మాలతి. తాతారావు అవాక్కై వుండిపోయాడు.

★ ★ ★

కళ్యాణి, రామారావు, సుభద్ర ఓ సోఫాలో కూర్చున్నారు. ఎదురుగా మాలతి, శామ్యూల్, విజయ్ కూర్చున్నారు. వచ్చిన వాళ్ళకి కాఫీలిచ్చి కూర్చోబెట్టడం తప్పనిసరి కాబట్టి, ఆ ఫార్మాల్టీ అయినా పాటించారు తప్ప, కళ్యాణి, ఆమె తల్లిదండ్రులు తమ ఫేమిలీ మాటర్ని వాళ్ళతో డిస్కస్ చెయ్యడానికి యిష్టంలేనట్టుగా ముఖాలు బిగదీసుక్కూర్చున్నారు. ఇక్కడ జరిగే విషయమంతా తామే మాట్లాడతామని అవసరం వచ్చినప్పుడు మాత్రమే విజయ్ మాట్లాడాలని చెప్పడంవల్ల, విజయ్ మౌనంగా కూర్చున్నాడు.

"నేను నోటీసు పంపించిన తర్వాత కూడా రాయబారాలు పంపించడం ఫూలిష్ నెస్" అంది కళ్యాణి, ఎదుటనున్న మనుషులకి కాకుండా ఏదో గాలితో చెప్తున్నట్టుగా.

శామ్యూల్ ముగ్గుర్నీ పరిశీలించి చూస్తే కళ్యాణి చెప్పింది ఆవిడొక్కరి అభిప్రాయం మాత్రమేకాదు, ముగ్గురిదీ అదే అభిప్రాయమని స్పష్టం చేసుకున్నాక అడిగాడు.

"మేం రావడాన్ని ఫూలిష్‌నెస్ అనరండి. అసలు ఫూలిష్‌నెస్ అంటే అర్థం తెలుసా? "

"తెలుసు"

"తెలిసుంటే మేం ఇలా రావాల్సిన అవసరమే వుండేదికాదు. సీతాదేవిని రావణాసురుడు ఎత్తుకుపోయేక శ్రీరాముడు లంకని సమీపించగానే యుద్ధానికి సిద్ధమైపోలేదు. అంగదుణ్ణి రాయబారిగా పంపించేడు. అలా ఎందుకు పంపించేరంటారు? రావణుణ్ణి రాముడు చంపలేకా? కాదే! అలాగే కురుక్షేత్ర మహా సంగ్రామం జరిగే ముందు పాండవులు కూడా శ్రీకృష్ణుణ్ణి రాయబారానికి పంపించేరు? ఎందువల్లంటారు? "

సుభద్రకీ సంభాషణే నచ్చనట్టుగా మాట్లాడింది. "మీరు చాలా గొప్ప పోలికలు తెచ్చేశాననుకుంటున్నారేమో! అంగదుడు, శ్రీకృష్ణుడూ వెళ్లింది మంచివాళ్ల తరపున. మీరు హిందువులు కాకపోవడంవల్ల మా పురాణాలు చదవక వాళ్ల రాయబారాలతో మీ రాయబారాన్నీ పోల్చేసుకుంటున్నారు"

శామ్యూల్ జవాబు చెప్పబోతుంటే మాలతి అతన్ని కళ్లతోనే ఆగమని సంజ్ఞ చేసి సుభద్రతో మాట్లాడింది "మీరు రామాయణ, భారతాల్ని చదివేరాండి? "

"సంస్కృతంలో కాకపోయినా తెలుగులో వెలగబెట్టేం"

"బైబిల్ చదివేరా? "

"లేదు"

"ఖురాన్? "

"అదెందుకు చదువుతాను? "

"వేదాలు? "

"పెద్ద పెద్దోళ్లే చదవలేదు. ఇంక నేనేం చదువుతాను? "

"మా ఆయనగారు క్రిష్టియన్ అయినా ఇవన్నీ చదివేరు. జ్ఞానాన్ని పెంచుకోవాలన్న అభిలాష వుండాలేగానీ జాతులు, మతాలూ దానికి అడ్డురావు కదండి"

రామారావుకి వాళ్లు రావడమే ఇష్టంలేదు. వచ్చేక ఈవిధమైన చర్చ ఆరంభించడం మరీ చిరాకు కలిగించింది. "చూడండి నాకు అనవసర ప్రసంగాలతో టైమ్ వేస్ట్ చెయ్యడం ఇష్టం వుండదు" అన్నాడు.

"సారీ రామారావుగారూ! మీ అమ్మాయి రాయబారాల గురించి మాట్లాడింది కాబట్టి యుద్ధానికి ముందు జరిగే సంధి రాయబారాల గురించి మా ఆయనా వివరంగా చెప్పారు. ఆ రాయబారులు వెళ్లింది మంచి వాళ్ల తరపున వెళ్లేరూ అని మీ శ్రీమతి గారన్నారు. మేం వచ్చింది కూడా మంచి వాడి తరపునే అని మేం చెప్తున్నాం" అంది మాలతి.

"ఎవర్ని మంచివారంటున్నారు? " కళ్యాణి వుక్రోషంగా ప్రశ్నించింది.

"మీ ఆయనే"

"ఆయన గురించి మీకు పూర్తిగా తెలీదు"

"మీక్కూడా తెలీని చాలా విషయాలు తెల్సుకునే మేం వచ్చాం. అతని మంచితనం ఏంటో మాకు అర్థమైంది."

"సర్లెండి... మీరు అతని తరపున వచ్చినప్పుడు అతన్ని మంచివాడూ, మహాత్ముడూ అనకుండా చెడ్డ వాడంటారా? మా అమ్మాయేం ఒళ్లుకొవ్వెక్కి విడాకుల నోటీసు పంపించలేదు. ఒకవేళ అది చిన్నతనం కొద్దీ తొందరపడినా ఒంటిమీదకి వయసొచ్చిన వాళ్లం, పైగా ఆడపిల్ల తల్లిదండ్రులం మేం వూరుకుంటామా? పోనీ మా ఆవిడ సంగతి వదిలెయ్యండి ఆర్డినరీ హౌస్‌వైఫ్. కానీ నా సంగతేంటి? నిన్న మొన్నటి దాకా లా అండ్ ఆర్డర్‌లో మునిగితేలినవాణ్ణి! ఏది నిజమో ఏది అబద్ధాలో తేల్చడంలో కాకలు తీరినవాణ్ణి. అన్ని రుజువులు, అన్ని సాక్ష్యాలూ స్పష్టంగా, కళ్లారా చూశాకే మా అమ్మాయికొచ్చింది అనుమానం కాదు, నిజమేనని నమ్మి మరీ దాని అభిప్రాయాన్ని బలపరిచేను" అన్నాడు రామారావు తన అహంకారాన్ని స్పష్టంగానే తెలియజేస్తూ.

"ఒక్కోసారి మన కళ్లు కూడా మనల్ని మోసం చెయ్యొచ్చండి"

"అది మామూలువాళ్లకి గానీ నాక్కాదు. కళ్ల ముందు స్పష్టంగా నేరం కనిపిస్తే అది నేరమో కాదో తేల్చుకోగల శక్తి అనుభవం నాకున్నాయి"

రామారావు కొన్ని అభిప్రాయాల్ని తనకు తానే తయారు చేసుకుని వాటికే కట్టుబడి పోయి మాట్లాడుతున్నాడని శామ్యూల్, మాలతి గ్రహించేరు. శామ్యూల్ మనసులో ఏదో ఓ నిర్ణయానికొచ్చి రామారావు చూస్తుండగానే తన వాచ్‌లో టైమ్ చూస్కుని "నేనో విషయం చెప్తాను, మీరు కోప్పడనంటే. అఫ్‌కోర్స్ మీరు కోప్పడినా జరిగేదితప్పదనుకోండి". అన్నాడు.

రామారావుకి ఆ మాటలు అర్థంకాక "ఏవిటి మీరు చెప్పేది? " అన్నాడు.

"మీ ఇంటికి మరో పది నిమిషాల్లో పోలీసులొస్తారు, మీ ఇల్లు సోదా చేస్తారు"

"ఎందుకు చేస్తారు? "

"మీ ఇంట్లో బ్రౌన్ షుగర్ పేకెట్లున్నాయి కాబట్టి"

"వాట్ నాన్‌సెన్స్ యూ ఆర్ టాకింగ్? ఇది ఎవరిల్లనుకుని మాట్లాడుతున్నారు? నేనో రిటైర్డ్ పోలీస్ ఇన్‌స్పెక్టర్ని"

"కావచ్చు కానీ నేరం చేసినప్పుడు మాజీ ప్రధానమంత్రినే చట్టం మినహాయించలేదు. అలాంటిది మీరో మామూలు ఇన్‌స్పెక్టర్! మీరు నేరం చేసినప్పుడు..."

"మైండ్ యువర్‌టంగ్ మిష్టర్

శామ్యూల్! హైదరాబాద్‌నించి ఈ వూరొచ్చి నా ఇంట్లో కూర్చుని నన్నే నేరస్థుడని అనడానికి మీకెంత ధైర్యం?"

"మీ ఇంట్లో బ్రౌన్ షుగర్ పేకెట్లు వుంచుకుని మీరు వ్యాపారం చేస్తున్నప్పుడు మీరు నేరస్థుడెందుకవరు?"

శామ్యూల్ మాటలకి రామారావు, కళ్యాణి, సుభద్రలు కుతకుతలాడిపోయారు. అతను ఎందుకలా మాట్లాడుతున్నాడో విజయ్‌కీ అర్థం కాలేదు. మాలతికి తన భర్త ఏదో ఆలోచించే మాటల తీరుని ఈ దారికి తిప్పేడని అర్థం చేసుకుంది.

"నా ఇంట్లో బ్రౌన్ షుగర్ పేకెట్లు లేవని నేను ఛాలెంజ్ చేస్తున్నాను. అవి నా ఇంట్లో లేకపోతే మీ మీద డేమేజ్ షూట్ వేస్తాను" రామారావు చాలా ఆవేశంగా హూంకరించాడు.

"రామారావుగారూ మీరు నా మీద డేమేజ్ షూట్ వెయ్యడమా? లేక వురికంబం ఎక్కించడమా అనేది పోలీసులొచ్చి మీ ఇల్లు సోదాచేసి బ్రౌన్ షుగర్ పేకెట్లు చూసి మిమ్మల్ని ఏ పేరుతో పిలుస్తారో విన్నాక అప్పుడు మాట్లాడుకుందాం"

శామ్యూల్ అంత ధీమాగా ఎలా మాట్లాడుతున్నాడో కళ్యాణికి, రామారావుకి అర్థం కాలేదు.

రామారావు పడుతున్న ఆవేశాన్ని గమనించి శామ్యూలే మళ్లీ అన్నాడు.

"మీ ఇంట్లో బ్రౌన్ షుగర్ పేకెట్లు దొరకడం ఏంటా అని ఆలోచిస్తున్నారు, ఆవేశపడుతున్నారు. ఓ నేరస్థుణ్ణి మంచివాడిగా మార్చడం కష్టమేమోగానీ ఓ మంచివాణ్ణి నేరస్థుడిగా నిరూపించడం ఎంతసేపండి? ఈ విషయం నాకంటే పోలీస్ ఇన్‌స్పెక్టర్‌గా పనిచేసిన మీకే బాగా తెలుస్తుంది. మీ ఇంట్లో బ్రౌన్ షుగర్ పేకెట్లు ఎందుకు దొరుకుతాయా అంటే మేం మీ ఇంటికి రావడానికి ఓ అరగంట ముందు మీకు తెలీకుండా ఒకరు వచ్చి మీ ఇంట్లో పెట్టేరు. నేనే పెట్టించాను కాబట్టి"

"ఏదీ మేమందరం వుండగానే" అంటూ సుభద్ర ఛర్రుమంటూ లేచింది.

"సారీ మేం వచ్చేసరికి మీరెక్కడున్నారండి? మీరంతా ఇంటికి తాళంవేసి గుడికెళ్లారు. మేం ఓ పావుగంట వెయిట్ చేశాక మీరొచ్చేరు. మర్చిపోయారా? మీ వీధి తలుపులకి తాళంవేసినా మీ ఇంట్లోని రెండు గదుల కిటికీలూ తెరిచే వున్నాయి. కిటికీ చువ్వలున్నా వాటి సందుల్లోనించి పేకెట్లు లోపలకి విసరడం అసాధ్యమేం కాదు. అవి ఏ గదిలోకి విసిరేరో నేను చెప్పను. పోలీసులొచ్చి వాటిని చూస్తారు, చూశాక మీరు నేరస్థులవుతారు"

రామారావు, సుభద్ర శామ్యూల్‌ని గుడ్లురిమి చూస్తున్నారు. మాలతి, శామ్యూల్ చాలా తెలివయిన వాళ్లని కళ్యాణికి తెలుసు. వాళ్లు కావాలనే తమని నేరస్థుల్ని చేసి వంశీ తరపున ప్రతీకారం తీర్చుకుంటారా? అసలు వాళ్లొచ్చింది రాయబారానికా? ప్రతీకారానికా? రామారావు టెన్షన్లో పడ్డం శామ్యూల్ గమనించాడు. అందుకే మళ్లీ రెట్టించి అడిగాడు.

"చెప్పండి సార్! పోలీసులకి మీరు చేసిన నేరం స్పష్టంగా కనిపిస్తుంది కాబట్టి మిమ్మల్ని నేరస్థుడనే అరెస్టు చేస్తారంటారా? చెయ్యరంటారా?"

"నో! నా ఇంట్లో ఒకవేళ ఆ పేకెట్లు దొరికినా నేను నిందితుణ్ణి అవుతానుగానీ నేరస్థుణ్ణవను"

"ఎందుకవరు?"

"ఎలా అవుతాను? ఆ పేకెట్లు నా ఇంట్లో దొరికినా అవి నాకు సంబంధించినవి కావు. నన్ను కేసులో ఇరికించడానికి ఎవరో కుట్రపన్ని వాటిని నా ఇంట్లో పెట్టేరని చెప్తాను"

"దొరికిపోయిన ప్రతీనేరస్థుడూ మొదట అలాగే చెప్తాడుకదండి. మీ సర్వీసులో మీరూ అలాంటి వాళ్లని చూసుంటారుగా!

మీరిప్పుడు చెప్పినట్టే వాళ్లూ చెప్తే నమ్మే వాళ్లా?"

"నమ్మలేను. కోర్టులో వాదించుకోమని చెప్పి అరెస్టు చేసేవాణ్ణి! అలాగే నేను కూడా కోర్టులో వాదించి నిర్దోషినని నిరూపించుకుంటాను"

శామ్యూల్ చిన్నగా నవ్వి "మేం వచ్చింది కూడా వంశీని నిర్దోషని నిరూపించడానికే!"

ఆ వాదనకి కళ్యాణి, ఆవిడ తల్లిదండ్రులు కాస్త కళవళపడ్డారు. కళ్యాణి మాత్రం శామ్యూల్‌తో కాస్త వాదనకి దిగింది. "ఏవిటండీ మీరు నిరూపించేది? వంశీని పోలీసులు లాడ్జిలో పట్టుకోవడం అబద్ధమంటారా? మా డాడీ వెళ్లినప్పుడు ఆయన ఇంట్లో మందుకొడుతూ తన గర్ల్‌ఫ్రెండ్ జయలతతో బెడ్‌రూమ్‌లో వుండడం అబద్ధమంటారా? వాళ్లిద్దరూ లాడ్జిలో పోలీసులకి దొరికేక నేనెళ్లి ఆవిణ్ణి ముఖంమీద చెప్పుతో కొట్టినంతపని చేశాను. అయినా ఆ తర్వాత కూడా వాళ్లిద్దరూ బెడ్‌రూమ్‌లో కనిపించడం అబద్ధమంటారా? "

"అవీ అబద్ధంకాదు. ఇప్పుడు మీ ఇంట్లో దొరకబోయే బ్రౌన్‌షుగర్ పేకెట్లు కూడా అబద్ధంకాదు కళ్యాణిగారూ"

"చూడండి శామ్యూల్‌గారూ! మీరు చాలా తెలివిగా మాట్లాడేననుకుంటున్నారా? మీరు చేసిందానికీ నేను చూసిందానికీ ఎటువంటి సంబంధమూ లేదు. ఎందుకంటే నన్ను నేరస్థుడిగా నిరూపించడానికి ఎవిడెన్స్ అంతా ప్రీప్లాన్డ్‌గా ఏర్పాటు చేశారు. కానీ వంశీ మందు కొట్టడం, జయలతతో వుండడం ఈ సంఘటనలు మరొకరు ఏర్పాటు చేసినవికావు"

"ఒకవేళ పరిస్థితులే అలాంటి సన్నివేశాల్ని ఏర్పాటు చేస్తే? ఒక్కోసారి కల్పన కంటే వాస్తవిక సంఘటనలే చాలా చిత్రంగా వుంటాయ్, పవర్‌ఫుల్‌గా వుంటాయ్! ఈ వాస్తవ సంఘటనలు మేధావుల వూహలక్కూడా అందవు! బట్ సమ్‌టైమ్స్ అలా జరుగుతుంటాయ్! మీరూ ఒప్పుకోవాలి"

"నేనొప్పుకోను"

"కరుణకి, మమతకి మారుపేరయిన ఓ ఆడది తన నడుముకి ఓ పవర్‌ఫుల్ బాంబ్ కట్టుకొచ్చి ఓ మాజీ ప్రధానమంత్రి కాళ్లకి నమస్కరించినట్టే నమస్కరించి ఓ రిమోట్ కంట్రోల్‌తో ఆ బాంబ్‌ని పేల్చి శత్రువుని చంపుతూ తనూ ఆత్మాహుతి చేసుకుంది. ఈ సంఘటన పందొమ్మిది వందల తొంభై ఒకటో సంవత్సరానికి ముందు ఓ రైటర్ ఓ నవల రాసినా, ఓ డైరెక్టరు సినిమా తీసినా దాన్ని అభూతకల్పన అంటారు. అబద్ధమంటారు. అసహజమంటారు. ఓ ఆడది ఎప్పటికీ అంత రాక్షసత్వాన్ని ప్రదర్శించదూ అంటూ వాదిస్తారు. కానీ ఇదే స్కీమ్‌లో రాజీవ్‌గాంధీని శ్రీలంక లేడీ థానూ చంపేసింది. ఇది నూటికి నూరొంతులూ వాస్తవమని అందరికీ తెలుసు. అలాంటి సంఘటన ఎక్కడా ఎప్పుడూ జరగలేదు. నౌ... ఇప్పుడు చెప్పండి సార్! మేధావుల వూహక్కూడా అందనంత స్థాయిలో ఓ వాస్తవిక సంఘటన జరిగింది. దాన్ని మనం కాదనగలమా? కల్పనకంటే వాస్తవమే అద్భుతంగా వుంటుందనే మాటని మీరు ఒప్పుకుంటారా? "

రామారావు పోలీసు వ్యవహారాలతో కాకలు తీరిపోయిన మనిషై వుండి కూడా శామ్యూల్ వాదనని ఖండించలేకపోయాడు. కళ్యాణి ఏ భావమూ వ్యక్తం చేయకుండా చూస్తోంది. మాలతి, కళ్యాణిని ఉద్దేశించి మాట్లాడింది.

"మీరు నెగిటివ్ థింకింగ్‌తో ఆలోచిస్తున్నారూ, ఆ పద్ధతి మంచిది కాదూ అని నేనోసారి ఎడ్వయిజ్ చేశాను. కానీ మీరు మీ ధోరణిని మార్చుకోలేదు. మీరు మీ ఆయన్ని ఎప్పుడూ అనుమానం అనే కళ్లద్దాల్లోనించి చూశారు. మీ మనసుకి మీరే

గంతలు కట్టేసుకున్నారు. అందుకే లాడ్జీలో దొరికిన శ్రీలత పేరు వినగానే ఆ పేరుని జయలతగా అన్వయించుకున్నారు. అనుకోకుండా జయలత అదే రోజు వాళ్లమ్మగారికి ఒంట్లో బాగులేదని శెలవు పెట్టింది. మరో ముఖ్యమైన విషయం చెప్పమంటారా? "

"ఇన్ని చెప్తున్నారుగా అది కూడా చెప్పండి" అంది కల్యాణి.

"ఆరోజు అజంతా లాడ్జీలో పోలీసులకి దొరికింది శ్రీలత అనే అమ్మాయి. అంతే కాదు ఆ హోటలకి ఆ అమ్మాయిని తీసుకు వెళ్లింది మీరెంతో మంచివాడిగా భావించే విజయ్‌కుమార్"

కళ్యాణి అదిరిపడలేదు. నిశ్చలంగా చూస్తూ వుండిపోయింది. "ఒకరోజు మీ ఇంట్లో పేకాడింది, విస్కీతాగింది వంశీగారు కాదు, విజయ్‌కుమార్, ఆయనతో పాటు మీ ఆయనగారి ఆఫీస్ కొలీగ్స్! ఇప్పుడు మేం విజయ్‌కుమార్‌ని తీసుకొచ్చింది ఓ దొంగసాక్షిని కాదు. ఆయన మీకు చెప్పే కొన్ని నిజాలవల్ల మీకు ఎంతవరకు లాభం వుంటుందో తెలీదుగానీ అతని కాపురంలో మాత్రం కల్లోలం చెలరేగుతుంది" అంటూ విజయ్‌వైపు తిరిగి "నౌ యూ కెన్ స్టార్ట్" అంది.

విజయ్ ఎటువంటి దాపరికంలేకుండా జరిగిన సంఘటనలన్నీ చెప్పాడు. అందులో తన జోక్యం ఎంతవుందో చెప్పాడు. వంశీకి అసలు జోక్యమేలేదని చెప్పాడు. అందరూ మౌనంగా, శ్రద్ధగా వింటున్నారు తప్ప ఎవరూ జవాబు చెప్పలేదు.

శామ్యూల్ మాట్లాడుతూ "వంశీ గురించి కొంత విన్నారు. అతను చేసిన తప్పుల్ని క్షమించండీ అని ప్రార్థించడానికి మేం మీ దగ్గరకి రాలేదు కళ్యాణిగారూ! మీరు మీ తప్పుల్ని తెల్సుకుని వంశీని దక్కించుకోండి అని సలహా ఇవ్వడానికొచ్చాం" అంటూ రామారావు వైపు తిరిగి "రామారావుగారూ, మీరు ప్రతీ విషయాన్ని పోలీస్ దృష్టితో అంటే అనుమానపు దృష్టితో చూడ్డానికే అలవాటు పడ్డారు. ఆ పద్ధతే మంచిదని మీ కూతురికీ బోధించారు. సంసారంలో తలెత్తే ప్రతీ చిన్న విషయాన్ని పోలీస్ దృష్టితో చూడ్డమే కరక్టని మీరు నమ్మితే సమాజంలో తలెత్తే ప్రతీ సమస్యనీ తుపాకీయే పరిష్కరిస్తుందనే తీవ్రవాదుల సిద్ధాంతాన్ని కూడా మీరు కరక్ట్ అని ఒప్పుకోవల్సుంటుంది. ఏం ఒప్పుకోగలరా? ఇంక మీరు వంశీ ఇంట్లో జయలతని చూసిన విషయంలో నిజానిజాలు కూడా విజయ్‌కుమారే చెప్తాడు వినండి"

విజయ్ లేచి నిలబడి అటూఇటూ పచార్లు చేస్తూ ఆఫీసు గుమాస్తా రాంబాబు మందుబాటిల్ తెచ్చిందగ్గర్నించి జయలత వయసు మళ్లిన రోగిష్టివాణ్ణి పెళ్లాడ్డం వరకు పూసగుచ్చినట్టుగా వివరంగా చెప్పాడు.

కళ్యాణి, రామారావు, సుభద్రలు ఆ మాటల్ని నమ్ముతున్న రియాక్షన్ గానీ నమ్మలేని రియాక్షన్‌గాని ఇవ్వడంలేదు. వారి స్పందన ఎలావున్నా పట్టించుకోకుండా మాలతి చెప్పదల్చుకున్నది స్పష్టంగా, ఆవేశంగా చెప్పింది. కళ్యాణిగారూ మీరు అజ్ఞానంతోనో అహంకారంతోనో జయలత మీద వేసిన నింద, నిష్ఠూరాలు ఆవిడ జీవితాన్నే అగ్నిగుండంలోకి విసిరేశాయి. తన భవిష్యత్తుని తానే నాశనం చేస్కుంటూ సంసారానికే పనికిరాని ఓ వ్యక్తిని పెళ్లి చేస్కోడానికి సిద్ధపడింది. ఆ విషయం చెప్పడానికే మీ ఇంటికొచ్చింది. అదే సమయంలో నిజానిజాలు తేల్చడంలో కాకలు తీరిన మీ నాన్నగారు ఆవిణ్ణి చూసి నేరాలు, రుజువులు, సాక్ష్యాలూ అంటూ ఆవిణ్ణి మానసికమైన చిత్రహింసకి గురిచేశారు. మీ దంపతుల్ని కలపాలనే ఉద్దేశ్యంతోనే జయలత తనకి తానుగా తన జీవితాన్ని నిప్పులగుండంలోకి నెట్టింది. మీరు చెవులప్పగించి వినడం కాదు. మనసు పెట్టి ఆలోచించండి. ఓ

వ్యక్తి ఆత్మహత్య చేసుకుంటే ఆ ఘాతుకానికి కారణమైన వారిని కూడా చట్టప్రకారం శిక్షి స్తారు. జయలత తన భవిష్యత్తుని బలి చేసుకుంటూ తన మనసుని, కోరికలని దారుణంగా చంపేసింది. అందుకు కార కులు ముమ్మాటికీ మీరేనని తెలుసుకుంటే మీకు కొంచెమైనా సంస్కారం వుందని భావిస్తాం"

"మీ ఇంటి గోడలనిండా దేవుడి పటాలే కనిపిస్తున్నాయి. అంటే మీ అందరికీ దైవ భక్తి ఎక్కువని తెలుస్తోంది. ఏ భాషలో ఎవరు ఏ దేవుణ్ణి ప్రార్థించినా ఏమని కోరు కుంటారండీ? "

అలాంటి గృహం అనబడే స్వర్గంలో వుండేది ఎవరండి? మనమేకదా! ఒకరినొ కరు అర్థం చేసుకుని పరస్పరం ప్రేమించు కుని బతగ్గలిగితే మన జీవితమే స్వర్గమవు తుంది. అపార్థాలు, అనుమానాలతో మన జీవితంలో మనమే సంక్షోభాలు సృష్టించు కుంటే అదే నరకమవుతుంది.

"తన స్నేహితుడి కాపురంలో కలతలు రాకూడదన్న ఒకే ఒక్క కారణంగా విజయ్ చేసిన తప్పులకి వంశీ శిక్ష అనుభవించి స్నేహం అనే రెండక్షరాల మాటకి అతను ఓ పవిత్రతని చేకూర్చాడు. అలాగే విజయ్ కూడా తన స్నేహితుడి సంసారం సుడిగుం డంలో పడేసరికి బాధపడి పరివర్తన చెంది



అతని ప్రశ్నలకి ఎవరూ స్పందించినట్టు కనబడ్డమూలేదు. ఎవరూ ఎటువంటి జవాబు ఇవ్వడంలేదు. అయినా శామ్యూల్ తను చెప్పదలుచుకున్నది నిర్భయంగానే చెప్పాడు. "ఇహలోకంలో సుఖసంతోషాలు, పరలోకంలో స్వర్గ ప్రాప్తి కలగాలనే కోరు కుంటారు. అందరూ అనుకుంటున్నట్టుగా స్వర్గం అనేది వుందా? వుంటే గింటే అది మన జీవితంలోనే వుంది. స్వర్గం మన చేతుల్లోనే వుంది. పుణ్యం మన చేతల్లోనే వుంది. గృహమే కదా స్వర్గసీమ అన్నారు.

తను చేసిన తప్పుల్ని మీ అందరి ఎదుట దాపరికంలేకుండా ఒప్పుకున్నాడు. ఈ విషయం ఎందుకు చెప్తున్నానంటే మేం చెప్పిందంతా విన్నాక మీలో మార్పు కలి గితే మంచిదే! ఒకవేళ మీరు మారకపో యినా మేం చేయగలిగేదేం లేదు. అనుమా నాలు, అపార్థాలతో స్వర్గంలాంటి సంసా రాన్ని నరకంగా మార్చుకుంటున్న చాలా

మందిలో మీరు ఒకరని సరిపెట్టుకుంటాం. కానీ ఇప్పుడు విజయ్ మీకు చెప్పిన విష యాల్ని ఆయన భార్యతో మాత్రం చెప్ప కండి. అలా చెప్పడంవల్ల మీకెటువంటి లాభమూ కలక్కపోగా స్వర్గంలాంటి ఆ సంసారం నరకంలా మారుతుంది. ఒకవేళ మీరు తెలుసుకున్న నిజాల్ని విజయ్ భార్య ముందు కక్కేసే వరకు మీకు మనశ్శాంతి వుండదనుకుంటే మీరు వెళ్లి చెప్పొచ్చు కానీ మీరు చెప్పేముందు మీ వల్ల ఒక జీవిత సౌఖ్యాన్ని నష్టపోయిన జయలతని ఒక్క సారి గుర్తు చేస్కోండి. జలుబు చేసిన ముక్కుతో మల్లెపూలు వాసన చూసి వాటికి సువాసనలేదని ఛీత్కరించేముందు మన ముక్కుసరైన స్థితిలో వుందో లేదో ఆలోచిం చుకుంటే బావుంటుందేమో"

సోఫాలో సీరియస్ మూడ్‌తో కూర్చుని మీసాలు దువ్వుకుంటున్న రామారావు దగ్గరకెళ్లి "మర్రిచెట్టు చూడ్డానికి చాలా పెద్ద వృక్షంగా కనిపిస్తుంది. కానీ దానికి కాచే కాయలు చాలా చిన్నవిగా వుంటాయి. మీకి ప్పుడు అరవయ్యేళ్లు. ఇన్నేళ్ల అనుభవంలో మీరు చాలా జీవిత విధానాల్ని చూసుం టారు. మీ అనుభవానికి తగ్గట్టుగా మీ ఆలోచనలూ పరిపక్వతని సాధిస్తే మీరు చాలామందికి ఆదర్శమవుతారు. లేకపోతే మర్రిచెట్టు ఉపమానం ఎందుకు చెప్పేనో మీకు అర్థమయే వుంటుంది. నా అంత వయసు వాడికి నాకంటే చిన్న వాడు సల హాలు చెప్పడమేంటాని మీకు కోపం కల గొచ్చు కానీ ఏనుగంత బలమైన జంతువు



గోతిలో పడినప్పుడు దానికంటే బలహీనుడైన మానవుడే దాన్ని బైటకి లాగ్గలుగుతాడు. మీ ఇంట్లో బ్రౌన్ షుగర్ పేకెట్లు ఉన్నాయని, నేనే వుంచేనని మీతో అబద్ధం చెప్పినందుకు క్షమించండి. మనం ఒక నేరంలోని నిజానిజాలు పరిశీలించినప్పుడు మనకి కనిపించే రుజువులూ, సాక్ష్యాలేకాదు వాటికి అతీతమైన పరిస్థితులు కూడా వుంటాయని మీకు తెలియడానికే మిమ్మల్ని కాస్సేపు టెన్షన్‌లో పెట్టేను. ఒక మంచి పని చేయడానికి కొన్ని ముళ్లదారులు తొక్కినా పర్వాలేదని నేను ప్రాక్టికల్‌గా తెల్సుకోబట్టే నేను ఆవిధంగా ప్రవర్తించాల్సొచ్చింది. ఇంత చేసినా మేం ఫెయిల్యూర్‌ని ఎదుర్కోవలసి వచ్చింది. కానీ ఇది మా ఫెయిల్యూర్ కాదు. మంచితనం ఫెయిల్యూర్... దాన్ని మీరు సాధించిన విజయంగా భావించినా నాకేం అభ్యంతరంలేదు"

ఇప్పుడు అందర్నీ ఉద్దేశించి చెప్పాడు. "మేం ఇవాళ సాయంత్రం వెళ్లిపోతున్నాం. రేపు ఉదయం ఏడుగంటలనించి నలభై ఎనిమిది గంటల్లోగా మీ అభిప్రాయాన్ని వంశీకి తెలియజేయండి. అప్పటికీ మీనించి ఫోన్ రాకపోతే వంశీ తరపున వకాల్తా పుచ్చుకుని మా ఆవిడ కోర్టుకొస్తుంది. అది కూడా వంశీ నిర్దోషని నిరూపించడానిక్కాదు. మీరందరూ కోరుకుంటున్న విడాకుల్ని మంజూరు చేయించడానికే. భార్యాభర్తలు ఒకర్నొకరు అర్థం చేసుకుని జీవిస్తే సంసారపుష్పం సుగంధాలు విరజిమ్ముతుందిగానీ కాగితం పువ్వు మీద ఎన్నాళ్లు సెంటుజల్లి వాసన చూస్తాం. మేం వస్తామండి. శెలవ్, నమస్కారం"

శామ్యూల్, మాలతి, విజయ్ రెండు చేతుల్తో నమస్కరించారు. కానీ అక్కడున్న ముగ్గుర్లో ఒక్కరూ ప్రతి నమస్కారం చెయ్యలేదు. కనీసం వాళ్లని చూడకుండా ఫ్యాన్‌వైపు ఒకరు, గోడవైపు ఒకరు, గుమ్మం వైపు ఒకరు చూస్తుండి పోయారు. శామ్యూల్ మిగతా ఇద్దర్నీ తీసుకుని వెళ్లిపోయాడు.

★ ★ ★

మర్నాడు ఉదయం ఆరుంపావుకి సికింద్రాబాద్‌లో ట్రైన్ దిగిన శామ్యూల్, మాలతి, విజయ్ ఏడుగంటలకి వంశీ ఇంటికి చేరుకుని విశాఖపట్నంలో జరిగిన సంభాషణ సారాంశాన్ని తెలియజేశారు.

"ఎలాగూ శెలవులోనే వున్నారు కాబట్టి ఈ రెండు రోజులూ ఇంట్లోనే వుండండి. ఏ నిమిషంలోనైనా ఏదో ఓ మేటర్‌తో ఫోన్ కాల్ రావచ్చు ఆ కాల్ మీదే మనం మున్ముందు చెయ్యాల్సిందేమిటో తేలుతుంది" అంది మాలతి.

వంశీ మౌనంగా వుండిపోయాడు. ఆ తర్వాత విజయ్, శామ్యూల్, మాలతి ఎవరిళ్లకి వారు వెళ్లిపోయారు. ఆ రోజంతా వైజాగ్‌నించి ఫోన్ రాలేదు. ఆ రాత్రీ రాలేదు. మర్నాడు కూడా రాలేదు. శామ్యూల్ ఇచ్చిన గడువుదాటి పోయిన రెండు గంటల తర్వాత ఫోన్ మోగింది. వంశీ ఆత్రంగా ఫోన్ ఎత్తేడు. అవతల్నించి మాట్లాడుతున్నది కళ్యాణి కాదు మాలతి.

"ఫోన్ రాలేదుకదూ? " అంది మాలతి.

"వుహూ"

"ఓకే మనం ఆ నోటీస్‌కి ఇవాళ రిప్లై పంపిద్దాం. ఓసారి మా ఇంటికొస్తారా? "

"ఊ" అంటూ ఫోన్ పెట్టేసి సోఫాలో వెనక్కి వాలబోతుండగా తలుపు కొడుతున్న శబ్దం వినిపించింది. మెల్లగా లేచివెళ్లి తలుపు తీశాడు.

ఎదురుగా కళ్యాణి! ఆమె చేతిలో సూట్‌కేస్!

ఆశ్చర్యంగా చూస్తున్న వంశీని ఆమె గుమ్మం బయటే నిలబడి అడిగింది

"మే ఐ కమిన్? "

వంశీ పెదవులమీద చిరునవ్వు మెరిసింది. భార్యని చెయ్యిపట్టుకుని ఇంట్లోకి తీసుకువెళ్లాడు.

# చమత్కార ప్రపంచం

## ప్రాణరక్షణకి మార్గం

ఆస్ట్రేలియాలో ఉత్తరభాగంలోని సముద్ర జలాల్లో అత్యంత విషపూరితమైన జలచరం సీవాస్ప్ ఎక్కువగా కనిపిస్తుంది. ఇక్కడికి ఈతకోసం వచ్చేవాళ్ళ సంఖ్య కూడా ఎక్కువే. ఈ జలప్రాణికి తల పెద్ద బ్యాస్కెట్ బాల్‌లా వుండి గంట ఆకారంలో వుంటుంది. ఈ తలకి సుమారు 15 అడుగుల పొడవుగల 60 టెంటకిల్స్ వేలాడుతూ వుంటాయి. వీటిలోని అతి ప్రమాదకరమైన విషం 30 సెకండ్లనుంచి 4 నిముషాలలో మనిషి ప్రాణం తీస్తుంది. ఒక్కొక్క ప్రాణిలోని విషం 60 మందిని చంపగలదు. ఖర్చయిన విషం మళ్ళీ ఉత్పత్తి అవుతూనే వుంటుంది. అయితే ఈ ప్రాణభయం మనిషి దీని టెంటకిల్స్‌కి తగులుకున్నప్పుడు మాత్రమే తప్ప కావాలని ఇవి ఎవరికీ హాని చెయ్యవు. నీటిలో నిశ్శబ్దంగా ఈదుకుంటూ పోతాయి. టెంటకిల్స్‌తో నీటిని వెనక్కి తోసుకుంటూ ముందుకు పోతున్నప్పుడు చేపలు వీటికి తగులుకుని ఆ విషానికి చస్తూ వుంటాయి.

అందువల్ల ఈ రకం విషప్రాణులు ఎక్కువగా వున్న అక్కడి సముద్రజలాల్లో ఈతగాళ్ళకి ప్రాణరక్షణకి ఒకే ఒక్క మార్గం వుంది. నైలాన్ క్లాత్‌తో ఒళ్ళంతా కవర్ చేసుకునేలా దుస్తులు కుట్టించుకుని, అవి ధరించి నీటిలో దిగితే దాన్నుండి తప్పించుకోవచ్చును. టెంటకిల్స్ నైలాన్ వస్త్రాలను ఛేదించలేవు. అందువల్ల విషం శరీరంలోకి దిగే ప్రమాదంలేదు. ఈ వస్త్రంవల్ల నీటిలో ఈదినంతసేపూ ఎంతో ఉక్కపోతగా అనిపిస్తుంది ఈతగాడికి. అయినా ప్రాణరక్షణకి అదొక్కటే మార్గం.



## వెకేషన్ స్పాట్

సెంట్రల్ మెక్సికోలో గౌనాజువాటో అనే ప్రాంతం వుంది. ఒక లోయలో వుండే ఈ ప్రాంతం వెకేషన్ స్పాట్‌లా వుండడంతో చుట్టుపక్కల ప్రాంతపు ప్రజలు శలవు దినాల్లో అక్కడికి వస్తూపోతూ వుంటారు. క్రీ.శ. 1500 మధ్య ప్రాంతాల్లో. ఆ నగరం లోని వీధుల్లో భూమికింద బోలెడంత వెండి లభించిందనీ, దాంతో అది మెక్సికోలోని అత్యంత ధనవంతమైన నగరమయిందనీ అంటారు. స్పెయిన్ వాస్తు నిర్మాణాన్ని పోలిన కట్టడాలు ఈ నగరంలో ఎంతో శోభాయమానంగా కనిపిస్తాయి. ఇక్కడి స్థానిక నిబంధనలు ఈ నగర సౌందర్యాన్ని పరిరక్షిస్తూ, ఆధునిక పద్ధతిలో నిర్మాణాలు జరగకుండా చూస్తున్నాయి. వాల్ పెయింటర్ డీగోరివేరా జన్మస్థానం ఇదే. అతడి పెయింటింగ్స్‌కి సంబంధించిన ఓ మ్యూజియం ఇక్కడ వుంది.

గౌనాజువాటో 'మమ్మీ'లకి ప్రసిద్ధి. నిన్న మొన్నటిదాకా వీరు శవాల్ని భూమిలో పాతడానికి వసూలు చేసే రుసుము చెల్లించకపోతే, కొన్నిరోజులు టైమిచ్చి అటుపైన ఆ శవాన్ని వెలికితీసి మమ్మీలుగా మ్యూజియంలలో భద్రపరిచేవారు. చిత్రమేమిటంటే అక్కడి వాతావరణ పరిస్థితులు... మట్టిలోని నిలవ వుంచే గుణం... ఇవన్నీ మృతదేహాన్ని కుళ్ళకుండా తాజాగా వుండేలా చేస్తాయి.




ఆ మ్యూజియంలోని మమ్మీలను చూడ్డానికి జనం చేంతాడంత క్యూ కట్టి నిలబడతారెప్పుడూ. ఆ మ్యూజియంకి బయట అమ్మే కీ చెయిన్స్‌మీద, టీ-షర్టులమీద పుర్రెలు, కాఫిన్ల బొమ్మలుంటాయి. అవే సందర్శకులు ఎగబడి కొనడం విచిత్రం.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78